

నాలుగు తరాల చిత్రం కవిగారు – పితాశ్రీ
ఆకునూరు లక్ష్మీనరసింహారావు గారు,
కుమారుడు గౌతం, మనుమడు అమోఘ్,
శ్రీమతి డా॥స్వర్ణలత లతో

కవిగారి

# ఆత్మద్యుతులు

(సహస్రాధిక ఆత్మిక ఆధ్యాత్మిక సిరులు)


## కవిగారు

(ఆకునూరు గోపాల కిషన్ రావు)



**సూర్యశక్తి ఇంటర్నేషనల్**

**కవిగారి కళా పీఠము**

వాసవినగర్, సికింద్రాబాద్-500 015.

# కవిగారి ఆత్మద్యుతులు

## కవిగారు

(ఆకునూరు గోపాల కిషన్ రావు)

ఆరవ కవితా సంకలనం

ప్రథమ ముద్రణ

ఆగష్టు 2000

కాపీలు 500

ప్రతులకు

సూర్యశక్తి
86, వాసవీనగర్
సికింద్రాబాద్ - 15
ఫోన్ : 7747888

అమ్మకృప - స్వర్ణాలయం
97, వాసవీ కాలనీ 'A'
సికింద్రాబాద్ - 15
ఫోన్ : 7747882

ముద్రణ

కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్
ముషీరాబాద్
హైదరాబాద్ - 500 020.

వెల రూ॥ 75/-

జై ఓం 28401

# సకల బలుడు

ఒక శక్తి సృష్టి నడకను
నికరముగా నిర్వహించు నీమము తోడన్
సకల బలుడు ఆ శక్తిగ సకలురము
వంచవలె తల సాకల్యముగా !

# స్ఫూర్తిశ్రీలు

ఇంతగ భావనా పరంపరలు
~~ఈ~~ సహస్రాధిక ఆత్మద్యుతులు
అంకురింపించిన స్ఫూర్తిశ్రీలకు
అంతరంగ హృదయాంజలులు !



# ప్రణవము

బీజాక్షరముల మూలము
వేద మంత్రముల శీర్షము
ఓంకారమో మూడు తత్త్వాల
ఓజోమయ ప్రణవము !

'అ' 'ఉ' 'మ్' లను వ్యాహృతులు
అనంతకాంతులు మూడు
విశ్వమునే శాసిస్తున్నవి
వేద భావనలు చూడు !

'అ' అంటే పరమ పితా పరమాత్ముడు
'మ్' అనగా మనలో ఉండే జీవాత్ముడు
జీవుని దేవుని దరిచేర్చి జోడించే
బంధమే మధ్య 'ఉ' ప్రకృతి మాత చూడు !

# శ్రీ గాయత్రీ మహా మంత్రము

ఓమ్ భూర్భువః స్వః ।
తత్సవితుర్వరేణ్యం ।
భర్గోదేవస్య ధీమహి।
ధియో యోనః ప్రచోదయాత్ ॥

(ఋ 3-62-10; యజు 3-35, 22-9, 30-2, 36-3,
సామ 3462; అనేకానేక సంహితా బ్రాహ్మణ అరణ్యకములు)

| | | |
|---|---|---|
| గురు | | ఋషి : విశ్వామిత్రుడు |
| సావిత్రీ | మంత్రము | ఛందం : గాయత్రి |
| పరమ | | స్వరం : షడ్జమము |

దేవత : సవిత

## తెలుగు పాఠము

ఏ సచ్చిదానంద సవితృ తేజః పుంజము
ప్రేరేపించునో మాలో సదా సద్వర్తనము
అవిద్యాపాశ హరుడా శుద్ధ స్వరూపుణ్ణి
అట్టి బుద్ధి మాకొసగాలని ధ్యానింతుము !

## మాతృ స్తవము

చదువుల తల్లీ సరస్వతి
చల్లగ చూడవె బ్రహ్మసతి
జనుల జ్ఞాన విజ్ఞానాలకు
జన్మ ధన్యతకు కారయితి !

కమల నయని కామిత దాయిని
వీణాపాణి విద్యాదాయిని
హంసవాహిని శుభ ప్రదాయిని
ఆరంభింతును నమోస్తుతేయని !

## నమ్మండి

అక్షర లక్షల దొంతరలు
అమర్చే శక్తి నాకెక్కడిది
అన్నీ సకల బలుని లీలలు
ఆయనే నా కలం నడిపించేది !

ఆలోచన రావడమే తరువాయి
ఆవేశంగా స్పందించును మెదడు
మదిలో మనోజ్ఞ భావాలల్లుకుపోయి
మరుక్షణం మార్దవంగా వ్రాయబడు !

తెలుగులోని అన్ని కవితా రీతులు
వెలుగులీను ఛందో స్వరజతులు
నన్నలరించెనేలనో అతిగా మరి
ఉరుదూ రుబాయీల సొగసులు !

కవిగారి చౌపదలు
కమనీయమౌ సుధలు
చదువుతుంటే ఊరు
చెలమలట్టే చవులు
ఒకటి చదివిన మీరు
వదలనే వదలరు
అన్నిటి దదే తీరు
ఆహ్లాద పడతారు !

యతి ప్రాస గణ
నియతులేవి లేనిది
ఛందాది గుణగణ
జాలములూ లేనిది
నా కవితా చందమిది
అందుంటే అందమున్నది
గురుతెరింగించు నా
గుండె ఆర్భాటమది !

# ఆత్మాదర్శం

జనావళిలో ఒకనిగా
మనడంలో లేదు మహిత
అందరికన్నా భిన్నంగా
ఆచరించడమే ఘనత !



నల్గురినీ నవ్వించుట
నా జీవిత పరమ ధ్యేయం !
నల్గురికీ సాయపడుట
నా చేతల నర్మ భావం !
నల్గురకూ హృది పంచుట
నా కవితల నడక విధానం !
నల్గురునూ ఎదుగ జూచుట
నా కన్నుల ఎద ఆరాటం !
నల్గురికై కరిగి పోవుట
నాకు సదా మహదానందం !

డా॥ సి. నారాయణరెడ్డి
ఎమ్.ఎ.; పిహెచ్.డి., డి.లిట్
పార్లమెంట్ సభ్యులు (రాజ్యసభ)



21 ఫెరోజ్‌షా రోడ్,
న్యూఢిల్లీ- 110 001.
ఫోన్: 3782339

---

ప్లాటు నెం. 48, రోడ్ నెం 6,
ఫిలింనగర్, జూబ్లీహిల్స్,
హైదరాబాద్ - 500 033.
ఇంటి ఫోన్: 3548451



తేది: 28.07.2000

## ఆత్మావిష్కరణ

ఆకునూరు గోపాల కిషన్ రావు గారికి కవిత్వమంటే నిలువెల్లా పులకలు. 'కవిగారు' ఆయన మరో పేరు. తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు భాషా సాహిత్యాలను అధ్యయనం చేసాడు. ఎక్కడ కవిత్వం మెరుస్తుందో అక్కడ తాను నిలబడ్డాడు. ఆ సంస్కార ఫలితమే అతని స్వీయ కవితల ఆవిర్భావానికి దారి చూపింది.

ఈ సంపుటి పేరు 'ఆత్మద్యుతులు'. శీర్షికను బట్టే తెలుస్తుంది ఇవి కవిగారి ఆత్మీయాంశాల వాహికలని. ఆయనే స్వయంగా చెప్పుకున్నాడు వీటిలో యతి ప్రాసలు, ఛందో బంధాలు లేవని. లేకపోవచ్చు కాని కవితా రేఖలంతగా ఉన్నాయి. అవి సూక్తుల్లా మెత్తగా గుండెకు తాకుతాయి.

గోపాల కిషన్ రావు గారు తమ భావాభివ్యక్తికి ఎన్నుకున్న సముచిత శైలిలో అతని ఇతోధిక కవితా వికాసాన్ని ఆకాంక్షిస్తున్నాను.

చేవ్రాలు
సి. నారాయణ రెడ్డి

# పరమపద సోపానాలు



– స్వామి తత్త్వవిదానంద,

బ్రహ్మవిద్యా పీఠం, అల్వాల్.

శ్రీ కవిగారి కవనం
ఉపనిషదబ్ధి మథనం
గిర గిర తిరుగుతూ వారి కలం
అమృతాన్ని చిందించే మందరం !

సగటు మనిషి భాషలో ఈ చౌపదలు
అసామాన్య విజ్ఞానాన్నందించే ఆత్మద్యుతులు
సామాన్య మానవుని జిజ్ఞాసను తట్టిలేపి
సన్మార్గం వైపు నడిపే పరమపద సోపానాలు !

స్వచ్ఛమైనది వారి మానస సరస్సు
దాని నుండి ఉద్గమించే చౌపదల స్రోతస్సు
పులకరిస్తుంది సహృదయుని మనస్సు
బాగుంది- శుభం భూయాత్ అని నా ఆశీస్సు !

# స్వయం ప్రకాశాలు



-స్వామి ప్రకాశానందేంద్ర

శ్రీ కవిగారి ఈ గేయాలు స్వయం ప్రకాశాలు. వీటి భాషా సరళత, భావగాంభీర్యత, గమన సౌలభ్యత ఎవరినైనా పూర్తిగా చదివిస్తాయి.

జీవితానుభవాల దర్శనం నుండి సహృదయ తతో వెలువడిన ఆణిముత్యాలివి.

ఈ రోజుల్లో ముఖ్యంగా యువకులు చదివితే సహృదయత వికసిస్తుంది. వయోజనులకు ఆత్మ జ్ఞాన దిశా దర్శనమౌతుంది. అన్ని వయసుల వారిని తమ అనుభవాలే నన్నంతగా ఎన్నో కొన్ని ప్రతి ఒక్క-రిని అలరించక తప్పవు. శ్రీ కవిగారు అభినంద నీయులు. వారికి నా శుభాశీస్సులు

# కృత్యంకిత - స్వీకృతులు

## (ప్రియ మిత్రుడు సత్యంకు)



సుధలను చిందు కావ్యములు శ్రోతలు పాఠకులెల్ల మెచ్చెడిన్
విధముగ వ్రాయుటే తనకు విందగు ఈ కవిగారి హృన్మనో
సుధలగు అంశులాత్మద్యుతి సూక్తములన్గొను మంకితమ్ముగా
బుధజనమిత్ర అర్హకవి భూషణ సత్యము నాయుడు మిత్రమా!

– కవిగారు

## స్వీకృతాంజలి

సర్వమానవాళికి
సర్వదా అనువర్తించే
అత్యంతాధునిక
**'ఆత్మద్యుతులు'**
బృహత్కావ్యాన్ని
సార్థక నామధేయులు
శ్రీ కవిగారు
ఆకునూరు గోపాల కిషన్ రావు

అనూహ్యంగా ఆత్మీయతతో
అంకితమివ్వడం
ఆ పరాత్పరుడు
మహోదయులు
కవిగారి ద్వారా
నా జీవితానికి అందజేసిన
అమూల్య బహుకృతిగా
ఆనందంగా స్వీకరిస్తున్నాను

–వడ్డపల్లి సత్యం నాయుడు

# నా రాతలు- చేతలు

మాతామహుల గ్రామం బొల్లికుంట (వరంగల్ జిల్లా) లో పుట్టి మా గ్రామం వెంపటి తాలుకా సూర్యాపేట వాస్తవ్యుడిగా పెరిగి హనుమ కొండ హైదరాబాదులలో విద్య గడించి 36 సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థలో ప్రముఖ ఇంజనీరుగా 'కాంతిసేవ' చేసి మిగతా జీవిత కాలం సాహితీ సేవలో తరించమని సకలబలుని (పరబ్రహ్మ) ఆజ్ఞతో చతుర్ముఖ బ్రహ్మగారు తన రాతగా నా నుదుట వ్రాసిన నారాత. భర్తకు అత్యంత విధేయగా బ్రహ్మగారి సతీమణి సరస్వతమ్మ నన్ను కరుణించిన ఫలితమే నా సాహిత్య యాత్ర నా ఈ రాతలు చేతలు. పాఠక దేవుళ్ళ కందించడం వాటిపై అభిజ్ఞులు దయతో వెలిబుచ్చిన అభిప్రాయాల నవలోడనం చేసుకుంటూ ముమ్మందు కెళ్ళడమే నా ప్రస్తుత గమన రీతి. కలంపట్టిన ఆరోఏట సరిగ్గా ఆరో పుస్తక ప్రచురణ మొనరిస్తున్న ప్రస్థానం నాకెంతో ఆనందదాయకం.

20.02.95 నాడు పూజ్యులు గజలు సాహితీ పితా శ్రీ ఆచార్య సి. నారాయణ రెడ్డిగారి "మౌనరణం" తెలుగు గజలును ఆంగ్ల ఉరుదూ భాషలలోనికి అనువదించిన నాటినుండి వెనుదిరిగి చూడకుండా 1996-1997లలో 22 కవితా సంపుటాలు వ్రాసి 1996-1997లలో అందైదు అచ్చేసి సాహితీ లోకానికి సమర్పించుకున్నాను. ఇదంతా నా పెద మేనమాన కీ.శే. దేవులపల్లి వేంకటేశ్వర రావుగారు (దేవేరా), కీ.శే. దేవులపల్లి రామానుజరావు గారు ప్రసిద్ధ సాహితీ మూర్తుల చిన్నాన్న కుమారుడు, 50 ఏళ్ళ క్రితమే నన్ను "కవిగారు" అని పిలిచిన వాక్శుద్ధి ఫలితముగా నేను "కవిగారు" అన్న పలుకే కలం పేరు పెట్టుకోవడం అవసరమయింది.

**నా ప్రచురిత కవితా సంపుటులు :**

1. కవిగారి స్వగతాలు : 11/96 రిలీజ్. నా బంధుమిత్ర గణాలపై పూర్తి కవితా సంకలనం ఆచార్య సి. నారాయణరెడ్డి గారు ఆవిష్కరించారు.

2. కవిగారి సందర్భ స్వరాలు : 4/97 రిలీజ్. 96-97లలో వచ్చిన అన్ని పండుగలపై కవితా సంకలనం ప్రజాకవి కాళోజీ గారు ఆవిష్కరించారు.

3. కవిగారి స్వర్ణగోపాల శతకం : 6/97 రిలీజ్. నూరు మానవీయ విలువలపై కవితా సంకలనం. డా॥ పోతుకూచి సాంబశివరావు గారు ఆవిష్కరించారు.

4. కవిగారి ప్రియాంశాలు : 10/97- సామాజిక రుగ్మతలు - వైద్యాలు, ఇతర కవితలు. డా॥ నాయని కృష్ణ కుమారి గారు ఆవిష్కరించారు.

5. **కవిగారి గజలు సుందరి :** 12/97 గత సహస్రాబ్ది కవి గాలిబు మరియు 125 మంది పాత క్రొత్త ఉర్దూ రచయితల కవితలకు అనువాదాలు. **డా॥ జె. బాపురెడ్డి గారు** ఆవిష్కరించారు.

1998-1999లలో 12 ఉపనిషత్తులు (ఈశావ్యాస, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, తైత్తిరీయ, ఐతరేయ, శ్వేతాశ్వతర, కైవల్య, అమృత బిందు, స్కందోపనిషత్తులు తెలుగు ఆంగ్ల భాషలలోనికి కవిత్వీకరణ పూర్తి చేయడం హిందీలో సిద్ధింపచేయడం, తెలుగు ఉపనిషత్తులకు పన్నెండు మంది జ్ఞానులైన స్వామీజీలు ఆశీరమృతం (పీఠికలు) అందించడం జరిగింది.

శ్రీమద్భగవద్గీతలోని 701 శ్లోకాలు తెలుగు కవిత్వీకరణ పూర్తి చేసి ఆంగ్ల కవిత్వీకరణ చేపట్టడం జరిగింది. ఇవన్నీ సాధ్యమైనంత త్వరలో పాఠక దేవుళ్ళ కంకితం చేయాలని ఆకాంక్ష. సకలబలుడే నాకా శక్తినివ్వాలి.

ప్రగతి పథంలో పయనిస్తున్న వాడు భూత భవిష్యత్తుల సమీక్షా సమాలోచనం చేసుకోవడంలాంటిదీ ప్రక్రియ. దానిలో భాగంగా నా రచనలపై విజ్ఞ పాఠకుల అభిప్రాయాలను 'కరుణోక్తులు'గా ఈ పుస్తకం చివరలో పొందుపరస్తున్నాను. అభిప్రాయం వెలిబుచ్చిన ఎందరో మహానుభావులు అందరికీ ప్రణతులు. ఇక మొదటి నుండీ -

జనావళిలో ఒకనిగా
మనడంలో లేదు మహిత
అందరికన్నా భిన్నంగా
ఆచరించడమే ఘనత !      నా ఆదర్శమయితే

అక్షర లక్షరల దొంతరలు
అమర్చే శక్తి నాకెక్కడిది
అన్నీ ఆ సకలబలుని లీలలు
ఆయనే నా కలం నడిపించేది !   అన్నది నా దృఢ విశ్వాసం.

1997 అనుకుంటా, ఈ క్రింది చౌపద వ్రాసుకునే తరుణం కల్గింది.

ఆధ్యాత్మిక చింతన చేయుటకు
ఆసన్నం కాలేదు సమయం నాకు
ప్రేయసి, ప్రేమ సుడి గుండాలలోనే
ప్రీతి ఇంకా నాకేదేమో ఈరోజుకు !

ప్రస్తుతం 'సూర్యశక్తి' వైజ్ఞానిక, సాంస్కృతిక మాస పత్రిక సంపాదకేశ్వరులు శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి గారు సూర్యమిత్ర ,సూర్యశక్తి మీటింగ్‌కని చిక్కడపల్లి లోని వారి ఆఫీసుకు నన్ను తీసుకువెళ్ళారు. మీటింగ్‌లో కార్యక్రమమంతా ఆధ్యాత్మిక సంగతమే అందుకని నేను ముళ్ళపై కూర్చున్నట్లు కూర్చుని పై చౌపద అక్కడే వ్రాసుకున్నాను.

6/97లో నా కవిగారి 'స్వర్ణగోపాల శతకం'కు ఆముఖంలో పూజ్యులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు "వేమన లాగ కవిగారు కూడా మకుటాన్ని ఆత్మ సంబుద్ధిగా నిలుపటం విశేషం. సామాన్యంగా తత్త్వవేత్తలు చేసేపని అది. కవిగారు తాత్త్వీక రంగంలో కూడా కవిత్వం సాగిస్తారేమో చూడాలి" అని 15.05.1996 నాడు భవిష్య దర్శనం చేశారు.

నా 'కవిగారి ప్రియాంశాలు' ఆముఖంలో 6-9-1997 నాడు సుప్రసిద్ధ రచయిత్రి, సాహితీ విదుషీమణి, సోదరి శ్రీమతి సి. వేదవతి ( నా పరమ మిత్రుడు వడ్లపల్లి సత్యం నాయుడు నాకీ సోదరిని పరిచయం చేశారు). "ఇతరుల బాధల్ని గుఱించీ, ఇతరుల కన్నీటిని గుఱించీ ఆలోచించ గలిగిన ఈ కవిగారి గురించి నాకు ఎన్నో ఆశలు ఉన్నాయి. కరుణ కలిగిన కవి క్రాంతదర్శి కాక మానడు" అని వెల్లడించింది.

వీరిద్దరూ భాషాజ్ఞానులే కాక భవిష్యద్జ్ఞానులు కూడా అంటే అతిశయోక్తి కాదు గదా?

జనవరి, ఫిబ్రవరి 1997లలో లేని ఆత్మ జ్ఞానం, వీరి వాక్శుద్ధి ఫలితంగా వెంటనే కలగడం. ఈ ఆత్మద్యుతులలో 300 పైగా ఆధ్యాత్మిక చౌపదలు కూర్చ గలగడం దీన్ని ఆధ్యాత్మిక జీవన పరమ పద సోపానంగా చేసుకోవడం, ఉపనిషత్తులు, వేద భాగాలు, భగవద్గీత కవిత్వీకరించడం, మే 2000 "సూర్యశక్తి" మాస పత్రికలలో ఏ సంపాదకులు ఏ రచయితవి ఎక్కడా ఎన్నడూ వేయనన్ని 6 కాలంలు వేసి మెన్ను చరవడం లాంటి కాలం మాయాజాలానికి నేను ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, సోదరి సి. వేదవతి, శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి గార్లకు ఆజీవితం కృతజ్ఞుణ్ణిగా ఉండడం నా కనీస కర్తవ్యం కదా!

ఇంకా ప్రచురించాల్సిన పాత కవితా సంకలనాలే 17దాకా ఉండగా అవి తరువాత, మొదలు వీటి పని చూడు అని పురమాయిస్తున్నాడు ఆ సకలబలుడు. అందుకని ఆత్మ ఆధ్యాత్మల మధ్య కొట్టుమిట్టాడుతూ ఆత్మీకరించిన 'ఆత్మద్యు

తుల'ను, 'భగవద్గీత' 'ఉపనిషద్వేద' జ్ఞాని సకలబలుని సాయుజ్యాల దిశలో ఆరవ మెట్టైనా ఆనందమిచ్చే మొదటి మెట్టుగా పరిగణిస్తూ ప్రచురణ పనిలో నిమగ్నమైనాను.

నేనెపుడేం చేయాలో
నిర్ణయించేది సకలబలుడే
అనుక్షణం మెదిలి మదిలో
ఆజ్ఞలిచ్చేవాడతడే !

ఆయన నిర్ణయానికి తలవంచడమే నేనిపుడు చేస్తున్నది.

అన్ని కార్యాలు నెరవేర్చుతాడు
సకల బలుడు తాననుకొన్నట్లే
వాటి నెవడైనా మార్చగలడు
అనుకుంటే పొరపాటన్నట్లే !

నా జీవితంలో అన్నీ ఆయననుకున్నట్లే జరిగినవి, జరుగుచున్నవి, జరుగుతాయి కూడాను.

కలం నాట్యం చేస్తుంటే
ఇలా వ్రాస్తూ పోతుంటే
కవితా సంకలనాలెన్నైనా
కమనీయంగా వెలుస్తుంటే !

శ్రీమద్భాగవతం, భారత, రామాయణాదులు, బ్రహ్మసూత్రాలు, యోగ వాసిష్టా దులు ఇలాగే కవిత్వీకరించాలని మిత్రుల వాంఛ! ఏదైనా ఆయన ఆజ్ఞ ప్రకారమే జరుగు తుందని నమ్మే నేను ఏమని చెప్పగలను. ఇప్పటివరకు వ్రాసినవే నేను వ్రాయలేదాయె! ప్రస్తుతానికి ఉంటా.

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యో శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినోభవంతు ॥

శుభం భూయాత్

– మీ కవిగారు

# మరువలేను

★ నాకీ ఆకృతినిచ్చి ఇంజనీరును చేసిన బాపు (నాన్న) శ్రీ ఆకునూరు లక్ష్మీనరసింహా రావుగారు (84 సంవత్సరములు), ఆరు నెలల క్రితమే పరమ పదించిన మాతృమూర్తి శ్రీమతి ఆకునూరు రాధాదేవిగార్లను.

★ నాకు అక్షర జ్ఞానం కల్పించి నన్ను విద్యార్జనకు పురమాయించిన మాతా మహులు తాతయ్య కీ.శే. దేవులపల్లి కేశవరంగారావు గారు, అమ్మమ్మ కీ.శే. అండాళమ్మ గార్లను.

★ మాకు ఆస్తినిచ్చి దానితో విద్యార్జనకు తోడ్పడ్డ పితామహులు కీ.శే. ఆకునూరు అప్పా రావు గారు, కీ.శే. ఆకునూరు వెంకట నర్సమ్మగార్లను.

★ మా పితామహులార్జించి పెట్టిన 500 ఎకరాల భూమీ, ఐదు ఇళ్ళు కరిగి మాకు దూరమౌతాయని తన భవిష్యద్జ్ఞానం ద్వారా ఎరిగి కామోసు నన్ను 50 ఏళ్ళ క్రితమే కవిగారూ అని పిలిచెడి నా పెద్ద మేనమామగారు -32వ యేటనే కీర్తి శేషుడైన జ్ఞాని, విజ్ఞాని నిర్వచనాంధ్ర మహా భాగవతాన్నే రచించిన మేధావి శ్రీ దేవులపల్లి వేంకటేశ్వరరావు (దేవేరా) (కీ.శే. శ్రీ దేవులపల్లి రామానుజారావు గారు-తెలుగు భాషా సేవలో పేరొందిన మహనీయుల చిన్నాన్న కుమారుడు). అందుకే నేను "కవిగారు" అని కలం పేరు పెట్టుకొని పోయిన మా సుక్షేత్రం గృహాల గురించి బుర్ర పాడుచేసుకోకుండా ఆయన ఆశీర్వాదంతో సకల బలుని కరుణతో, సరస్వతీ దేవి సాక్షాత్కారంతో, సాహితీ సుక్షేత్రంలో భాగస్తుడనౌ తానని దీవించిన పెద్ద మేన మామయ్యని, ఆయన కాలజ్ఞాన బ్రహ్మ జ్ఞాన మేధకుగానూ .

★ నన్ను సాహితీ క్షేత్ర సేద్యజ్ఞునిగా తన "మౌనరణం" తెలుగు గజలుతో మార్చిన, తెలుగు గజలుకు నాకు సాహితీ పితాశ్రీ ఐన జ్ఞాన పీఠ ఆచార్య సి.నారాయణరెడ్డి గారిని- నా కవి గారి స్వగతాలు గ్రంథావిష్కరణ చేసి ఆశీర్వదించి నప్పటి నుండి నిరంతంగా ప్రోత్సహిస్తున్నందుకు, ఈ పుస్తకానికి ఆత్మావిష్కరణ పేరుతో దయతో ఆముఖం వ్రాసి ఇచ్చినందుకు గానూ.

★ నా సేద్యపు నాగలి కొర్రును పదునుపెడుతూ నా రచనా బీజోత్పత్తిని అడుగడుగునా నాణ్యపరుస్తున్న నా అన్న కాని అన్న పొణుగుపాటి కృష్ణమూర్తిగారిని, నా పంటలు సూర్యశక్తిలో పుంఖాను పుంఖాలుగా వాడుకుంటున్నందుకు గానూ.

★ నా రచనా కృషిలో నిర్విరామంగా గొట్టుతోలుతూ కలుపు మొక్కల నేరి వేస్తున్న పరమ మిత్రుడు పురపాలక సంఘ కమీషనర్‌గా పదవీ విరమణ చేసిన ఆర్షకవిభూషణ వడ్డపల్లి సత్యం నాయుడు గారిని, నా ఈ కృతిని అంకితము గొనేందుకు అంగీకరించి నందుకు గానూ.

★ స్నేహితుడూ, వేదాంతి, మార్గదర్శకుడుగా చిన్నప్పటినుండి నాకు చేయూత నిస్తూ ఈనాటికీ తను కారణమైన నా ప్రగతికి నన్నభినందిస్తూ ఆశీర్వదిస్తూ ఆశ్చ ర్యం వ్యక్తం చేస్తూ నా సాహితీ సేద్యానికి తడికట్టుతూ ముందుకు నడిపిస్తున్న నా చిన మేనమామగారు చతుర్భాషాకవి, చల్లని సహృదయుడు శ్రీ దేవులపల్లి సుదర్శన రావుగారిని, నా కోరికపై సూర్యశక్తి ఇంటర్నేషనల్ సంస్థకై ప్రతిదీ 200 పేజీల 34 సంపుటాలు తెలుగు "బృహజ్ఞాన రత్నాక రం"ను (800 వందలమంది ప్రపంచ జ్ఞానుల జీవితాల తెలిపే జ్ఞాన జలధిని) అప్పుడే 27 సంపుటాలు అంగ్లీకరించి మిగతావి పూర్తి చేస్తున్నందుకు గానూ.

★ అడుగగానే పరమపద సోపానాలు పేరుతో పరిచయ చౌపదలు వ్రాసి వెన్ను తట్టిన స్వామి తత్త్వవిదానంద గారిని, నన్ననంతంగా ప్రోత్సహిస్తున్నందుకు గానూ.

★ నా ఈ సాహితీ ఫలాలను స్వయం ప్రకాశాలుగా అభివర్ణించి, ఆశీరమృతం కురిపించిన పూజ్య స్వామిజీ ప్రకాశానందేంద్ర గారిని, వేదాలలో ఏ భాగాలు కవిత్వీకరించాలో నాకెరింగి స్తున్నందుకుగానూ.

★ పొలంలో కాలిడితే బురద అంటుతుందన్న భయంతో కాబోలు ఒడ్డునే ఉండి నా క్షేత్ర సస్యశ్యామలతనాలకిస్తూ బూడిదవబోయే నా ఈ శరీర క్షేత్రానికి అశనమందిస్తూ సాహితీ క్షేత్రములో నిరాటంకంగా ఫలసాయం పొందనిస్తున్నందుకు నా వారందరిని నా సేద్యపు పంటను చూస్తూ వారి వారి ప్రేమల మేరకు నన్ను అభి మానిస్తూ, ఆనందిస్తూ, అభినందిస్తున్న పాఠక దేవుళ్ళను - వారి అనంత ప్రోత్సా హానికి గానూ.

★ ఈ పుస్తక సుమాన్ని డిటిపీలో పూయించిన మాత "సూర్యశక్తి" డిటిపీ అధినేత్రి శ్రీమతి రాజేశ్వరిని, ఓపికనే తన అలంకారంగా దిద్దుకొని, పని భూతమైనందుకుగానూ, "సూర్యశక్తి"మేనేజర్ శ్రీ శ్యామ్‌కుమార్‌ని, సహాయకుడు శ్రీ ఎమ్. రాజ్ కుమార్‌ని వారి నిస్వార్థ ప్రేమకుగాను,

★ పూసిన ఒక పూవును ప్రెస్సులో విరగబూయించిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ వారిని.

★ చివరికైనా చిన్న ఏ. మాత్రం కాని మిత్రరత్నాలు శ్రీ ఏలూరిపాటి అనంత రామయ్య,శ్రీ మదాసు పిచ్చయ్య, శ్రీ కిడాంబి వీరరాఘవచార్య, శ్రీ అనిపెద్ది వెంకటరమణరావు గార్లను, నాతో సన్నిహితంగా ఉంటూ నా సాహితీ పంటను చూసి మురుస్తున్నందుకు, నా కోపతాపాలు భరిస్తున్నందుకు గానూ.

★ ఇంకా ఈ నా యజ్ఞంలో తలా ఓ సమిధ వేసిన మహానుభావులెందరని ఉటంకించను పేర పేర అందరినీ మరువలేను. - **కవిగారు**

# అమ్మా అమ్మా.......... అమ్మా

**14-12-1999** నాడు స్వర్గస్తురాలైన అమ్మ- ఆకునూరు
రాధాదేవికి అక్షర నివాళులు.

నీ కిష్టు (కవిగారు)

నీతోడు నీడ మా బాపును
నీ తొమ్మిది మంది పిల్లలను
ఇంత అదాటుగా వదిలి
ఎలా వెళ్ళగలిగావమ్మా!

అందరం ఒకేలా కన్నీరు మున్నీరుగా
ఆగకుండా విలపిస్తున్నామమ్మా నీకై
ఆ నెలల నాడే నన్ను నీవు చావనిస్తే
నాకీ ఆగని ఏడుపుండేది కాదు గదమ్మా !

భగవద్గీత కవిత్వీకరించినా
భవ బంధ మిదేమిటమ్మా
మాటలలో నుడువగలగని
మాతా వియోగమేమిటమ్మా!

నెలలప్పుడు నేను చస్తే
గుండె దిటవు చేసుకొని
గుడిసె పైకి విసిరేస్తివి
దొర్లిరాగ బ్రతుక చూస్తివి !

నీవైతే ఆనాడు సంతసించితివి
నాకిపుడీ ఏడుపాదిలి పోతివి
అమ్మా అమ్మా... అమ్మా
ఎంత ఏడ్చినా ఏముందమ్మా

కానరాని లోకాలకు నీవు
కన్పించకుండా మాకు పోతివమ్మా
నిన్ననే నిన్ను కాల్చివేసితిమి
నీవెలా తిరిగి రాగలవమ్మా!

నేను సుఖపడతాననుకొంటివి
నిన్నూ సుఖపెడాతననుకొంటివి
ఏం చేసినా నిన్ను నేనైతే ఏలాగు
ఎడం చేసుకోలేక ఉండలేనైతిని !

అమ్మకృప అని నా యింటి పేరు
అమ్మా నేను పెట్టుకొంటినే
అమ్మా నాకెవరు దిక్కులేరు
ఆలకించు నీవే ఎపుడూ నా మొర !

ఏడుపుతోనే నేను ఎప్పుడూ
ఎదిగి ఎదిగి కుమిలాను
నువు కని, నేను చస్తే కాపాడిన జీవిని
నీ చితిలోనే కాలాలనుకొన్నాను !

ఆత్మ వీడిన నీ కాయాన్ని
అలా దర్శించీ దర్శించిన
క్షణమే స్థాణువునయ్యాను
గుణ దోషాలకు దూరమయ్యాను!

నాకేమీ కానట్లే అనిపిస్తూ
నా అమ్మ చావనట్లే కనిపిస్తూ
నిద్రపోయినట్లున్న నిన్ను
అభద్రుడా అగ్ని కర్పించాము!

ఇన్ని ఏండ్లు నీవు మాకు
ఎంతో ప్రేమగ పంచిన ప్రేమ
క్రొవ్వై నీ చితిని ప్రజ్వలిస్తుంటే
కపాల మోక్ష ధ్వని విన్నాము !

చూశావా నీవు బ్రతికించిన
కొడుకే నిన్నేం చేశాడో
నీలా తను చేయలేక నీవు
కాలిపోతుంటే చూశాడు !

కర్మకాండలో మూడవ రోజు
మర్మం నేను తెలుసుకున్నాను
నీ ఆస్తులక్కడ పిడికెడు బూడిదై
నన్ను పిలుస్తున్నాయనుకొన్నాను !

ప్రేమ మూర్తి గురుతులక్కడ
పిడికెడై పిలుస్తుంటే - ఇక్కడ
ఈ నీ దౌర్భాగ్యపు కొడుకు చూడు
ఎలా ఎలా విలపిస్తున్నాడు!

ఆ చివరి తీపిగుర్తులూ
అవీ నీట కలిపిన తర్వాత
అగుపడేవి మాకింకా
అన్నీ నీ ప్రతి రూపాలే !

ఆ బాధతోనేనేమో
ఆపలేనిదార్తయింది
గంటకు పైగా రోదిస్తూ
కంటనీరు కారింది!

అమ్మ పైన ఇంత ప్రేమ
అమ్మా ఏ కొడుకు కుండదేమో
అమ్మా నిన్నెప్పుడైనా ఏడ్పిస్తే
అది నీపై అవ్యాజ ప్రేమతోనేమో !

మీరంతా వస్తారని
మాతోనే ఉంటారని
అనుకొన్న నా ఆశ
అడియాసే అయింది !

ఏమైనా అందరం
ఎవరిచోట్లల్లో వారం
సంతోషంగా ఉన్నామని
సరిపుచ్చుకున్నాం మనం !

ఆనాడేనాడో రైల్లో తిన్పించిన
అన్నం ముద్దలే గుర్తుకొస్తున్నవి
అవింకా నాకెక్కడివి ఐనా
అమ్మా మళ్ళీ నాకవి పెట్టవా?

గంటపైన ఆగకుండా
నీకినాచ్చేంతగా రోదించాను
కంటనీరు ప్రవాహంగా
ఎపుడూలేనంతగా కార్చాను!

కనులు మూసినా
కనులు తెరచినా
కన్పిస్తున్నదమ్మా నీ చితి
ఎంతదీనమీ సుతుని గతి !

ఫోటో తీస్తే అది చూస్తే
బాధ అని వదిలేస్తే
ఏం చేయనమ్మా కనులే కెమేరాయై
ఈరీతిగ నిను తమలో బంధిస్తే !

చుట్టూ ఉండీ లేని జీవాలతో
ఎట్లో ఏమో ఈదుస్తున్నాను
బాపూ- నీవిచ్చిన ఈ కాయంతో
బ్రతుకలేక చస్తున్నాను !

ఈ కడివెడు కన్నీరే
ఈ కాసిని అక్షరాలే
నీ పాదాలను కడిగి
నేనర్పించే కుసుమాలు !

21.12.99



# అమ్మ జ్ఞాపకాలు

సీ కిష్టు (కవిగారు)

అమ్మ జ్ఞాపకాలు నేను
అసలే మరువలేకున్నాను
కనులలో ఘనీభవించిన
కరుణామయినే చూస్తున్నాను !

చనిపోయిన దినంనాడు
తను వ్రాసిన అసంపూర్తి
ఉత్తరంలో నా గుటించే
ఉటంకించె ప్రేమ మూర్తి!

వెంపటి నొదిలి హన్మకొండకు
వేంచేసిన తొలి వత్సరాలలో
కుంపటియై కాన్సరు తన
గుండెనూపిన తుదివత్సరాలలో!

కొడుకుగా నా ఋణాన్ని
కొంతైనా తీర్చనిచ్చింది
రెండవ కొడుకింట్లో తాను
మెండుగనే కలిసుండింది!

చివరి మూడేళ్ళు ప్రక్కనే
మూడో కొడుకూ భార్యా పిల్లలతో
ముదంగానే గడిపె తాను
ముచ్చట అదీ తీరె తనకు !

చివరికి దశాబ్దం పైగా
చిన్న కొడుకు వద్ద వుండి
చివరికివాడి ఆధ్వర్యంలో
చితా భస్మమై పోయింది!

ఆడపిల్లలైదుగురికి
అమ్మంటే ప్రాణమే
అమ్మకు వాళ్ళంటే
అంతగానె ప్రేమయే !

అమ్మ కొఱకు అంతగా వాళ్ళేడ్చినారు
ఆ తీరు చూస్తే అదో మహా హోరు
అందుకేనేమో అమ్మా బాపులకై ఏమైనా
ఆడపిల్లలే ఏడుస్తారంటారు !

22.12.1999

# ఉత్తర క్రియలు

నీ కిష్టు (కవిగారు)

నాకీ వుత్తర క్రియలపై
నమ్మకమే లేదమ్మా
ఉత్తక్రతువులే గాని
ఒరిగేదేముందమ్మా!

చిన్నమెత్తు పని కూడా
చేయించుకోలేదు నీతో
జబ్బుతో నా వద్దున్నప్పుడు
ఇబ్బందే పెట్టలేదు నిన్ను!

ఏ సమయానికేం కావాలో
అన్నీ సక్రమంగా చేశాను
ఏ డాక్టరు కెపుడు చూపాలో
అందరికీ చూపించాను !

బిడ్డకు చేసినంతగ నా
పెద్ద కొడుకు చేశాడని
అనుకున్న నీ మనసు నాకు
అద్దంలా కనబడింది!

నీ పిల్లలొక్కొక్కరు ప్రేమతో
నీ కలాగే సేవలు చేశారు
అందరూ నిన్ను ఆప్యాయతతో
అమృత మూర్తిగానే చూశారు!

అందరినీ నీవు వదిలిపెట్టి
ఆ సకల బలుని తలుపుతట్టి
ఆయన సేవలో తరించ
అమర పురికి అరుదెంచ !

మేమిక్కడ నీ కొఱకై
మిక్కిలిగా రోదిస్తున్నామమ్మా!
మా రోదన నీకేమన్నా
మరి వినిపిస్తున్నదా అమ్మా !

## కవిగారి ఆత్మద్యుతులు

తను కదలకనే సకలబలుడు
ధరణి నంతటినీ నడిపిస్తాడు
ఎంత శక్తిమంతుడైతే తప్ప
ఇంతటి కార్యం సాధించగలడు!

చాలీ చాలని ఆదాయం
చాలా చేదు అనుభవం
మధ్యతరగతి మానవుడు
భరిస్తున్న బాధ అనవరతం !

అకారణంగా ప్రకృతి
ఆపదలు సృష్టించదు
మన కర్మల ఫలితమునది
మర్మముగా తెలుపుతుంది !

సమ ఉజ్జీల మధ్యనే
సంధి సఫల మౌతుంది
నీరు నీరు తైలం తైలంతోనే
నిజ మిశ్రమ మౌతుంది !

పైపైన మహానుభావులు
లోలోపల పిసినారులు
బయట పడుదురేనాడైనా
పైసా విదిలించని లోభులు !

కలిగినవారు దైవాన్ని
కట్టలతో కొలుస్తారు
అండలేని వారాయన్ని
గుండెలందు నిల్పుతారు !

బంగారం రాను రాను
మట్టి కన్న లోకువాయె
మట్టి ధర యేటేటను
స్వర్ణాన్నే మించి పోయె !

బలమే ముఖ్యమనుకోకు
పులికూడా భయపడు తేలుకు
ఒకే చుక్క అని అనుకోకు
విషం విషమే కుండెడు పాలకు !

కప్పు గెలుచుకొనుటే
కాదు సుమా జయ చిహ్నం
తప్పుడాట ఆడలేదనే
మెప్పు మేలు కప్పు కన్న !

అందరూ తప్పులు చేస్తారు
అందుకే పెన్సిల్‌కు రబ్బరు
కొందరే ఇది ఒప్పుకోరు
గొప్ప కార్యదీక్షా శీలురు !

మడచిన గొడుగు విరియని మొగ్గలవలె
మనసులు కూడా ఏ మాత్రం మూతపడక
అనవరతం తెరచుకొనియే ఉండవలె
అలా కానప్పుడివి పనికిరానే రావిక !

విఫలమైనచో వివాహాలు
ప్రభవిస్తారు మహానుభావులు
నిదర్శనం కావాలంటారా
సోక్రటీసు జీవితమే చాలు!

సులభంగా గెలుపొందుటకు
సూత్రాలేవీ పనిచేయవు
కఠిన పరిశ్రమ చేయుటకు
కట్టాల్సిందే నడుము నీవు !

నీ తప్పులు తెలుపువాడు
నీ గొప్ప మార్గదర్శకుడు
శత్రువని పొరబడకుండ
చక్కగ దయతో చూడు !

అలవాటని మనమనుకొనునది
అనువైన పడకలాంటిది
దూరుట సులువే కాని
వీడుటే మహా కష్టమైనది !

దండి ఫలముల చెట్టు
వంగి తనుండినట్టు
అణకువయే మానవుని
ఔన్నత్యానికి మెట్టు !

ఏ తప్పూ చేయనివాడు
ఎవడన్నా ఉన్నాడంటే
ఏ పనీ వాడెపుడూ
ఏనాడూ చేయనట్లే !

స్వార్థం పెరిగే మనుషులలో
సంస్కారం తగ్గిపోవును
సంపద పెరిగే వేళలలో
సౌభ్రాత్రం సన్నగిల్లును !

కొంతేమో యవ్వనం
ఇంకొంత అల్లరి తనం
ఇద్దరు ఈ తుంటరుల
ఉద్ధతియే దాంపత్యం !

దేశంలో దండి అవినీతి
నేడు మన జన జీవన రీతి
చెయ్యాలట మరో పోరాటం
దీనిపై కూడా మళ్ళీ జాతి !

మన సంపాదన విధి
మన మన జీవనోపాధి
మన మితరుల కిచ్చునదే
మన జీవిత పరమావధి !

జనన మరణాలనే అట్టల నడుమ
చక్కని ఓ పుస్తకం జీవితం
అది తెలుచినదాసొంతము
చదివించేదిగా ఉండడం భావ్యం !

మానవీయ విలువలు
మనకుండా పోవడం
ఉమ్మడి కుటుంబాలు
ఉండకుండా పోవడం !

అనుభవమైతేనే ప్రతిది
నిజమని మనకనిపిస్తుంది
జీవితంలో ఇమిడినప్పుడే
సామెతకూ సార్థకత వస్తుంది!

సన్మాన అవమానాలకు
చక్కని కొలమానాలు లేవు
నీ భవ్య విధి నిర్వహణే నీకు
నిక్కమైన సన్మానం వేరేవీ కావు !

నీ అజ్ఞానం ఎంతో
నీవు తెలుసుకొనుటే
జ్ఞానానికి నీవెంతో
చేరువై పోవుటే !

నీ ఎనిమిది జానలే
నీ ఎత్తు ఎప్పుడు
నీ ఖ్యాతి నిలుపునులే
నీ మనస్సు గుప్పెడు !

పూల వాసనలను ముళ్ళు
పుణికి పుచ్చుకోగలవు
ముళ్ళ కర్కశత్వం పూలు
ముమ్మాటికి పొందలేవు !

మనిషి జీవితం
అదృష్టమధీనం
కొంతయే తోడ్పడు
నెంతైనా ప్రయత్నం !

పరిస్థితులకు తల యొగ్గిన
అధోగతి నిశ్చయం
ఎదురు తిరిగి గర్జించిన
వరిస్తుంది విజయం !

ఆదర్శాలు వల్లిస్తివా
ఆనందం లోపించును
అందరిలా చేసితివా
అంతా అనుకూలించును !

చిన్న పనులలో విజయం
సాధించగల రెందరో
గొంతెమ్మ కోరికల దూరం
కొంచమైనా ఉంచగలిగిరో!

బరువులూ బాధ్యతలూ వద్దనుకోకు
గట్టి నడుము కావాలని మట్టుకు కోరు
కష్ట నష్టాలకు యే మాత్రం వగచకు
అవే నిన్ను మనీషిగా మలచితీరు !

ప్రతి తరం వారు పైతరం కన్న
వచ్చే తరం వారందరి కన్న
వివేకవంతుల మనుకోవడం పరిపాటి
మరందులో నిజమేపాటి !

వినడానికి తహతహపడు
వేగిర పడు మెంతగనైన
మాటాడ నపోహపడుటలో
మాత్రం వెనుకపడుమెలాగైన !

తరచి చూడగా తెలియును
అవకాశ మెల్లప్పుడును
సన్నద్ధంగా వున్న చతురులనే
వెతుక్కుంటూ వెంటపడును !

స్వయం కృషితో పైకొచ్చిన
వాని వద్ద పొరపాటున్నైన
మాట్లాడకదృష్టం గుఱించి
వాడసలొప్పుకోడో మానాన !

కురిచీ నూగిస్తూ
కూని రాగాలీస్తూ
కూర్చునే వాడసలే
గొప్పవాడు అవడులే!

ఈ రోజుల్లో ఎవడి గొప్ప వాడే
ఇతరుల గూర్చి ఎవడూ ఆలోచించడే
ఎంత అమానుష స్థితి కెదిగాం మనం
ప్రతి వాడూ గిరిగీసుకు బ్రతుకుతున్నవాడే !

సమయోచిత ఆలోచన
చక్కనిదైన కార్యాచరణ
ఈ రెండు సాధించును
ఎనలేని కార్యసాధన !

మనపై మన అంచనాలవి
మనం చేయగల మనుకొన్నవి
మనపై ఇతరుల అంచనాలు
మనం చేసి చూపించినవి !

అందమైన ప్రతి ఒక్కటదీ
అందరి కళ్ళలో పడుతుంది
గులాబీ పూవు బ్రతుకదీ
గుబురు ముళ్ళలో హసిస్తుంది!

తన గురించి తను
అనుకున్నదే చెప్పునతను
అగడ్తలలో దింపగల
పొగడ్తలు చేయునతను !

పని స్నేహితులతోని
పడినదా మనకైన
తమ కృతఘ్నత తెలుప
తగు సమయమన్నట్లు !

తను మానవుడు నిజము
తన ఆలోచనల ఫలము
తననుకున్న దెల్లయును
సాధించునతని యత్నము!

పెద్దల యెడ భయభక్తులు
అమ్మా నాన్నలపై శ్రద్ధాసక్తులు
అంతగా సన్నగిల్లి పోతున్న
ఆర్తి నాహ్వానిస్తున్న చెడు దినాలు !

ఒంటరిగా పోరాడేవాడు
ఓటమిని జయించేవాడు
ప్రపంచంలోనే అందరికన్న
ప్రబల బలోపేతుడు !

ఎంతో కొంతైనా వాడు
ఇతరులకై బ్రతకనోడు
తనస లేమీ చేయలేడు
తన కొరకూ బ్రతుకలేడు!

అతిగా విలువైనదీ
అతి వృధా అగునదీ
ఆగదెవరికై అది
'కాలం' అని అనునది !

కేసు ఓడినవాడు
కోర్టులో ఏడ్చేను
కేసుగెల్చినవాడు
గృహమేగి ఏడ్చేను !

యౌవన మెపుడాయని
ఎదురుచూస్తి చిన్నప్పుడు
నిండు యవ్వనాననేమొ
బాల్యాన్ని తలపోస్తిని !

సంకల్పం దృఢమేని
ఇంక భయం ఎందుకని
శంక కూడ వద్దే వద్దు
జయం నీకు కల్గదని !

ఇతరుల ప్రభావాలకు
క్షణమాత్రమైనను
లోనవనపుడే మనిషి
పూను మహత్కార్యాలకు !

చిర్నగవుతో జీవించు
కురుపించకెపుడు కన్నీరు
స్నేహితులను ఆదరించు
చేయి వయసుకూ ఖాతరు !

చచ్చిపోయిన మానవత్వపు
శవం కుళ్ళి పోతున్నది
ఎత్తడానికి ఏవగింపు
ఎంతగానో కల్గుతున్నది!
దురాశ లేకుంటే
దుఃఖం దూరమైనట్లే
ఆశలు వదులుకుంటే
ఆనందం మీదైనట్లే !

మన ఆనందాల పంట
మన మన వాకిటి ముంగిట
పండించు కోవాల్సిందే
దండుకోలేం దాన్ని బయట !
ఊతమవసరం లేనే లేదు
ఉన్నతంగా ఎదగడానికి
ఎంతగ ఎదురు దెబ్బలు తాకితే
అంతగ వీలు ఎదగడానికి !

పిల్లలు లేరని కొందరు
తల్లిదండ్రులు ఏడుస్తారు
ఎందుకు పుట్టారా వీళ్లని
ఇంకొందరేడుస్తారు !
తల్లితండ్రులను గౌరవించే
పిల్లలు నేడెంత మంది
పిల్లలతో సంతోషులు
తల్లిదండ్రులెంత మంది !

బోధించడమని అన్నది
బుద్ధికి పదును పెట్టుటది
నాల్గుసార్లు చేసినదే
నాణ్యత కల్గించునది !

ప్రతి ఒక్కని
మాట తీరు
అతని జీవితం
చూపి తీరు !

ప్రపంచమంతా నేడు
మహితంగా సౌరశక్తిని
బిల్లుకట్టే గోడు లేకుండా
కొల్లగొడ్తున్నాడు మానవుడు !

అన్ని పనులలో సందిగ్ధత
అదో గొప్ప అవరోధము
అది తొలగించు కొంటేనే
అపుడగు లక్ష్యం సాధ్యము !

నటించే జీవితాలకన్న
నిజ జీవితాలే కాస్త మిన్న
అయ్యేది ముందే తెలిసిందా
జీవితంలో కమనీయత సున్న !

అనవసర పదజాలంతో
భావాన్నుక్కిరి బిక్కిరి చేయకు
అందరెరిగిన పదాలతో
అనంత భావన్నందించ మరువకు !

ముఖమందం చూసి ఎప్పుడు
మోసపోవడం తప్పండి
మనసందం లేదా అప్పుడు
మరది బాధ కాదా చెప్పండి?
ఆతనిలో మెండుగ యువత
ఆవిడలో దండిగ అందాలు
అట్టే వీచే రెండు పెనుగాలులు
అవే జీవితంలో తుఫానులు !

ఎంతటి కోటీశ్వరుడైనా
సుంత బంగారం తినేనా
రొట్టే అన్నమే కదా క్షుత్తును
రోజూ తీర్చునెవరికైనా?

కొదువేం మూర్ఖ శిఖామణులకు
'కో' అంటే దొరుకుతారు కోట్ల మేరకు
విజ్ఞులు దొరకడమే కదా కష్టము
వేద జ్ఞానం పూర్తిగా లోపించినందుకు!

పెద్ద మొత్తంలో ఒకేసారి
పెను సాయం చేస్తాననువాడు
ప్రపంచంలోనే పెద్ద పిసినారి
ప్రమాదమే వాణ్ణి నమ్మితే చూడు !

నిరాశాజీవి ప్రతి అవకాశంలో
ఓ యిబ్బందినే ప్రబలంగా చూస్తాడు
ఆశావాది మాత్రం ఇబ్బందులలో
అవకాశంకై అహరహం వెతుకుతాడు !

నీదెట్టిదో ఆత్మస్థైర్యం
నిజంగా చెప్పే కొలమానం
కన్నీటి అలల నడుమన
కాస్త నవ్వి చూపించడం !

సమస్యల సంద్రంలో
సదా మునిగుండే జీవితంలో
ఓటములూ కన్నీళ్ళు
ఓ లెక్కా ఆ ముంపులో !

కాలం చేసే గాయాలను
కలదా మనకు మాన్పేశక్తి
కాలంతో కనులు కలిపి
కాల్వలై ఏడ్వడమే ముక్తి !

ప్రపంచం కన్నా పెద్ద
పాఠశాల ఏదున్నది
మానత్వం కన్న మిన్న
మహిత మనిషికేమున్నది !

బాధల చీకటి దూరం చేసే
భాసుర దీపాలెలిగిస్తాను
బాధావేదనల మరిపించ
ప్రతి ఒక్కరినీ నవ్విస్తాను !

తెలుగు భాష రాష్ట్రంలో
తెరమరుగవుతున్నది
కంప్యూటర్ పరుగులలో
గతి తప్పి పోతున్నది!

గుడులూ బడులు
గ్రంథాలయాలు
అద్దంతో పోల్చదగిన
ఆత్మలాంటి ఆలయాలు !

మనమొక మహా సంధి
మాయలోన ఉన్నాము
చీకటి కాకూడదు రంధి
వెలుగుకై విజృంభిద్దాం !

నరసంహారపు వేడుక
రక్తపుటేరులపై నడక
మహానుభావులు కొందరికి
మహదానందమైన కోరిక !

మేలితరులకు చేసేవారినే
మెచ్చుకునేటట్లు చూడు
కీడితరులకెవడు చేసినా
వాడిని నేనాపేట్టు చూడు !

ఆంధ్రాలో తెలుగుభాష
అంతరించి పోవునేమొ
కంప్యూటర్ అభిలాష
తెలుగు కొంప ముంచునేమొ?
ఆపదలో ఆదుకున్నవాణ్ణే
అసలైన స్నేహితుడంటారు
అలాంటి వాడొకడుంటే వాణ్ణి
అర్జంటుగా చూపించండి మీరు !

పగలు రేయి త్రాగేవాడు
పట్టించుకోడు రుచి గురించి
ఆగకుండా మాట్లాడేవాడు
ఆలోచింపడు దేన్ని గురించి !

చెడు స్నేహం చెదపురుగట్టిది
మొదలంటా కూల్చేస్తుందది
మంచి స్నేహం మహోస్తంభము
పాదులా మంచి ఊతమిస్తది!

ఆత్మ తృప్తికై మాత్రము
అవగూడదు సాహిత్యము
ఆత్మల మెల్కొల్పడమే
అవాలి దాని ప్రయోజనము !

రెండే రెండు రకాల సాహిత్యం
మెండుగ నేడగు దర్శనం
ఎందరో చదివే చెడు సాహిత్యం
ఎవ్వరూ చదువని మంచి సాహిత్యం!

పది గ్రంథాల పఠనంతో
పొందలేనంత జ్ఞానం
పండితుడొక్కని ప్రసంగంలో
పొందడమగును సాధ్యం !

అసలు సిసలు సంతోషం
అంతరాత్మలో ప్రక్షిప్తం
దాని కొరకై బైట వెదకడం
లేనిపోని వృథా ప్రయత్నం!

కొలనులోన తామర పూలు
క్రూరమైన జలగలలా
జగతి లోన సన్మార్గులు-
కలిసుంటారు మూర్ఖులూ - అలా !

ప్రథమ వివాహం
ప్రకృతి రీత్యా అవసరం
రెండవ దైతే భోగం
ఆపైన ఆదో పిచ్చి రోగం !

రచనే వృత్తిగా
రాణించడ మరుదు
అదే ప్రవృత్తిగా
అమరిన వాడెదుగు !

మనస్సులోని కుళ్ళునమాంతం
కడిగి పారేయకున్నామా మనం
మనలనది తానే క్రమక్రమం
తనలో ముంచేయడం తథ్యం!

ఎందరినో ఘనా ఘనులను
ఎరుగుదుము జీవితంలో
ఎంతగ కూర్కున్నారని చెప్పను
ఈర్ష్యాద్వేషాల వలయంలో !

ఇతరులపై అదే పనిగ
ఈర్ష్యపడే అసూయులు
ఏమైనా గూడ నిజంగ
ఏహ్య పడాల్సిన ఘనులు !

దురహంకారులతో ఎపుడు
దొడ్డ పరాభవం సంభవం
దూరం వారి నుంచడం వల్ల
దూరమగును మనకు దుఃఖం !

ఎవరి వల్ల నిన్నటి సంస్కృతి
ఈనాటికీ బ్రతికున్నది
చిరస్మరణీయులుగా వారిని
చిత్తములందుంచు కోవాల్సింది!

ధనంతోనో బలంతోనో ఏమండి
దక్కేదేమీ మీకు ఆలోచించండి
ఎవరి నుండేమి కావలసిన గూడ
నయ వినయాలతో సాధించండి!

లేదనే పదం లేదన్నంతగ
లేశమైనా ఇతరుల కిచ్చేంతగ
ఎదగాలి సదా మనిషి తాను
మానవత్వానికి హద్దే లేదన్నంతగ!

నీటికి ప్రభవ - ప్రళయ స్థానం
నీరదం కానే కాదు అది సంద్రం
అట్లే అన్ని వస్తువులకు కూడా
అవనియే కదా ఘన మూలం !

ఎన్ని కాలుష్యాలనని
ఏమండీ మన మాపగలం
అన్నిటికీ నేను తోడని
జతాయె జనకాలుష్యం !

వ్యక్తి ధర్మం కుటుంబ ధర్మాన్ని
కుటుంబ ధర్మం సమాజ ధర్మాన్ని
వ్యవస్థితంగా కాపాడాలి సుమా
ఒండొరులు తమ తమ ధర్మాల్ని !

కోరికల హెచ్చు వేతనను
కోకండీ నాగరికతయని
దీక్షగ వాని నాపుకొనుటనే
తెలియండీ దివ్య మార్గమని !

కవితకు భాషా కుల మత భేదాలు
ఖాయముగా అడ్డు రానే రావు
కవితా - రక్తం విశ్వాత్మజాలు
అవి హిందూ ముస్లిం ఈసాయీలు కావు !

శరీరారోగ్యం సౌలభ్యం
చిక్కని మితాహారం వల్ల
మానసికానందం సంభవం
చిక్కని సదాలోచనల వల్ల!

ఊట-భూమి పైకి రావాలంటే
ఉండే పై అడ్డు తొలగాలి
జ్ఞాన స్ఫూర్తి కలగాలంటే
కామ్య దురాచారాలు పోవాలి !

మన తీరని కోరికలు
మన కవి సమస్యలు
వాటినణచి వేస్తే
వశమగు నానందాలు !

దీపము చీకటినెప్పుడూ
దగ్గరికి రానేరానీయదు
అదే గాని జరిగినప్పుడు
ఆ దీపం వెలుగుతుండదు?

ప్రవాహ దిశలో
ప్రయాణం సుఖం
అదే ఎదురీతలో
అంతా అల్లకల్లోలం !

ఆత్మవిశ్వాసమనునది
అవసరం చాలా మటుకది
అహంకారంగా మారక ముందే
ఆపు చేసుకోవాల్సుంటుంది !

ప్రశంసలందుకోవడమన్నది
పన్నీటి జల్లులా ఆనందించేది
అంతేకాని దాన్ని త్రాగేస్తే
అడుగులు తడబడేస్తుంది !

అహంకారాన్ని పెంచే సంసారమిది
అహరహము మనకు ప్రాప్తిస్తుంటుంది
అలాంటి చక్రాన్ని తప్పించుకోవాలంటే
ఆ వేరుపురుగునే చంపాల్సుంటుంది !

ఆలోచించేదే పలికి
ఆచరిస్తేనే సజ్జనుడు
ఆలోచన, పలుకు ఆచరణలను
అసమన్వయిస్తే దుర్జనుడు !

పనికి మించినట్టిదేది
మాదక ద్రవ్యం లేదు వేరేది
అలవాటు దాన్ని చేసుకో
ఆపై దాని నషా చూసుకో !

ఒక తరం జనులు వారు
ఓపికగా కూడబెట్ట
తరువాతి తరంవారు
తగుదురు దాన్ని తగుల బెట్ట !

అంతా నీవే
అవాలనుకుంటే
ఇంతకు నీవు
ఏమీ కాలేవు !

కేవలం పేరు ఖ్యాతుల కొరకు
జీవితం తాము నెరిపేవారు
స్వభావ సౌజన్యాలకు
సదా దూర మౌతారు !

అదృష్ట మెల్లప్పుడు
తను వరించినవారి
దగ్గరకే కదా చేరి
అందల మెక్కించ చూడు !

డబ్బు విషయ మందు మాత్రం
జనులంతా ఒకే కులం
గడించిన మొత్తం కన్న
గ్రహించినదే తమకు మిన్న !

ఏం కావాలో ఖచ్చితంగ
ఇంగితంతో తెలుసుకో
సాధనతో పై మెట్టును
సంపాదించ చూసుకో !

మనసును లక్ష్యాల దిశకు
మళ్ళించితివా సవ్యంగా
సంతసాలు గ్రోలేందుకు
సాధ్యపడును దివ్యంగా !

చవకబారు మనిషి
చాలా అనర్థం తెలుసుకో
చక్కని ప్రతిఫల మొసగి
సమర్థుణ్ణే పెట్టుకో!

పుట్టగానే ఏడుస్తావు
చుట్టు జనాలను నవ్విస్తావు
చచ్చి సంతసిస్తావు
పిచ్చిగ జనాలనేడ్పిస్తావు !

రాజకీయవేత్త తనను
దేశంపొత్తనుకుంటాడు
రాజకీయ నాయకుడు తనకు
దేశం సొత్తనుకుంటాడు!

మన మాతా పితరులు
మనకు తొలి గురువులు
మన మంచి గురువులు
మలి మాతా పితరులు !

నల్గురు వైద్య శిఖామణులను
మితాహారం మతి నిండా శాంతం
మంచితనం మరేమో ధ్యానం
నమ్మకున్న పిలువ పనిలేదు వైద్యులను !

పద్ధతిగా పరిఢవిల్లితేనే
ప్రజాస్వామ్యమతి మధురం
మనదిలా అస్తవ్యస్తేస్తేనే
మరి చెడుపేకాక దారుణం !

అనంతంగా నమ్మదగిన
అన్ని బాధ్యతలివ్వదగిన
అంతటి పరిపూర్ణ వ్యక్తి
అతిశయోక్తి కాదు లేదనిన !

హృది ఎదిగితేనే తప్ప
గొప్ప మనిషని చెప్ప
గలమా మనమేమిటి
శరీర మెదిగితే యేం గొప్ప !

అతి చిన్నదా బేడీ
అదే పెళ్ళి ఉంగరము
మంచిదైనచో జోడీ
జన్మంతా సంబరము !

ప్రజల ధనం
పంచామృతం
అందుకొనుటవే
అందరి మతం !

బాధల నుండి మానవులు
బడసినవన్ని అనుభవాలు
మరే బోధల నుండి
మతి కెక్కని ఉపదేశాలు !

తలుపు మూస్తేనేం మనం
దాని సందునుండి దూరు నిజం
గాలిలాగే నిజాన్నెప్పుడు
కప్పిదాచలేమన్నదే సత్యం !

జాతులో యుద్ధాలో
జగతి నుద్ధరించవెపుడు
అపుడపుడొక మనిషే
ఆ దిశ తన ముద్ర వేసె!

రూపం కురూపం
రెండూ మరుగయేవే
వయస్సు తెచ్చే ముడుతలలో
వాలకం కోల్పోయేవే !

బుద్ధి జీవి యందున్న
భూరి దైన అద్భుత శక్తి
ఒక శాతమే స్ఫూర్తి
ఇక మిగతది శ్రమ శక్తి!

తరచి చూడగా జీవితం
ధరణి లాంటిదే నిజం
పెట్టిన విత్తనమే ఫలించి
చెట్టై ఇచ్చునదే ఫలం!

పది మందికి ఉపయోగం
ప్రబలంగా కలుగచేసేదే
నీవు చేయాల్సిన పని
నీకు చేకూర్చు సంతసం !

రక్షించితివా దొంగను
శిక్ష నీకు తథ్యం
మరు రాత్రే వాడు నిన్ను
దోచునేమో భద్రం !

అజ్ఞానులు అమాయకులు
అవరంతగ దేశద్రోహులు
గుప్త ఆత్మ వంచకులే
గొప్ప జాతివిద్రోహులు !

మంచి చేయుటితరులకు
మర్యాద మాత్రమే కాదు
అందువలన కలుగును నీకు
ఆశీర్వనం మున్ముందు !

బాధలు పంచుకుంటే
దుఃఖం అర్థమౌతుంది
సంతసాలిచ్చి పుచ్చుకుంటే
ఆనందం వెల్లివిరుస్తుంది !

శారీరిక బలహీనత
మానసిక దుర్బలత
ఏది దేనికి మూలమో
చెప్పలేని ఇదమిత్థత !

వెలుగు వేపు
దృష్టి నిలుపు
వినవే పడదు
చీకటి పిలుపు!

చక్కని ఆరోగ్యం
చల్లని సహృదయం
రెండు రెండేలే
మహాకటాక్షం !

జీవితానికి పరమావధి
ఎన్నుకోవడం మన విధి
ఆపై కార్య నిర్వహణలో
శక్తులన్నీ చేయాలిప్రోది !

వినోదాలన్నిటికన్న
విస్తార పఠనం మిన్న
అనంత ఆనందాన్నిచ్చు
అన్ని ఆనందాల కన్న!

కనిపించే ప్రాణులను
కనికరించ లేరేల
కనిపించని సకలబలుని
గౌరవించ గలరెట్టుల !

పురిటి నొప్పుల బాధలందే
బిడ్డ జననం సంతసం
ప్రకృతి ఫెళఫెళరావమందే
ఇంద్ర ధనుస్సు సంభవం !

గతించింది ఇతిహాసం
రాబోయేది అనూహ్యం
నమ్మకంగా వర్తమానమే
నాణ్యమైన బహుమానం !

కుంటిసాకులు చెప్పేవాడికన్న
గొప్ప సమయ హంతలేడు
కాలం వృథా చేసే వాడి కన్న
కంగాళీవాడు లేనే లేడు!

కార్యకర్తగా నెగ్గుకొస్తేనే
నిర్వహణాధికారిగా నెగ్గుతావు
ఉట్టికెక్క లేకుంటేనే
స్వర్గానికెలా ఎక్కుతావు !

మంచిని ప్రేమించే వానిని
చేడును దూషించే వానిని
కలికాలం మాయో యేమో
చేరనీయరు కదా దరిని !

పెళ్లీ ఇల్లు కట్టడాలు
పెద్దవే రెండు కార్యాలు
కష్టాలని అనుకోకుంటే
కావా రెండదృష్టాలు!

పిల్లలకు కావలసినవి
పెద్దలియ్యవలసినవి
ప్రేమ భరితమౌ క్షణాలు
కాదు నిధులూ నిక్షేపాలు !

నిన్ను వినాలనుకున్నట్లే
నీవు వినాలందర్నీ అట్లే
ఇచ్చి పుచ్చుకోవాలి లేదా
ఒకే వైపు దారన్నట్లే !

సౌదాతనంలోని గొప్పదనం
వేరే దేనిలో లేనిది నిజం
ఎంతగ దీన్ని ఆచరిస్తే
అంతగ ధరిస్తావు విశ్వరూపం !

మంచి పనుల పరిమళాలు
మన కీర్తి ప్రతిష్ఠలు
చెడు పనుల దుర్గంధాలే
చిత్త స్థైర్యముడుగటాలు !

అభిప్రాయాలేర్పరచుకొనుటకు
అసలేమాత్రం ఆతురపడకు
అంతగనే నిగ్రహం పాటించు
అభిప్రాయాలను మార్చుటకు !

అన్ని మన సంబంధాలు
ఔతున్నవి వ్యాపారాలు
ఏమిటిలా ఇంకుతున్నవి
మానవీయ విలువలు !

బాధలే బ్రదుకులోన
బహుశః అపరిమితం
ఎవరూ ఓదార్చకుండిన
ఇంకా బాధ అనంతం !

వేదం కన్నా మిన్న
విజ్ఞానం లేనేలేదు
శతకం కన్నామిన్న
హిత జ్ఞానం వుండబోదు !

పనిపై మన శ్రద్ధ
ప్రతి ఫలాన్నధిగమిస్తే
అలా మన పని ఆపై
ప్రజా సేవ ఔతుంది !

ఎవరి గురించి
చెడు మాటాడకు
ఎవరిదైనా మంచి
ఎరిగించక ఉండకు !

గొప్ప జీవితాలు
ఆదర్శ పూరితాలు
ఇతరులందరివీ
ఎడతెగని కోరికలు !

కాలం గొప్ప న్యాయనిర్ణేత
కలిసొస్తే ఎవడైనా విజేత
అందరికీ ఒకప్పుడు కాలం
అందిస్తుందదేరీతి ఆప్యాయత !

మంచీ మమత మానవత్వం
మనిషిలో ఇంతగా మృగ్యం
అయే తీరు తెన్నులు చూస్తుంటే
అగుపనిపిస్తోంది అరాచకం !

స్వార్థం ఇంతగా పెరగడం
అర్థం లేకుండా మనిషి ప్రవర్తించడం
తడిబట్టలతో గొంతులు కోయడం
కాదా కలియుగ మహిమా ప్రభావం !

ఎంత వ్రాసినా కలం
ఇంకా ఇంకా వ్రాయమంటున్నది
ఎంతో కొంతైన ఫలితం
ఎలాగు ఉంటుందంటున్నది !

ఎవరో ఎవరికో చేస్తే ద్రోహం
ఏదోలే అని సరిపెట్టుకోగలం
మనతో మనోళ్ళే తలపడితే
మరేవిధి నచ్చచెప్పుకోగలం !

వాదాలపై కవితలల్లడం
కాదెపుడూ నా అభిమతం
నిర్వాదంగా విశ్వవాదినవడమే
నేటికి ఏనాటికి నా ఆదర్శం!

కవిత చదివేవారికి సతతం
కావాలి సులభం సుస్పష్టం
అన్నదే నా మతమనవరతం
అదే స్థూలంగా నా కవితా వాదం !

నీ గుఱించి చెడు చెప్పిన
వాని మాటెవడూ వినలేనంత
ఆదర్శంగా నీవు బ్రతికి
ఆకసాన తారవాలి !

యువకులుగా ఉన్నప్పుడు
ప్రపంచాన్ని మార్చాలంటాం
వృద్ధాప్యం రాగానేమో
యువతనే మార్చాలంటాం !

గతాన్నెలాగూ మార్చలేము
కాని భవ్యమైన వర్తమానాన్ని
వృథా చేస్తాం నిరంతరము
వ్యథతో తలుస్తూ భవిష్యాన్ని!

నొప్పించక ఏ మాత్రమితరుల
ఒప్పించుట తన మాటకు
చతురుడొకడే చేయగల
చాకచక్యుడు చివరకు !

ప్రతి పని ప్రముఖంగా
ఆనందాన్నివ్వలేకున్నను
పని లేకుండా ఆనందం
ప్రాప్తించదెప్పుడును !

ప్రతి దినమూ చివరిదిలా
బ్రతికి నీవు చూపాలి
బ్రతికినన్ని నాళ్ళు నిన్ను
ప్రతి ఒకరూ మెచ్చాలి !

పిల్లల చిన్నారి మనసుల దోయ
ఎల్లప్పుడూ మార్దవమూ దయ
ప్రేమా ముద్దూ మురిపాలే
భేషుగ్గా పని చేయునయ !

అపాయాన్నుంచి బైట పడాలంటే
మరో అపాయమే తరుణోపాయం
వజ్రాన్ని గాని కోయాలనుంటే
వజ్రమే కదా సరైన ఆయుధం !

తమ పుట్టుక ఉద్దేశ్యం
గమనించక మునుపే జనం
చాలా మంది మరణిస్తారు
కాదా యిది అన్యాయం !

అన్ని మన పుస్తకాలు
అవశ్యంగా రెండే తెగలు
అప్పటికే చదువ తగినవి
ఎప్పటికీ ఉంచ వలసినవి!

ఇతరులపై మక్కువగా
బ్రతికితివా భవ్యంగా
ఆ జీవితం ముగిసినప్పుడు
ఆత్మ తృప్తి అదేగా!

ఆకురాలు కాలమ్మైనా
ఆమనైనా ఒక్కటే
పూదోటను దహించారు
బుద్ధి పూర్వకంగా మూర్ఖులు !

రాత్రికి రాత్రే తాను
లక్షాధికారి అయ్యాడంటే
రాక్షసుడై నీచమార్గ
లక్షణుడై ఉంటాడంతే !

వాడిన చిగురించవచ్చు
మాడిన దేల చిగురించు
మానవత్వం లేని మూర్ఖులు
దానవులై పెట్ట తాము చిచ్చు!

ఎపుడితరుల దహించువారు
ఏనాడో వారే కాలిపోతారు
చక్కని ప్రకృతి నిలయాన్ని
శ్రమించి బూడిద చేయువారు !

ప్రజాసేవ కన్న వేరు పరమార్థం లేదు
త్యాగ బుద్ధి కన్న మించు తాదాత్మ్యం లేదు
రెండెవనిలో మెండుగా తాముంటాయో
అతని బ్రతుకు ధన్యమౌను అనుమానం లేదు!

మాట ఇచ్చుట యందు
మంద గతి య్యైనచో
మాట నిల్పుట యందు
మంచి నేర్పరి యగును!

గమ్యం చేరాలనుకుంటే నీవు
కంటకాలను లెక్క చేయకు
పట్టుదలతో త్రొక్కుతూ పోతే
మట్టి గరుస్తాయవన్నీను !

వాక్కొకింత మధురమాయెనా
మిక్కిలిగా ఇతరులు గౌరవింతురు
వినయం దానికి తోడాయెనా
విను వీధిన నిన్ను నిల్పుతారు !

ఎందరు శత్రువులనైనా
ఏరి ఏరి పారేస్తాము
అహమనే ఘన శత్రువును
అలా ఎందుకెదగనిస్తాము !

మదించిన ఏనుగు నెదిరిస్తే
మహిలో గొప్ప కాదెవ్వడు
తన క్రోధావేశాన్నణిస్తే
తథ్యంగా గొప్ప బలవంతుడు !

చలి కాలంలో చలికి దినం సంకోచం చెందు
వేసవి ఎండలలో అది వ్యాకోచం చెందు
దినాలందుకే చిన్నవి చలికాలంలో
వేసవిలోననవే దీర్ఘమై వెలుగొందు!

ముట్టుకుంటే కాల్చేది నిప్పు
పట్టుకుంటే కూల్చేది అప్పు
కొత్తదైతే కరిచేది చెప్పు
ఏమైనా చేయకూడనిది తప్పు !

సదుద్దేశ్యంతో కూడిన
అసత్యమైనా సత్యమంటిదే
దురుద్దేశ్యంతో ఆడిన
సత్యమసత్యమంతటిదే!

అవతారాన్ని చూడగనే
అభిప్రాయ మేర్పరచకు
ఏ పుట్టన పాముందనే
దెరిగెదమా బుసకొట్టు వరకు !

ఒక్క గొంగళి బిఛానాలోన
పెక్కు మంది ఫకీర్లు నిద్రిస్తారు
పెక్కు రాజ్యాధినేతలైన
ఒక్క టెంకగెలువ చూస్తారు!

ప్రజాహిత కార్యాలతో రాష్ట్రం
ప్రజలకు దగ్గరౌట సులభం
ఏ చిక్కొచ్చినా రాష్ట్రానికి ప్రజలే
ఎదుర్కొని చేస్తారు సాయం!

ఎన్నో పనులనొకేసారి
మిన్న కానేకాదు చేయడం
వినూత్నంగా ఒక్కటేనా చేస్తే సరి
విజయం వరించడం తథ్యం!

అద్భుతమైన కలలనే
అహరహం కనవలెను
ఆపై దీక్షగ పనిచేసిననే
అవన్నీ నిజమగును!

ఆలోచన బదులు ఆవేశం
అన్ని అనర్థాలకు మూలం
ఆవేశం తగ్గాక ఆలోచన
అన్ని వేళలా అభిలషణీయం!

ప్రజలకు టోకరా ఇచ్చేవారు
ప్రతి రోజూ ఎదుగుతున్నారు
అధిక వడ్డీల ఆశ చూపించి
అసలు కెసరు పెడుతున్నారు!

కొందరు చనిపోయినా కూడా
ఎందరెందరో స్మృతిస్తారు
ఇంకొందరినేమైనా కూడా
ఇంట్లో వాళ్ళే విస్మరిస్తారు !

నేడొనరించిన మంచి
నీకు చేయు మేలు రేపటి నుంచి
ఎంత ఆనందింతువో చూడు
సుంత దీని నాచరించి !

బ్రతికుండగానేమో రెండు చుక్కల
పాలకెతుక్కొనేట్లు చూశాడట
చచ్చిన తరువాత తల్లిదండ్రుల
సమాధులపై బర్రెను కట్టేశాడట !

ఒక ఆదర్శం వైపుకు
ఒగ్గ కుంటివా నీవు
ఇక ప్రతి చెడుగుకు
ఇట్టే లొంగి పోతావు!

ప్రేమధనులైతేనే మున్ముందు
క్షేమకరం జీవిత మందు
ఈర్ష్యాళువు లెపుడైనా
ఇక్కట్లే ఎదుర్కొందు రందు!

ఉచిత సలహాల నితరులెదుట
ఊదేయడమతి సులువైన మాట
వాటిని తాము పాటించడమన్నది
సాధ్యం మహానుభావులకేనట !

సమయాన్నో మహనీయుడు
సర్కస్ డేరాతో పోల్చినాడు
తమషాలు మాయలు గారడీలు
తను చేసి వెళ్తుందంటాడు!

మూగ జీవులను చంపి దండి
మృష్టాన్నం తినే జీవులు
ప్రపంచమంతా ఉన్నారండి
ప్రకృతి నీమమీదన పీలు !

తమవారి తప్పులు క్షమించువాడు
తల్లిలాంటి కరుణాళుడు
ఇతరులందు క్షమ చూపినవాడు
ఈశ్వరునంత దయామయుడు !

శత్రువులదైనా కూడా
మృత్యువు బాధాకరమే
అకాల మయిందా మరది
అనంత దుఃఖ కారణమే!

నాల్కనెపుడధీనంలో
నైపుణ్యంగా ఉంచుకో
ఆడే ముందే మాట నిలలో
ఆచి తూచి ఆడుకో!

ఎవరెవ్వరి గమ్యాలు
వారేకద చేరాలి
నడుస్తాయా దారులు
నడుం మీరే కట్టాలి !

జీవితంపై ఇంకేమని
కవితలల్లగలమని
ప్రళయం ముంచెత్తే
పరిస్థితుల్లో ఇరుక్కుని!

పాలూ నీళ్లను వేరు చేసే
ప్రాభవ మొక్క హంసదే
అలాంటి మెషినొకటొస్తే
అదృష్టం కాదా మనదే !

అనంత శాశ్వతాలు అవి ఇవేలెండు
నాణ్యమైన ఈ జగత్తు పరమాంధ్యం రెండు
మొదటి దాన్ని నేను మొత్తంగా నమ్మలేను
అంటాడా చమత్కారి అల్బర్టైన్ స్టీను !

ఆపదలో ఉన్నవారిని
అమాంతం రక్షించాలని
తన ప్రాణం ఫణం పెట్టిన
మొనగాడే మనీషనిన !

సరైన సమయంలో దండి
అరైనా ఆలోచించకుండా
ఆపద తొలగించువాడే
ఆ దైవమంత వాడండి !

ప్రేమే విఫలం అయ్యిందా
బ్రదుకిక బాధే తెలిసిందా
బాధే మందై పోయిందా
పరముని పనియిక గోవిందా !

జీవితమనే వీణియలో
మ్రోగనెన్నో అపశ్రుతులు
నిష్ణాతుణ్ణైనా వాయించడంలో
నికార్సైనవి కాదు తీగలు !

అతి ఎక్కువగా విని
అతి తక్కువ మాట్లడమని
ఒద్దికగా యిచ్చాడే మనకు
ఒక నోరూ చెవులు రెంటిని!

తిరుగనేది లేకుండా
పరుగిడుతోంది లేఖిని
అలుపు సొలుపు లేకుండా
ఆహ్వానిస్తోంది కలం దాన్ని !

గుర్తింపు కోసమనే చేయ
గూడదే పనీ మనము
ప్రతి పనినీ గుర్తింపు
బడయు నట్లు చేస్తే ఘనము !

పదిమందికీ మన మనీష
పనికొస్తేనే కద సార్థకత
అంతకన్నా కావాలా శుశ్రూష
ఆనందింపదా దేశమాత!

పూలు గుబాళించినపుడు
పులకించునయా హృదయం
బుద్ధియునూ అలాంటప్పుడు
భూరిగ దాసోహమ్మనుట సహజం!

పాము విషం విన్నారా
బంగారం కన్నా ప్రియం
చెడు ఎదుగుట కన్నారా
చెప్పు చేతలకు దూరం!

మూడు సంధ్యా సమయాలు
ముచ్చటగా కనువిందులు
వెదకు నన్నే అనిపించును
అన్ని ప్రకృతి అందాలు !

వేలున్నా లక్షలున్నా
వేరెవరి కటాక్షాలు
అమ్మ కృప లేనివానికి
అసలేమీ లేనట్లే !

భాగ్యరేఖ మాసిపోదు
ప్రవాహంగ ఏడ్చినను
ఏదీ కాగల దాగిపోదు
ఏదో మిషతో జరుగును!

తనకు తగిన పని
తనకు తానే కని
చేసేస్తే పరుగున
చెప్పాలి దైవలీలయని !

కాళ్ళుతడవకుండా మానవుడు
గగనయానం చేస్తున్నాడు
కళ్ళు తడువకుండా మాత్రం
జీవనయానం చేయలేకున్నాడు!

కవితల వైభవం
కాంచుచున్న వానికి
వజ్రాల ప్రాభవం
వహ్వా అది దేనికి ?
పిచ్చాపాటీయుల
ప్రేలాపనలు వినరు
కవితలు కావ్యాల
మధుర గానలోలురు !

కవితకు జగాన పోటీ
కానే కాదేదెపుడు
కవితకు కవితే పోటీ
కడుదిట్టయైనప్పుడు !

అనంతమూ అద్భుతము
సౌర విద్యుత్తెంతో నిజము
విద్యుచ్ఛక్తి లాగా కాక
వినా వినా అంతరాయము !

రాజకీయ మెరుగనట్టి
వాజాయెవ్వడుండడు
ఏ కక్ష్యకూ చెందనట్టి
వాడే రాజకీయ చతురుడు !

పదవి చేత పట్టగానె
ప్రతి ఒక్కడి కారు కాళ్ళు
తనవి మరి రెండే కాని
తన సీటువి నాల్గు కాళ్ళు!

ప్రతి చిన్న ఓటమిని
ప్రళయంగా ఎంచకు
ఒక యత్నం ఫలించలేదని
ఇక యత్నించడం మానకు !

అడ్డంకులలో నుండే
అనుభవాలు గడించాలి
అనుభవాలలో నుండే
ఆత్మ విశ్వాసం పొందాలి!

కొంచెపు బుద్ధి లేకుండా
కూడబెట్ట గలగాలి
బాధయేమీ పడకుండా
పంచిపెట్ట గలగాలి!

ఉన్నోడిది లేనోనికి
ఊడ్చి పెట్టుదానికన్న
లేనోడిని పైపైకి
లేపు ప్రయత్నం మిన్న !

ప్రతి విసర్జిత పదార్థం
పని కొచ్చే దన్నది నిజం
సజీవ నిర్జీవ తతులలో
సామాన్య మీ విషయం !

కోతుల ద్వారా ఘన నీతిని
గొప్పగా చెప్పిన గాంధీజీని
చెడు చూడకు వినకు మాటాడకను
జీవనీతి మరువద్దేమైనా గాని !

ధరలో జీవులన్నిటిలోన
భూరి జన్మ మానవునిదే ఏలన
ధర్మాన్ననుసరించే బుధశక్తి
దండిగా కలదీతని లోన!

ఓపిక నెమ్మది తనం
ఓటమెరుగనివి నిజం
తొందర తొట్రుపాటు
దోచు గెలుపునవి తథ్యం!

అనుక్షణమూ ఏదో ఒక
ఆలోచనయే సబబిక
నిర్లిప్తత నిస్తబ్దత రెండు
నిర్వీర్యం చేయు బుర్రనిక!

నిజమని నీవు నమ్మేదానిని
నిర్వర్తించకుండా చేయలేని
వాడెవడుండలేనంతటి
పట్టుదలతో చేయాలి ప్రతి పని!

ప్రేమ ఐనదా బలహీనం
లోపాల్తామగు బలవంతం
ఏ లోపం లేకుండేంతగ
ఎందుకు ప్రేమను ఎదగనివ్వం!

చెప్పే గొప్ప నీతులకన్న
చేసే ఒక్క రీతియే మిన్న
వేయి మాటల కోటలేల
వేస్తే కాదా గుడారం మిన్న!

అధికారంలో నీవున్నప్పుడు
అందరికీ అందుబాటులో వుండు
ముఖ్యంగా బీదా బిక్కీలకు
ముందుగా న్యాయం చేయచూడు !

ఇద్దరదాటుగా స్నేహితులైతే
ఏమీ వింతలేదందులో - ఐతే
ఒక్కడెవడో ఇద్దరు మిత్రుల
ఒకేసారి కోల్పోయాడంతే !

నిన్ను సంతసపరచుకోవాలంటే
నీ ఎదుటివాణ్ణి సంతసింపచేయాల్సిందే
నీ కోర్కెలు తీర్చుకోవాలనుంటే
నీ జీవితమర్థమవాల్సిందే !

ఒక జయమూ అంతం కాదు
అపజయం కాలాంతం కాదు
ఇక ధైర్యమే మహా ఊత
సాధింపజేయు మనచేత !

వెలిగే వత్తి వేడి దనంతో
వేగిరం కొవ్వు కరిగిపోదా
అణుకువా వెలుగంటిదే దానితో
అతి కరుకు గుండైనా కరుగు కాదా !

లక్ష్యమే కనబడినదా
కక్ష్యలోనికి దూయడమే
అడ్డమైనా వచ్చినదా
అధిగమించి సాధించడమే !

ఉంటే మనలో సరుకు
ఉత్తర దక్షిణ లెందుకు
ఎంత కఠిన పరీక్షలనైనా
ఇట్టే గెల్చి పోతాం ముందుకు !

పడకుండడంలో లేదు
మన గొప్పదనమసలే
పడిలేచి ప్రయత్నించడమే
మన గెలుపుకు పునాదిలే !

నా బ్రతుకు సంతతము
తెరచి వున్న పుస్తకము
ఏనాడెపుడెవ్వరైనను
తరచి చూడ సంభవము !

సంస్కృతీ సభ్యత సంస్కారాలు
ఉద్ధతు లౌతుంటే చాలు
అవసరమే లేకుండా పోవు
న్యాయాలు చట్టాలు శిక్షలు !

ఇద్దరు బలవంతులు
ఎపుడు కలిసివుండరు
కలుపుతాయా చేతులు
రెండు కంటి రెప్పలు !

ఇతరులలో చూచినపుడు
మన తప్పులు మరీమరీను
మనకు జుగుప్స కలిగించి
మనల జ్ఞానుల నొనరించును !

మరీ మంచి పుస్తకాలను
మహా గొప్ప స్నేహితులంటారు
మనలనీ ఇరువురును
ప్రభావితం చేయునంటారు!

ప్రేమలాగే ప్రజాస్వామ్యం
ఏమైనా భరించగలదు
ఏ మాత్రం అలక్ష్యం
ఏ ఉదాసీనతా పడదు !

ఎన్నెన్నో ఇక్కట్టులు
నన్ను చుట్టి వేసినవి
ఉదయపు పొగ మంచులా
ఒకటొకటై వీడినవి !

చెప్పినదెపుడూ చేయకుండ
చేసే దెపుడూ చెప్పకుండ
సమన్వయం లేనప్పుడు
సఖుడవ్వడెవ్వడు గూడ!

అద్దంలాంటి ఆలోచనలు
అమృత తుల్యమౌ వాక్కులు
అనితర సాధ్యమౌ పనులు
ఆజన్మాంతమభిలషనీయాలు !

కవిత లెంత బాగుగా ఉన్నా
కాల మేఘాలు కమ్మినప్పుడు
సూర్య బింబంలా కనుమరుగగు
మేఘం తొలిగితేనే కాంతి కన్పడు !

కందము వ్రాయుట కష్టము
అందురు మరి నాకదే మో అంతగ సులువౌ
ఛందమదేమని చెప్పను
విందు భుజించిన రీతిగ వేడుక చూడన్!

తను నిజమనుకున్న
దాన్ని సమర్థించలేకున్న
మనిషి కానే కాడు కదా
బానిసకన్నా వాడు మిన్న !

చెడుతో చేయి కలపడం
మంచికి ద్రోహం చేయడం
గుడికే ఎసరెట్టేంతటి
గొప్ప దుర్బుద్ధికి చిహ్నం !

నిజం కొఱకు పోరాడే
నిర్మల మనస్సులు చేసే
పనులన్నిటికీ సహకరించు
పరులూ నేర్త్రు నినుచూసే !

నిచ్చెనంతా ఎక్కిన తదుపరి
నిజమిదని తెల్సుకుంటారెందరో
తామెక్కిన నిచ్చెన మరి
తప్పుగోడ కేసిందనిరో !

సహాయం చేయాలా ఇతరులకు
నీ నిధి నిక్షేపాలను వారికివ్వకు
వారు నిధుల కధిపతయేట్టి
తీరు తెన్నులు నేర్ప మరువకు !

ఐకమత్యం కావాలి మన మతం
అన్ని మూఢాచారాలు వదలాలి మనం
మతాలన్ని నిర్మూలిస్తేనే గాని
సన్మతముద్భవించదు నిజం !

పెళ్లనేది ఓ సుందర స్వప్నం
అయ్యేది కొందరికే నిజం
మిక్కిలిగా ఎందరికో అది
మింగుడు పడనట్టి అశనం !

మహానుభావు లెక్కువగా
మధ్యతరగతి వారే
అహమహమిక లేనంతగా
అపార జ్ఞాన శాలురే !

అభ్యసించు తరుణమందు
అపుడపుడూ కలుగు ఓటమి
పట్టుదలకు పదునిడమందు
గెలుపే గెలుపు ఉండదోటమి !

శత్రువు నెల్లప్పుడు
క్షమించి వదిలి చూడు
మరల నిన్ను ఆతడు
బాధ పెట్ట నేరడు !

మనుష్యుల నర్థం చేసుకోవడం
మరీ మరీ కష్టమైన పని
వారు చేప్పేది సుతరాం
వారు చేయనే చేయరందుకని !

తప్పులెన్నడమతి సులభం
ఒప్పుల గూర్చి ఆలోచించం
తప్పు గరిక లాంటిదనా
ఒప్పు ఒదిగి యుండుననా !

స్నేహితులంతటా ఉంటారు
శత్రువులే అంతగా కనబడరు
ఎందుకని మీరడుగుతారా
మీరే వారిని చేయాలిగా తయారు !

అధికాధిక పరిశ్రమ
అనంత లోక జ్ఞానము
అంతగానే పొదుపుంటే
ఆహా అదేగా అదృష్టము!

బరువు తాను మనలను
పడవేస్తుందనుకొనను
బరువెత్తే పద్ధతియే
పడిపోయే కారణ మందును !

అన్నిటి వెల తెలిసినా
దేని విలువ యెరుగడు
ప్రతి దాన్నీ ఏవగించు
వాడే కదా విమర్శకుడు!

దార్శనికత గుండెలోన
దండిగా లేకుండెనా
న్యాయనిర్ణేత ఐ యుండుట
అన్యాయమే యేదేమైనా !

వ్యవస్థలనే నిలదీసే
అవస్థలెదురౌతున్నాయి
దుర్మార్గాలకు పాల్పడే
దుష్టుల ఆటలెదుగుతున్నాయి!

భాషలోని లోపాలకు
బాదరవొద్దు మిత్రులారా
భావంలోని తడబాటును
బాగు చేయ పూనలేరా !

ధనరాసులు పొందాలంటే
ఘన ఇబ్బంది లెదురౌతాయి
బురదలోనే పడాలంటే
బుద్ధి పుట్టడమే తరువాయి !

కొన్ని జీవితాలంతేలే
కోరికలసలే తీరవులే
దొరికిందానితోనే సర్వదా
సరిపుచ్చుకోవాల్సిందేలే !

పూర్వీకుల వైభవాన్ని
పొగడిన నేమి ఫలం
తాతలు నేతులు తాగిన మీ
మూతుల కొరిగేదేం!

ఈ వైరాలు ద్వేషాలు
ఇవి సదా ప్రాణాంతకాలు
ఇవేమైనా కొనసాగునా
వైరి వీడినాంక ప్రాణాలు!

ఈ సంఘాన్ని కాపాడాలంటే
ఇద్దరే ఇద్దరు సమర్థులు
స్థిత ప్రజ్ఞు లోకరైతే
మతి తప్పిన వారితరులు !

వారు మనకు లేనే లేరు
వీరేమో పూనుకోరు
ఈ సంఘం గతింతేనా
గడ్డి మేసినా ఘనతేనా !

పవిత్రులం మేమనుకొనే
ప్రతి ఒక్కరినీ అద్దమందు
ప్రతిరూపం చూసుకొనే
ప్రయత్నం చేయాలనందు !

సుదులున్నవారికే స్వంతమా
సుఖ సంతోషాలేమన్నా
ఒడుగులకే పరిమితమా
బాధా దుఃఖాలేమన్నా!

ఏమంటిరి కుశలమా
ఎక్కడున్న దదంటారు
ఇంకా బ్రతకగలమా
ఏమీ ధరవరల తీరు !

కాంగ్రెసు అభయ హస్తంలో
కమల మిముడునా బిజేపీది
మూయలేని ఆ చేతిలో
ముప్పగు కమలానికే విధి !

కవిగారికి ఒక సౌందర్య
కనబడింది కలలోన
గాలిబు మీర్ ఉభయ
కవి గజల్ల రూపాన !

గజలు సుందరి కావ్యమై
కమనీయమౌ అనువాదమై
చదివిన ప్రతి ఒకరిని
చకితులనే చేసేసెడిని !

మనిషి తెలుసుకున్న జ్ఞానమంతా
తను కార్యాచరణలో పెట్టాలి
ఉత్తమ విద్య ఆర్జించిందంతా
ఉన్నత మానవుణ్ణి చెయ్యాలి !

తోటమాలి తానే పూలను
త్రుంచేస్తాడేం కొమ్మల నుండి
మధు మాసపు గాలులు గ్రోలి
మత్తేమైనా ఎక్కిందేమండి !

స్వర్గానికి రాచబాట
సత్యంగా ఈ కవిత్వం
ఎంత సత్యమీ మాట
ఇంకేం జీవితం ధన్యం !

సుగంధాన్ని గాలులూ
సూర్యకాంతి రంగులనూ
సుబ్బరంగ హరించాక
సుందరమింకానా పూల జడలు !

ప్రతి ఊపిరి ఒడిలోన
ప్రబలంగా కన్నీరే
నవ్వు ముఖం కన్పించిన
నల్లురికి చూపేతీరే !

ఆయువనే మన ఈ
అత్యల్ప సమయాన్ని
చస్తూ చస్తూనే మనమీ
సమయం గడిపేస్తాం !

ఎదురు చూపులోని ఆనందం
ఇంతని చెప్పలేంది నిజం
ఎదురు చూసింది పొందడం
కన్నా మిన్నైంది ఆ ఆనందం !

ఎదుటివారి భావాలను
ఎరిగే శక్తి యుండెనేని
మనసుల మాలిన్యాలను
కడిగే వీలుండెడిని !

తిట్లేవీ భరించొద్దనుకుంటే
తీవ్రు చెవియదుండాల్సిందే
గుట్టురట్టు కావద్దనుకుంటే
గుండె గాయం దాయాల్సిందే!

స్నేహితులే చెలిమివీడి
శత్రువులై పోయిరా
చేయ గలిగిందింకేమి
చింతే గతి చూశారా !

మనలో ప్రతి ఒక్కరిలో
మహిత శక్తి దాగుంది
ప్రపంచాన్నే మార్చగల
ప్రబలమైన బలమది !

విరహాగ్ని నుపశమింప
వైద్యుని ప్రతిభ అనుమానం
బహుశః సంగమమే ఆలోచింప
బహు చక్కని అనుపానం !

ప్రతి నెమ్మదస్తుడు
కాడు వివేకవంతుడు
ప్రతి వివేకవంతుడు
ప్రశంసించాల్సిన నెమ్మదస్తుడు!

ఎందరిదో అభిమతము
ఇతరులు పైకి రావద్దని
కొందరే ఇందుకు భిన్నము
ఎవరూ చితికిపోవద్దని !

అనవరత సత్యాన్వేషణ
అకుంఠిత ధర్మాచరణ
అను ఈ రెండాదర్శాలు
అవే భవ్య జీవిత ప్రేరణ !

నీ భయాలన్నింటినీ
నీ యందుననేవుంచు
నీ ధైర్యాన్నంతటినీ
నీ వితరులకు పంచు !

వినయం కన్నా భూషణం
వేరు లేదు మనిషికి
అది తెచ్చు నాధిపత్యం
అనేందుకు పోనెనుకకి!

ఊరులోని యిళ్ళన్నిట
దివ్వెలేంది నా యింటే
చీకటి నా చిరునామా
చెప్పుతుంది బేషుగ్గా!

తన పని చేయనివాడును
తన పనియు నితరుల పనియు తానొనరించన్
వినుడీ యిద్దరు కూడను
పని దొంగలనియె విధిగా భావించదగున్ !

నీ గొప్ప మిత్రుడవు
నిక్కముగా నీవే నీవు
అందరి స్నేహాలకై
ఎందుకారాటిస్తావు!

జీవితాన్ని
చేదనుకొనువాడు
చేదులనే
ఏరుకు తిన్నవాడు!

వెలిగించేందుకో దివ్వె
వీలుకానప్పుడు కొందరు
తమ కన్నులలోనే దివ్వెల
నమర్ర్తు కన్నీరవ చమురు !

చెడును మంచిగా మార్చు ప్రయత్నం
చెడు అనుకొనుట అవివేకం
ప్రయత్నమే ఫలించినదా
ప్రబలకుండు కదా కాలుష్యం !

నీలాంటి ఓ పరమ
నిస్వార్థుడు కనరాడే
తరతరాలు కవిగారూ తమ
ఒరవడెవడు మరువడే !

దయ్యాలు దౌష్ట్యాలు బలవంతులయి
భయపడితే పట్టి పీడిస్తాయి
ఎదురు తిరిగి నిలబడితే
బెదిరి తోక ముడుస్తాయి!

తప్పులూ ఓటములూ
తప్పనివవి జనులకు
ఒప్పుకో తప్పులు ఓటములు
ఓర్మితో సాధించు జయాలు !

ఒకటొకటిగ కష్టాలు
ఓ మానాన రావు కదా
కొట్టు దెబ్బలు కూల్చుకొంపలు
కట్టకట్టుకొని వచ్చి సదా !

ఆదర్శాలు విజయాలలో
ఏదో ఒకటే సాధ్యం
నీతి అవినీతులలో
నీతి గెలుపే తథ్యం !

కళ్ళెం వేయాల్సిన నోరు
కలవానికి కొరడా ఇచ్చేరు
వాడు చెడిపోవుటే గాక
ఇతరులనూ చెరచి తీరు !

అనుమాన జనితమైన
అపవాదే అదియైన
విడిచిపోవునో మచ్చ
అభియోగిపై నెల్లాగైన !

త్వరిత గతిని పైకెగసిన
వారినే ప్రశంసింతు ప్రజలు
నిజం చెప్పాలంటే ఆ కీర్తికి
అర్థాలు దుమ్మూ, రెల్లు ఈకలు !

చక్కని ఆలోచనలన్నవి
మలుగు చేపలట్టివి
సులభంగా పట్టుబడినా
ఇట్టే చేయి జారుతవి !

సత్యభామ నరకాసురుని చంపిన మాకేమి
దీపావళి ఆనాడైతే మా కొరిగే దేమి
అనే గడ్డు పరిస్థితిలో గదా వున్నాం మనం
చెడును తెగడే బుద్ధే లేదదేమి!

ఎంత కష్టపడి పనిచేస్తే
అంతగ అదృష్టం వరిస్తుంది
శ్రమ కన్నా ముందు జయం
శబ్దార్థ చంద్రికలోనే వస్తుంది !

ప్రజలెందుకు పేరు కొఱకు పడి పడి చస్తారు
పైసా ఆర్జన కొఱకై పదే పదే గడ్డితింటూరు
తము చూడలేకున్నప్పుడూ కీర్తి దాహం పోదు
మరణించినమూ సమాధిపై పేరుంచకోరెదరు !

ఏలిన్నాటి శని పోయే ముందు
వేయనెంచెనా వేటు నా పైన
ఎందుకిలా చేస్తాడితడందు
ఎన్నినాళ్ళ కోపమో నాపైన!

లక్ష్మికి డబ్బ్బా దస్కం లాసిగ నచ్చితే
సరస్వతికి దుమ్మ్మూధూళీ సమానంగ ఇష్టం
ఏలని అంటారా మా గురువు ఇల్లు చూచితే
ఆమెకు కావలసింది వాక్శుద్ధన్నది స్పష్టం !

కొత్త ఫ్యాషనాడ వారిది మీ
చిత్తము నలరించెనా లేదా
జడపైనో గుడ్డ ముడి అది సుమీ
మీరు గమనించితిరా లేదా !

మరుపనేది ప్రకృతికి
మనియుండి నప్పటికి
ఇంకొక షేక్స్పియర్‌ను
సృష్టించదేనాటికి !

మనశ్శాంతి లేదేని నిజం
సుఖ జీవనం కాదు సాధ్యం
మనశ్శాంతి కొనలేం కదా
మనకెంతగ వున్ననూ ధనం !

నీవు చేసిన తప్పు
నిన్ను కాల్చునయి నిప్పు
తప్పు క్షమించలేనిది
ఎన్నైనా నీవు చెప్పు!

అజ్ఞానం రాజ్యమేలుతుంటే
అహం దాని కాజ్యం పోస్తుంటే
అచట జ్ఞానిగా వ్యవహరించడం
అజ్ఞానమే అగును చూస్తుంటే!

కరుణాళుడ నెంతగానో
కఠినాత్ముడనంతె నేను
ఇరువైపుల పదునునాది
ఇట్టే జయించగలను !

నేటి సవ్య నిర్ణయాలు
రేపటి భవ్య వాస్తవాలు
ఆరంభించుటే మరి ఆలస్యం
అంతగ కలుగు విజయం!

పైపై కెదగాలనే దురాశతో
దురూహా దుఃఖ శిఖరాలెక్కి
దొర్లి దొర్లి దొర్లి కొందరు
పాతాళం లోనే పడిపోతారు !

అందగాడైన ప్రతి ఒక్కడు
చంద్రుని లాగే వాడు
తన చీకటి సగ భాగం
తానెవర్నీ చూడనీయడు !

అప్పుకాని ఇచ్చితివా
అది తిరిగి రాదు కదా
శత్రువులను పెంచేసి
శాంతికి దూరం చేయు !

సమస్యల నలక్ష్యం చేస్తే
మరిన్నిటి నాహ్వానించినట్లే
ఎప్పటికప్పుడు పరిష్కరిస్తే
తిప్పలు నీకు తప్పినట్లే !

సన్మానాల నందుకోవడం
సర్వదా మహదానందం
సన్మానం చేసేవాళ్ళు
సమర్థులైతేనే అది నిజం !

చంద్ర కిరణం కన్న
చందనం పూత కన్న
చంపక సుగంధం కన్న
చల్లని మాటలు మిన్న!

ప్రతి నీ ఆనందాన్ని
పాలరాతిపై చెక్కు
ఇక నీ దుఃఖాలన్ని
ఇసుకలోన కుక్కు!

చేలలోని పచ్చగడ్డి
చేదే తానై యున్నను
పాడి పశువు పాల రుచి
మధురంగానే ఉండును !

అమిత జ్ఞానం కలిగినా
ఆచరణ శూన్యుడచ్చం
ఎంతగా దుక్కి దున్నినా
విత్తనం వేయని చందం !

దాన గుణమొకే వైపు
దారిలాగ ఉండాలి
ఇతరుల కిచ్చుటే కాని
తిరిగి కోరకుండాలి !

యుద్ధమెపుడు ఆపాలని
యోచిస్తే తెలిసే నిజం
ఆరంభం కాక ముందే
ఆపడమే సమంజసం!

మ నమన సుఖ శాంతులు
మనలో దొరకునప్పుడు
బయటెక్కడో వాటిని
బడయలేము చూడుడు !

శారీరక అందం దేనికి
మనసు సుందరం కానప్పుడు
కాగితం పువ్వు దేనికి
కాస్తైనా! సుగంధం లేనప్పుడు !

ఓపిక లేనప్పుడు
పాపం మానవుడు
తైలం తగ్గినట్టి
దీపంలా కనపడు !

అంతా బ్రతుకుతారు
కొందరే జీవిస్తారు
బ్రదుకుకు మెతుకులా
జీవితానికాదర్శమలా !

జీవితానికి విజయం
చివరి మజలీ కానే కాదు
నీ కార్య దీక్షాస్ఫూర్తి
నీపై వేసిన ముద్రే మిగిలేది !

దేనిలో నిమగ్నుడవో
తెలిసినచో నీవు
ఎందుకు పనికొస్తావో
ముందే తెల్సుకుంటావు !

పుట్టు ధనవంతుల
బొజ్జలు పెంచేకన్న
అట్టడుగు జనుల
కందించిందే మిన్న!

అతితీపిగ ప్రవర్తించిన
ఆటాడిస్తారు జనం
అతి దురుసుగ మెలిగినను
ఆటాడిస్తారదే జనం !

హక్కులు సర్వదా
పెక్కు శ్రమల తర్వాత
ఆశించిననే చేతికి
చిక్కు చక్కదనాలు !

ప్రతి పనిలో నీవు
పడే తపన నిన్ను
తాపసిగా నిలబెట్టును
తగు వరదాయి అగును !

ఆత్మ గౌరవం లేనివాడు
అవమానాల పాలౌతాడు
అదే ఆత్మ గౌరవం ఉంటే
అంతగ పూజ్యుడౌతాడు!

తల్లి కొంత కాలమే ముద్దు
ఆపై యిక పిల్లలే ఆనందం హద్దు
పరమేశ్వరుడూ ప్రజలకలాగే
వారికాయన సృష్టియే ముద్దు !

చిన్న చిన్న వాటి గురించి
చెప్పగలడెవడు వివరించి
అతనినే సదా నిపుణుడని
అనడమే కడుంగడు మంచి !

శని గ్రహం యేడేళ్ళ నుండి
చక్కగా నాతోడనే యుండి
చిక్కకుండ యే సంతసము
చిత్ర విచిత్రాలు చేయుచుండె !

చిల్లర అప్పులవి
చిన్న పిల్లల తీరవి
ఎంత చిన్నవైతే అవి
అంత గోల చేస్తవి !

వార్త పరిధి దాటినది
చరిత మొదలు పెట్టనిది
మానవ జీవిత మందున
మహా మాంద్య కాలమది !

ఆధ్యాత్మిక చింతన చేయుటకు
సమయ మాసన్నం కాలేదు నాకు
ప్రేయసి ప్రేమ సుడి గుండాలలోనే
ప్రీతి నాకదేమో ఈ రోజుకు !

గులక రాళ్ళకు మెరుగు పెట్టుట
కొంత మందికి అదో ఆట
దాని ఫలితం మహా ఘోరం
వజ్రములకే విలువ తగ్గుట !

ఎన్నుకొనిన ఏ పనినైన
ఎంత దీక్షతో చేసిన
అంతగనే నీ సామర్థ్యముద్రలు
అగుపించు నందులోన !

నీవు చేసిన ప్రతి పనిలోను
నేర్చుకొంటి నెంతో కొంతను
భావం నీలో కలిగనేని
పరిపక్వత గోచరించును !

జన జీవన విరుద్ధమైన
పనులు చేయు హక్కులవి
ఎక్కడ ఎప్పుడు ఎవరికీను
ఏ మాత్రము లేనివవి!

విజయావకాశాల నణచునట్లు
ఓటమి పైకి కనబడినను
ధైర్యంతో ముందుకెళ్తే ఫలప్రదమై
దక్కుతుంది విజయమే ఏమైనను !

జీవితాన్ని సోమరిగా
చెల్లిపోవ నీయకు
పవలు రేయి భాగ్యాలను
వృథా పోవ నీయకు !

మూడు నాళ్ళ ముచ్చటలు
మురిపాల ఈ కలయికలు
ఏకాకిగా ముగిసేవే
చివరికన్ని వీడ్కోళ్ళు !

కొంత కాలమేలే
సంతసాలు దొరలే
వాటి జ్ఞాపకాలే
ఇంక నాకు మిగిలే!

ఎన్నో ఏళ్ళ నుండి
ఏడ్చుటే వంతయ్యె
ఉన్నన్నాళ్ళు నేటి నుండి
నవ్వేస్తే సరిపోయ్యె!

మంచివాడు దొరికనేని
అనుసరించ ప్రయత్నించు
చెడువాడెదురయ్యేనేని
చేరువవుట నియంత్రించు!

నీవేం తయారుచేస్తున్నావన్నది
కానే కాదితరులకు ముఖ్యం
నీ వెలా తయారవుతున్నావన్నది
నీ చుట్టూవారికి అవసరం !

గుండెలో నుండి
వచ్చునదే కవిత్వం
పెదవి నుండి
వచ్చిందా అది పైత్యం !

పతనానికి భయపడి
ప్రయత్నమే ఆపితివా
పతనం కన్నా దుర్గతి
పట్టడాన్ని ఆపగలవా !

శ్రద్ధగా విధి నిర్వహణ
శతధా చిన్నతనం కాదు
జీవితాన్ని తీర్చిదిద్దే
జయకర సాధనమది !

ఆరోగ్యముంటేనే
ఆశలు చిగురించు
ఆశలు ఫలిస్తేనే
ఆనందం పల్లవించు!

సహజత్వంలో ఏదో
చక్కదనం దాగుంది
కృత్రిమత్వమదేదో
కుటిలంగా తోస్తుంది !

నేర్వడం మానేసిన
నిముషం నుండి మనిషి
అనుమానం లేనే లేదు
అయినట్లే ముదుసలి !

విజయాల్లేకుంటే నేం
విశిష్టంగ సత్యవంతుణ్ణి
సంపాదించకుంటేనేం
సవ్యంగా బ్రతికినోణ్ణి !

తన లోపాలను తానే
తగ తెలుసుకున్నవాడు
ఘన ఘన వృద్ధినే
గర్వంగా పొందుతాడు!

విద్య సంపద యందు
విలువైన ఓ నగ
అదియె ఆపదలందు
ఆశ్రిత వత్సల !

ఇతరులు సాధించలేనివి
చతురులు గెలుస్తారు
చతురులకూ చిక్కనివి
సద్బుద్ధులు సాధిస్తారు !

పనులను సాహసోపేతంగా
కొనసాగించే ప్రతిభయే
కాలగమనంలో ముమ్ముందు
కలవాడగుటకు చిహ్నము !

తిండి దొరకనప్పుడో
గుండె మండినప్పుడో
మొండికేసి తిరుగబడే
దండి ఘనుడు ఆంధ్రుడే !

కఠిన పరిశ్రమ చేయాలని
కార్య శీలులవ్వాలని
పిల్లలకు నేర్పించడమే
పెద్దలొసగు భూరి సంపద !

క్షణ కోపం కలవాడే
చల్లని దయామయుడు
కోపం పొడగించేవాడే
కుత్సితుడౌ క్రోధాత్ముడు !

ఆడంబరం గురుతేకాదు
ఆనందాని కదెపుడూను
రెంటి మధ్య నున్న దూరం
కంటి కందనంత వైనం !

స్వాతంత్ర్యం బాధ్యతలు
సయమీస్ కవలలు
విడదీయ ప్రయత్నిస్తే
విధి వాటికి చావులు !

కోపం పాపానికి ధూపం
రోషం దోషానికి మూలం
లొంగిపోకు కోపం రోషాలకు
నింగి కెగురు నీ అదృష్టం !

అపజయం అంచులదాకా చేరి
అప్పుడు పొందే విజయం మరి
అన్ని విజయాలకన్నాను
ఆనందమయం మరీ మరి !

నిష్ఠురం మాటకొస్తే
నిజంగా చెప్పాలంటే
అంత్య నిష్ఠురం కన్న
ఆది నిష్ఠూరమే మిన్న!

విజ్ఞానంతో పాటు మనిషికి
అజ్ఞానమూ కాస్త ఉంటుందేమో
అవసర నిబంధన జీవితానికి
అంతా తెలిస్తే బ్రతుకే దండగేమో !

ఉన్నతుల భావాలను
ఒద్దికగా ప్రతిష్ఠించుకుని
మన ఉత్తమ భావాలను
ఘన ప్రసరణ చేయాలి !

పదాల కోసం వెదుక్కునే పనే లేదు
నా మదిని మెదలని పదమది లేదు
భావమావేశంగ మది నల్లుకొనుతాను
కలము వ్రాయు బిరాన ఆలస్యమే లేదు !

చీకటి అనుభవమైతేనే
వెలుగు విలువ తెలియును
చెడుతో పోలిస్తేనే
మంచి విలువ పెరుగును !

మంచిలో చెడు చూచెడు
మందమతులూ ఉందురు
చెడు కూడా మంచే యనెడు
చిత్త జ్ఞానులు కొందరు !

పట్టుదలను చేసినచో చమురు
కృషి తనంతటు వత్తిగా నమరు
ప్రతిభా భాస్వరం తనుతోడై
అదృష్ట దీపకీర్తి ప్రభలలరు !

పాపాలకు కలవనేక
పనిముట్లు జగతిలో
వాటన్నిటికీ అబద్ధం
పనికొచ్చును పిడిగా నిజం !

డబ్బు విషయాని కొస్తే
మనిషి మృగమేననిపిస్తున్నది
డబ్బే కదా తరచి చూస్తే
మనిషిని మృగాన్ని చేస్తున్నది!

జన్మదిన మందరికీ పండుగ
సరదాలన్నిటికీ హేతువనగ
వేడ్కలు చేసుకుంటారుగా
విశిష్టంగా తమవారితో శుభంగా!

కాంతి ఎలా వచ్చినను
కనుల కిచ్చునానందమే
ఏ తోటలోని వైనను
గులాబీలవి అందమే !

అనుభవంకన్నా బుద్ధిబలంను
అనుకుంటుంది గొప్పని యువతరం
బుద్ధి బలం కన్నా అనుభవంను
భూరిదంటుంది ముసలిజనం !

ఇతరుల అనుభవాలతో
ఎంతగనో నేర్చుట జ్ఞానం
తనవైన అనుభవాలతో
తలపడినచో కలుగు నష్టం !

దేన్నైతే ఇద్దరు
తిన్నగా అంగీకరించరో
ఇరువురిలో ఒక్కరు
ఉన్ననూ లేనట్లేరో!

తప్పు నొప్పుకొనుటలో
ఎప్పుడోట ముండదు
ఒప్పుకొనే నిజాయితీలో
గొప్ప గెలుపు సాధ్యము !

అనుభవాల ఊటలను
ఆపోసన పట్టనిచో
అజ్ఞానపుటెడారిలో
అలమటించి పోతావు !

అడ్డంకులు అవస్థలు
అసలేమీ చేయలేవు
అడ్డమైన నిరుత్సాహాలు
అవసలాపనే లేవు !

తలపెట్టిన పనేదైనను
తప్పకుండా పూర్తి చేయాలి
యముడే అడ్డొచ్చినను
తమ అభిమతం నెరవేర్చాలి !

తమ పని తమకే తెలియని
దద్దమ్మలతో మన పని
ముడేసుకున్నామా ఆపైన
అంతే సంగతి కదా మన పని!

అదృష్టం జీవితంతో
ఆటాడే తీరుచూడ
కన్నీరానందంతో
కారెను దుఃఖంలో గూడ!

కాలం చేసే గాయాలను
కలదా మనకు మాన్పుశక్తి
కన్నులను మార్చి మార్చి
మిన్నగ యేడ్వడమే ముక్తి !

నీకున్న గుండె ధైర్యం
నిట్టే చెప్పే కొలమానం
కన్నీటి అలల నడుమ
కాస్త నవ్వి చూపించడం !

అర శాతం రంతి దేవులు
అయి ఉన్నా ప్రపంచంలో
ఆకలి దప్పులనేవే
అసలుండవు జగతిలో !

నీరే కన్నుల నుండి కారకుంటే
నిట్టూర్పు నిరాశలూ లేకుంటే
అది కూడా ఓ బ్రతుకేనా
అంతా సుఖమయమ్మై ఉంటే!

దుఃఖం తెలుపొద్దని
కన్నీటి నాపగల్గితిని
చిరునవ్వులో కన్పించే
చింత దాచ లేనైతిని !

మున్డ్రాల నుండి దేశంలో
మున్చు రివాజు ప్రజల ధనం
ఒక్కడి నైనా చెరసాలలో
ఊచల్లెక్కెట్టేట్టు చేశామా మనం !

చరిత్ర పుటలలో
సరికొత్త చేదు నిజం
రచ్చ గెలిచి వచ్చినా
ఇంట ఓడిపోవడం !

ఇతరుల రక్తం చిందించుట
ఇంగిత జ్ఞానం లోపించుట
అవసరమైతే మానవతంటే
ఆత్మత్యాగానికి సిద్ధపడుటే !

కవితా నందనవనంలో
కవిగారో వకుళగా పూసె
ఎండుతూ సుగంధాలవనిలో
ఎంతగానో కలబోసె !

పుండే కద చిన్నదదే
పోతుందనుకున్నాను
గుండెలోకి జొచ్చి అదే
గూడు కట్టై చస్తున్నాను !

అనేకానేక జనావళికి
ఆనందం కూర్చేవాడికి
అన్నీ సుఖ సంతోషాలు
అగు స్వంతం వాడికి !

అనుభవజ్ఞుడైతే నావికుడు
అలలూ గాలులకగునతీతుడు
అలజడి సృష్టించినా సంద్రుడు
అమాంతం నావను దరిజేర్చగలడు!

అనంత ఆలోచనా లహరి
అగును మనస్సుల కాహారం
శరీరానికాహారంలాగే
శక్తి నిచ్చు మనస్సు కామాదిరి !

సద్గుణాలనేదేమైనా
సమసిపోనీయవద్దు
ఎన్నెన్ని ప్రలోభాలైనా
ఇసుమంతయు లొంగవద్దు!

మానవతా విలువలు మన
మనసున కవి నిజ వలువలు
వలువలు లేని శరీరం కన
గలమా ఏమైనా మనమసలు !

సౌశీల్యం సౌజన్యాలు
కౌమారంలో అబ్బే గుణాలు
అవే జీవితాంతం నిల్చే
అప్రమేయ గుణ గణాలు !

అంధకారాన్ని తిడుతూ
ఆపసోపాలు పడేకన్న
చిన్నదీపాన్ని వెల్గించుతూ
చైతన్యం కల్గించుట మిన్న !

ఆనందం ఓ పరిమళ రసం
అదితరులపైన చిమ్మడం
అత్యంత మైన అవసరం
అదే నీ మీదా పడేది నిజం !

ప్రతి ఒక్కడు తన తన
పరిసరాలు శుభ్రపరచుకొన
ప్రపంచమంతా తానే
పరిశుభ్రమగు తనంతటన !

చెవిటివాళ్ళు వినగలిగిన
గుడ్డివాళ్ళు కనగలిగిన
తప్పక అందరు నేర్వగలిగిన
గొప్ప భాష దయాగుణమనిన !

జ్ఞానమొక్కటే ఒక పాలు
ప్రపంచ పరిజ్ఞానం పదంతలు
కలబోసి జీవించేదే
కమనీయ జీవిత మసలు !

పౌరుల సౌజన్యం పైనే
ప్రతి సమాజం ఆశలు
నేతలవినీతిజ్ఞులైతేనే
ప్రజాస్వామ్యం మనలేదసలు !

పనిచేసే చేతులు
ప్రబోధించే మేధలు
ప్రతిస్పందించే గుండెలే
ప్రపంచాని కవసరాలు !

ఇష్టానిష్టాల ఆధారంగా
ఇతరులతో ప్రవర్తించగా
ఆనందమనేది లేకుండా
అప్రతిష్టయే మిగులునుగా !

నమ్రతను మించినట్టి
నాణ్యత లేదు నరునికి
ఫలభారంతో వంగునట్టి
వృక్ష మాదర్శమవాలతనికి !

కఠిన పరిశ్రమ మానవుల
కార్యశక్తి కొలిచే మీటరు
అందారంభ శూరులు అతి బద్ధకిష్టులు
అనుమాన పిశాచులే అతిగా అగుపిస్తారు !

కలం నాట్యం చేస్తుంటే
ఇలా వ్రాస్తూ పోతుంటే
కవితా సంకలనాలెన్నైనా
కమనీయంగా వెలయిస్తుంటై!

మేక తోలు కప్పుకున్న
పులులుండే లోకమండి
మనమేమి చెప్పుకున్నా
వీరికేమైనా సిగ్గటండి !

విద్యాలయాలకు తోడ్తోడన
విధిగా వెళ్ళాల్సిన ఆలయాలు
ప్రపంచ జ్ఞాన ధన మిచ్చే మన
ప్రశస్తమైన గ్రంథాలయాలు !

పిల్లల నిర్వీర్యుల చేసే
పిచ్చి విద్యావ్యవస్థ మారి
విజ్ఞానంతో విశ్వ జనులుగా తీర్చే
వైదిక వ్యవస్థ వస్తే సరి !

తనయుని చెప్పు చేతలలో
తండ్రి యుండుటన్న మాట
తండ్రి ఘన ప్రేమ ఇలలో
తనయుని నెగిరించే బాట !

విధి నిర్వహణ కాంక్ష
విపరీతంగా కలవారు
ఎంతటి అలసటనైనా
ఇంధనం చేసుకుంటారు !

ఎంత ఆపి పెడతామో
అంతగనే దరిద్రులం
ఎంత పంచి పెడతామో
అంతకు మిన్న ధనికులం !

పరిస్థితులు తమ కృషిని
ప్రబలంగా ఎదురిస్తుంటే
గట్టి నిశ్చయులైతేనే
తట్టుకుని సాగుతారు !

నెమ్మదిగా పనులైనప్పుడు
నీరసమసలే చెందవద్దు
కుందేలును ఆనాడు గెలిచి
తాబేలవలేదా ముద్దు !

ఆకాంక్షా సరళులలో
ఆహో ఎంత గొప్ప మార్పు
అవి సంభవాలగుటలో
అంతే సులువు ఉంటే ఓర్పు నేర్పు !

మనమూ సూర్యునిలా
పనిచేస్తే దినమంతా
అలుపూ సొలుపనకుండా
ఆదర్శులమౌదు మంతా !

కొందరు తమ పేర్లకు కూర్చలేరు ఏ న్యాయం
గోపాల కిషన్ 'కవిగారి' జీవితం రామాయణం
అలాగే ప్రమాదీ ప్రమోదయినదా
అంత కన్నా మనకు కావాలెం ఆనందం !

చెడిపోతున్నాడంటే ఎవరైనా సరే
బాగుపడే దారి అడగకున్నా సరే
చెప్పడం విధి ఉత్తములైనవారికి
చెడునణచాల్సింది కాదా వారే !

అర్హతే మాత్రం లేనివారు
అర్హులై ఆనందిస్తున్నారు
ఇతరుల అర్హత కనలేక
ఈర్ష్యాళువు లౌతున్నారు !

నాతో కాసేపు మాట్లాడినోళ్ళు
నవ్వకుండా పోలేనివాళ్ళు
ఇదే నా జీవిత పరమ ధ్యేయం
ఇప్పటికే వేనవేళ్ల నవ్వినోళ్ళు!

ప్రతి నీ పనికి తప్పక
ప్రబలంగా మెప్పులు కోరే
భావన నీకున్నంత సేపు
పవిత్రుడవు కానే కాలేవు !

ఇతరుల మంచితనాన్ని
ఎంతగ మనం గుర్తిస్తే
ఇతరులూ మన మంచి తనాన్ని
అంతగానే తెలుసుకుంటారు !

ఉత్సాహం ప్రతి కార్యంలో
ఉప్పొంగే శక్తి నిచ్చును
గెలుపు నిచ్చెన ఎక్కడంలో
అలుపు లేకుండా చేయును!

బాధల చీకటి దూరం చేసే
భవ్య దీపాలెలిగిస్తాను
బాధా వ్యధల మరిపించి
ప్రతి ఒక్కరినీ నవ్విస్తాను !

ముళ్లతో స్నేహం చేసి
గులాబీలనే నవ్విస్తాను
కుళ్ళు బుద్ధులు కడిగేసి
తృళ్ళించేట్లు చేస్తాను !

కోటీశ్వరునైనా సరే
కొల్లగొట్ట గలదు లక్ష్మి
కూడ బెట్టుకున్న ధనం
కొంత పొదుపు చేస్తే నయం !

వాస్తవాలు విస్మరించి
భ్రమల వెంట పరుగెత్త
చివరకు మిగులునది
చింతాయుత చిత్త ప్రవృత్తి!

సుందర బుద్ధి అయితే కోమలి
అందవికారైనా కట్టు తాళి
అందమెన్నడు పనికి రావాలి
అయి కూర్చున్నదా గయ్యాళి !

క్షణ భంగురమైనా జీవితం
సమయముండదనుకోకు నేస్తం
మర్యాదలిచ్చి పుచ్చుకోవడం
మహోన్నత మధురానుభవం !

పెద్ద అంగ వేయాలొస్తే
వెరువకుండ తలపడు
చిన్నంగల్తో ప్రయత్నిస్తే
చేరలేవు అద్దరి చూడు !

కష్టాల పాఠశాలలోనే
క్రమ శిక్షణ అలవడు
గట్టి సమ్మెట వేట్లతోనే
కదా ఇనుము లొంగుడు !

అతిగా ధనమార్జించువాడు
ఆనందంగా బ్రతకలేడు
అతిగా తిండి తినేవాడు
ఆరోగ్యంగానూ ఉండలేడు !

ఇతరుల గూర్చి చెడు
ఏ మాత్రం మాట్లాడకు
నీవే కాక వినేవాడు
పాపిష్టవ చూడకు !

చిన్న చిన్న ఉపద్రవాలకు
చెదరకుండ చాకచక్యాలు
పట్టుదలకు పదునుపెట్టి
పట్టుకొస్తారు గొప్ప గెలుపులు !

ఇతరులకు స్ఫూర్తి నిచ్చేవాడు
స్థిత ప్రజ్ఞుని అంతవాడు
సమాజానికి పనికొచ్చేవాడే
సర్వత్రా పూజనీయుడు !

స్నేహమనే మేలి ముసుగులోన
శత్రుత్వాలవి ఎన్నెన్నో
మంచి మనస్సులు గురైన
వంచనలవి ఎన్నెన్నో !

స్వానుభవంతో నేర్చుకునేవాడు
చాలా సమయం వృథా చేస్తాడు
ఇతరుల అనుభవాలు పరిశీలిస్తే
ఎంతో త్వరగా పైకొస్తాడు !

అనుభవాలు కొన్నితరులతో
అఘోరించడం తప్పు
అనునయించు మాటటుంచి
అపహాస్యంలావచ్చు ముప్పు !

గుండె కదిలించిన
గుప్పెడు అనుభవాలే
గొప్పగా ఎన్నాళ్ళైనా
గుర్తుండే ఘనముద్రలే !

చీమకన్నా ఘననీతిని
చెప్పేవారెవరున్నారని
శ్రమించడంలో ఉన్నట్టి
అమందానందం వేరేలేదని !

ఆధ్యాత్మికత - శాస్త్రజ్ఞానం
అదే పనిగా ఎడమౌతున్నవి
మారణాయుధాల పరిజ్ఞానం
మనుగడకే సవాలౌతున్నది !

గుండెలోని కోరికలన్నీను
దండి వెలుగులో దివ్వెలయ్యేను
బాధల ఈ చీకటులకు
ప్రాతఃకాలమే లేదయ్యేను!

రాతిరి అట్టహాసం సూర్య
రశ్మి తాను వచ్చే దాకనే
చుక్కలూ చంద్రుడా పైన తాము
ఒక్కొక్కరూ జారుకొనునే!

కాలం శీలం రెండు మహిని
ఖచ్చితంగా నిధి నిక్షేపాలే
దుర్వ్యయ పరిచామా వీటిని
దుర్భర వేదన మనపాలే!

మాటాడే తీరు తెన్ను లే
మాత్రం తెలియని వాళ్ళతో
మాట్లాడి ప్రయోజనం లేదులే
మౌనమే మేలలాంటి వాళ్ళతో!

లక్షణమైన లలనెవరూ
లగెత్తదితరుల వెంట
బోనెపుడైన చూశారూ
పరుగిడునా ఎలుక వెంట !

జీవితాంతం మాయని మచ్చ
తాడి క్రింద కూర్చోడం
ఆ పై త్రాగేవి పాలేయైనా
అది కల్లను కోవడం లోకుల స్వేచ్ఛ !

క్రమ శిక్షణ యనునది
యమ ముఖ్యం బ్రతుకందది
విధిగా సతతం బ్రతుకుకు
విజయ మదే చేకూర్చునది !

మంచి తనానికిస్ఫూటాసు
మా మంచి మిత్రుడు మాదాసు
నా కవితలు విన్నదాదిగ
నన్ను వ్రాయమనడమే తన ఊసు !

సంతసమని మన మనుకొనునది
సదా పరుగిడు ఏరులాంటిది
ఉరుకుల పరుగుల ప్రక్రియ
ఒకే చోట నిలువ లేనిది !

శత్రువొకడు చాలు నింట
సహస్రాల పెట్టు బయట
ఎంత బలశాలైనా ఇందరిపై
సుంత సాధ్యమా గెల్చుట !

యుద్ధంకెపుడూ సన్నద్ధత
బుద్ధిమంతుల సమర్థింత
ఇపుడిది నిజమని ఎంచితే
ఇక మానవాళి గతం గతః!

కృతజ్ఞతా భావం నిజం
అతి గొప్ప సౌజన్యం
చిన్న సేవలకు సైతం
మిన్నగ కృతజ్ఞత సమంజసం !

యథార్థవాదినని నేను
సదా అనిపించుకొన్నాను
అదే శాపమైనంతగా
అశాంతికి గురయ్యాను !

మొదటి చూపులోనే మోహముద్భవించు
కనులు కలియగనే కోర్కెలు జనించు
కొండొకచో ప్రేమ గుండెలలో పుట్టి
కనుచూపు లందదిగట్టిదై నిలుచు !

రెండు చెడులలో
ఏ ఒకటీ కోరకు
రెండు మంచి వాటిలో
దేన్నీను విడువకు !

దుఃఖమెంతగ తీవ్రమైతే
దొడ్డ సుఖము సంభవం
చీకటెంతగ చిక్కనైతే
వెలుగు అంతగ విస్తృతం !

ఆకాశ హర్మ్యాలను
అసలే నిర్మించమాకు
అథవా నిర్మించితివేను
అవి కూలితే ఏడ్వమాకు !

భావ కవితా ప్రవర్తకుడు
కాల్పనిక కవితా విస్తారకుడు
దేవులపల్లి కృష్ణశాస్త్రి
ధీశాలీ హాస్య ప్రియుడు !

క్షీరసాగర మథనంలో
గరళం కూడా పుట్టలేదా
మనిషి ప్రతి ప్రయత్నంలో
మంచీ చెడులుండును గదా !

కవిత చదివేవారందరికి
కావాలి సులభం సుస్పష్టం
అన్నదే నా మతమనవరతం
అదే స్థూలంగా నా కవితకాదర్శం !

జీవితమనే వీణలో
మ్రోగనెన్ని అపశ్రుతులో
దాని వాదన యేమైనా గాని
లేనే లేదు మన చేతులలో !

సమయపాలన చేసేవారు
చాలామంది లేనేలేరు
సమయానికొస్తే ఎవడైనా
సహృదయుడనే అనుకోరు !

పతిమూలముగా సతియును
సతిమూలముగా పతియును
సంతుష్టులయే ఏ ఇల్లైనా
సదా కల్యాణ నిలయమగును !

పాప కర్మములను మన
మేపగిదిని చేసితిమా
ఇహ పరాలలో వేదన
ఇంతింతని చెప్పగలమా !

కవిగారూ ఏతెంచెను
కాటికెళ్లు సమయం
మీ కవితల ఆస్తులను
ఏం చేద్దామని భావం !

అనుభవాల పుటల నుండి
ఆవిర్భవించినవే కవితలు
అవందరి గుండెలందుండి
ఆనందించుటకౌను వీలు !

ప్రాయాలని కూర్చుని
వ్రాసే కొన్ని కవితలే
చదివేవాని బుర్రని
చచ్చు పడేసే రాతలే !

నిన్నటి కన్నా నిజం
నేడే ఎంతో నయం
నేటి కన్నా కూడా
రేపే ఎంతో ముదం !

సంతస మనునది ఆశ్చర్యంగా
చక్కని బహుమతి లాంటిది
పంచుతూ బోతే వింతగా
పది రెట్లయి పోయేటంతటిది !

చేసి చూపించినది
చెప్పినదాన్ని మించినది
ఆదర్శం మొదటిదైతే
అరకొర క్రియ రెండోది!

పెద్ద ఉద్దేశ్యాల కన్న
చిన్న క్రతువులే మిన్న
శుష్క వాగ్దానాల కన్న
చూడ ఆచరణలే మిన్న !

అతిగా తిని చచ్చేవారి సంఖ్య
ఆకలితో చచ్చేవారిని మించి
చేయాలంటేనే బాధ ఈ వ్యాఖ్య
చేయమెందుకు ఖాతరారోగ్యం గురించి!

శాస్త్ర జ్ఞాన మెంత ఉన్నా
ఆచరణ కదా ముఖ్యం
డబ్బునేది ఎంత ఉన్నా
దాన గుణం వినా నిరర్థకం !

చక్కని సాహిత్యం విచిత్రంగా జగంలో
ఎక్కడా ఎక్కువగా అమ్ముడవలేదు
విపరీతంగా అమ్ముడైంది మార్కెట్‌లో
విలువలూ వలువలూ లేందంటే తప్పుకాదు !

ఒకరుంటే మరేం మౌనమే
ఇద్దరయిరా ఒక కలహమే
ముగ్గురూ ఆ పైనేతే మరేం
ఎవ్వరూ ఆపలేంది రహస్యమే !

నవ్వాల్సిన క్షణాలలో
యేడ్చేవారున్నారు
ఏడ్వాలిసిన ఘడియలలో
నవ్వే ఘనులున్నారు!

జనుల హృదయ పీఠాలలో
ఘన తిష్ఠ వేయాలంటే
కరుణ ప్రేమ సేవలలో
కవిగారూ వార్ని ముంచాల్సిందే !

తమ రచనల నితరులందరు
చదవాలనుకొనే కొందరు
ఇతరుల రచనల నందుకొని
ఇంటికెళ్ళి ప్రక్కన పడేస్తారు !

పరిపూర్ణతకై మాత్రమే నీవు
ప్రయత్న మెపుడూ చేయవద్దు
శ్రేష్ఠాతి శ్రేష్ఠతపైననే నీకు
చిత్తముండడమే ఎపుడూ ముద్దు!

అంతా సకలబల భారంగా
అనుకొని పూజలొనర్చుము
అంతా నీదే భారమన్నంతగా
అన్ని పనులు నెరవేర్చుము !

మనకధికరణం ప్రపంచం
మనం దాని ఆధేయులం
కాకూడదు కూర్చున్న చెట్టునే
కాలరాచు అవిధేయులం !

ఏదీ మనతో రానిది
ఎందుకు మనదనుటది
ఎవడూ మనతో రాడు
ఎందుకు మనోళ్ళను గోడు !

కన్నుంచితివా కాలంపై
కాపాడు సదా నిన్నది
కరువేమి దుఃఖాలకు
ధైర్యమే మందు చివరకు!

పుస్తకాలతో నా కలిమి
బుద్ధి మత్త్వము వెలిగించింది
బుద్ధి జీవులతో నా చెలిమి
ఒద్దిక నా కెరిగించింది !

మనసు విరుగగొట్టుట
మనకో నిముసపు ఆట
దాని నదుకు పెట్టుట
దండి సమయపు మాట !

అందరిలో ఒకటే రక్తం
అదే ఎ, బి, ల్లాంటి గ్రూపుల సిక్తం
చెప్పినా అదెవరిదైనా
చిందించొద్దు భూమిపైన!

బాధల ముఖంపై నవ్వుట
సాధకులకే సాధ్యమట
అంతటి దృఢ చిత్తులు
అగుటే అసాధ్యమట!

ముగ్ధమైన నిష్కల్మషత
పసితనపు అమాయకత
వేదాంతిలో కనిపించును
విపరీత వినయ శీలత!

జీవితమో మహానది
అనుభవాలుపనదులు
అన్నీ కలసి పారేది
ఆ పరమాంభోధికైతే మేలు !

నేను కామాన్ని గెలిచానని
నారదుడు బీరాలు పలికాడట
తీరా చూస్తే ఆ స్థలవని
మన్మధ దహన సుక్షేత్రమట!

మన అధీనంలో ఉన్నదా
మనస్సు మన మంచి మిత్రువు
తన అధీనానికి లాక్కుందా
ఘనంగా తానిక శత్రువు!

ఎందరో ఇలా పుడతారు
ఎందరో అలా గిడతారు
కొందరే జన్మ సాఫల్యత
పొందు పర్చుకొని పోతారు !

మలం నసహ్యించుకొంటే తాను
అన్నదట 'పాయసం' నిన్న నేనని
'నీ పాలబడి ఇలా అయ్యాను
నీవే దీనికి కారణమని !'

చస్తూ లేస్తూ
బ్రతికేదే జీవితం
పని చేస్తూ చేస్తూ
మరణిస్తేనే ధన్యం !

సమయం వృథా చేస్తివా
శిక్ష నీకు తప్పదు
ఎపుడు తాను వదులునో
ప్రాణం నీకు చెప్పదు!

అహం తాను లోలోపల
అధికమౌతు పోతుంటే
కుంచిస్తుంటుంటుందింటి
కోవెల వాకిలీ చూస్తుంటే !

పగ ప్రతీకారాలు
పరిష్కరించవు సమస్యల్ని
వాటిని నిర్లక్ష్యం చేస్తే
మీటుతాయి తలనెప్పుల్ని!

కడుంగడు మంచి
కడు మిక్కిలి జనావళికి
అనేకానేక చోట్లలో
అన్నే వివిధ రీతుల్లో
అనంతంగా శక్తికి మించి
అందించడమే మనిషికి మంచి !

కావలి కాసేవాడొకడు
కాయలు మేసేవాడొకడు
కాదా యిది జీవిత సత్యం
కలదా దీన్ని మార్చే మార్గం !

నేను శివునిలా నిత్య మహోభోలా మనస్త్వత్వుణ్ణి
నా నెత్తినా చెయ్యెయ్యాలన్న నయవంచుకులెందరని
అంతగ వారి మెదళ్ళలో తాండవం చేసినవాడిని
అందరినీ భస్మాసుర భ్రాతలలా చేసినోణ్ణి !

అనుమాన పిశాచాలు
ఆవహించేదాడవారినే
ఆ సంశయ బుద్ధితో మగువలు
ఆగ్రహం చూపేది మగల పైననే !

ఎవరూ ముసలితనానికి
ఎదగనే ఎదగరు
ఎదగడ మాగితేనే
ముదుసలు లౌతారు !

ఉపకారం చేసేవారికి కొందరు
అపకారం తలపెడతారు
కొందరైతే కారం కంట్లో కొట్టే
కొంచెపు గుణం వారూ ఉంటారు !

దేవుడొక్కడే ఒక్కడు
జీవులెందరెందరో
వారి అభిరుచుల మేరకు
వారెందరినో కొల్వడం !

సిద్ధాన్నం ముందు కూర్చుని
పాక సిద్ధాంతాలనాలోచించని
వాడే తిన్నదాని రుచుల గ్రోలును
లేదా ఆహారమనే పిప్పినే తినును !

చిన్నప్పటినుండీ పిల్లలకు
చెప్పవలెను విలువలను
ఆటపాటలూ అనునయాలకు
అబ్బునులే వేదాంతాలూను !

తమకై మాత్రమే జీవించడం
తథ్యమది జీవన్మరణం
ఇతరులకై మరణించడమే
ఏనాటికీ గొప్ప జీవితం !

జీవితం డికాక్షన్‌లా
చేదే తానెప్పుడు
మనమే పాలు చక్కెరల
పాళ్ళతో తీపి చేయాలెప్పుడు !

ప్రేమ - సంగ్రామాలలో
ప్రతి ఫలితం సంతసమే
ఇష్టమైన మార్గాల్లో
ఎన్ని ముళ్ళున్నా ఆనందమే!

ఇష్టాలతోనే వచ్చునన్ని కష్ట నష్టాలు
ఇష్టమే లేదాయే కష్టమూ లేదు
ఇష్టమైన వాటన్నిటినీ వదులు
ఇక కష్టనష్టాలకు వగచే పనిలేదు!

శరీరంలో ఎన్నెన్నో అవయవాలు
చేస్తూ పోతుంటాయి ఆగకుండా పనులు
వాటిలో మన ప్రమేయముండాల్సొస్తే
వాటి పనితనం ఇక అంతే సంగతులు !

కలకలలాడుతూ
గలగలపాడుతూ
గడిపేదే జీవితం
నవ్వుతూ తుళ్ళుతూ!

సత్యం శాంతి దయ ప్రేమలను
సర్వకాల సర్వావస్థలందాచరించితివేని
అంతకన్నా చక్కని జీవితమును
ఆశించపనిలేదు చెప్పొచ్చదే ఘనమని!

చెలిమి చేదు ఐనది
ప్రేమ మోసమైనది
జీవితమా నీపై నాకు
నమ్మకమే పోయినది!

శ్రీరాముని గుణగణాలు
శ్రీకృష్ణుని సారస్యాలు
అన్నిటికీ నేనాలవాలం
అయినా శాంతి లవలేశం!

ఏడంకంటే మన జనాలంతగా
ఎందుకు భయపడతారో తెలీదు
పదమూడంకంటేనో అలాగే
ప్రపంచ జనులకూ అసలే పడదు !

తెలిసీ తప్పు చేయువాడు
పుట్టు గుడ్డి కన్నా అంధుడు
హితం చెవిని పెట్టనివాడు
ఎంతగానో నిజ బధిరుడు
ప్రియ వచనాలాడనోడు
పెద్దమూగవాడు వాడు!

వచ్చావెక్కడి నుండోయ్
పోతా వెక్కడకండోయ్
మధ్యన మాత్రం నేనూ నీవను
మాయా జాలము లెందులకోయ్!

ఎవరేది అడగకుండా
ఎవరికీ లోటేలేకుండా
ఇస్తినే అందరికీ అన్నీముందే
ఎవరూ వేలెత్తి చూపకుండా!

రహస్యాన్ని దాచడం
గాయాన్ని మరువడం
విశ్రాంతి సమయాన్ని
విజ్ఞతతో వాడడం
సులువుకాదు ఈ మూడు
చేసి చూడు ఓనాడు!

తప్పుచేయడం
మానవ సహజరీతి
దాన్నితరులపై తోయడం
అదే కుటిల దుర్నీతి!

ఇతరులతో
పోల్చకుము
బ్రతుకునీది
బ్రతుకుము!

కడుంగడు చెడుగునీకు
కలుగునని కాచుకో
అదృష్టపు అంచులను
ఆశించి శ్రమించుకో
అందిన ఫలమేదైనా
ఆనందంగా అందుకో!

బాధల నెదుర్కొనుట
బహుళంగా వీలుకాదు
అమితానందమూ అందుకొనుట
అదీ హృది తాళలేదు!

మనం చేయు పాపాలెప్పుడు
మన పిల్లలను వెంటాడు
వారి బాధ చూడలేక
మన హృదులు కొట్టుమిట్టాడు!

నా అక్షర తూణీరము
నవోన్మేష సంబారము
బాణాలవి అనంతంగ
బయల్వెడలు నిరంతరము!

అనుకొనుటే తడవుగా
ఆగకుండ వీగకుండ
వర్జ్యం వారం లేకుండ
వస్తువ్వుకై తడుమకుండ!

ఆత్రముగా కవిత్వము
ఆలోచనలందు మసలు
కలందాన్ని సత్వరము
కావించు  అక్షర ముద్రణం !

విశిష్ట అన్యోన్యంగా
విశ్వాన్ని తీరుద్దాం
అడ్డులేవి లేనంతగా
హద్దులన్ని చెరిపేద్దాం!

మనిషికి మనిషికి మధ్య
మత భేదాల్లేకుండా
సర్వోత్కృష్ట సమైక్యతా
స్వరాజ్యాన్ని స్థాపిద్దాం!

చక్కని మన జగతిని
కలుషిత మవకుండా
హిత స్నేహిత కుసుమాలను
అమితంగా విరియిద్దాం!

ఇటు చూస్తే ప్రపంచ బ్యాంక్
అటు చూస్తే ఉద్యోగుల ర్యాంక్
ఇథమిద్దం తేల్చడం కష్టం
ఎంతగానో పీయం సతమతం !

విద్యుత్ బోర్డును చీల్చడం
వీలయేనా గవర్నమెంటుకు
చీలికనెలాగైనా ఆపడం
వీలయేనా విద్యుత్ స్టాఫ్‌కు!

జనహితమైన పనులు చేసేవారే
మనందరికీ కావల్సినవారు
ఇతరులకు నష్టం చేసేవారు
ఎల్లప్పుడు దూరముంచాల్సినవారే
ఆంజనేయస్వామీ! నా
అభిమతం నెరవేర్చు
ఆ దిశలో నను నడిచేలా
ఆశీర్వచనములు కూర్చు!

శ్రీశైలం జల విద్యుత్తుకు
చీడ అయ్యె జలమే ఎందుకు
పెద్ద డాములు కట్టేవాళ్ళకు
పిట్టగోడలు కట్టరానందుకు!

కొత్తగూడెంలో ఐదారు యూనిట్ల కేబుళ్ళు
చిత్తు చిత్తుగా అగ్ని దగ్ధమయె నెందుకు
భూమిలో పాతి వుంచిన కేబుళ్ళు
స్వామి భక్తి పరాయణత చూపనందుకు!

అడుగులోన అడుగువేసి
నడవండీ అందరూ
బడుగు జనుల సేవచేసి
బ్రతకండీ అందరూ !

కాలంతో చేయి కలిపి
కదలండీ అందరూ
దానిలాగె ముమ్మందుకు
పూని పొండి అందరూ!

ప్రపంచ మాతృమూర్తుల దినం
మానవాళి కంతటికీ సంబరం
తల్లులందరికీ అభినందనలు
తన ప్రతినిధిగా తల్లి దేవుడి వరం !

ప్రతకాలనుకుంటే నీవు
పాపిష్టి పనులు తప్పవు
నీతిమంతులకు ఇచ్చుట
నెనరూ నాణ్యం దక్కవు!

ఆ లేమ అందం చూతురు
అంతగ కనులే చెదురు
అయినా మీ చౌపద ముందు
ఆమె అందం బలాదురు !

జీవితమో పాంథశాల
రాకపోకలన్నీ ఓ లీల
ఎన్నాళ్లు గడిపినా నేస్తం
యేనాడైనా విడవడం ఖాయం !

ఏమైనా చెప్పండి
ఏదైనా అడగండి
ఈ మౌనం కవిగారూ
యేం బాగా లేదండి !

నేనెవరికన్నా శత్రువునైతే
వారిని నేను కాదనలేను
నాకే శత్రువుల్లేరైతే
అదే నా అభిమతమందును!

చిన్న పిల్లలూ త్రాగుబోతులూ
చెబుతారెపుడూ నిజమే
కన్న తల్లులూ న్యాయాధీశులూ
కాదా ఇది మీకనుభవమే !

ఎందరెందరో పుడుతుంటారు
మరెందరెందరో గిడుతుంటారు
జీవితం ధన్యం చేసుకోవాలనే
జిద్దు యెందరి కుంటుందంటారు!

ఇష్టానిష్టాల కనుగుణంగ
ఇతరులతో ప్రవర్తించగ
ఆనందమనేదే లేకుండ
అభినివేశమే ప్రాప్తించునుగ!

అనుకొన్నవనుకొన్నట్లు
అవడం అంతగా అసంభవం
అనుకోనివి మేమున్నామన్నట్లు
అవడమపుడపుడు సంభవం !

ఏదీ ఆశించనివాడు
ఎపుడూ నిరాశుడవడు
ఆశల వలయంలో పడితేనే
అగును సదా నిరాశా నిస్పృహుడు !

దృఢ నిశ్చయశీలురు
దారి అడ్డు రాళ్ళను వారు
అభ్యుదయ సోపానాలని
అధిరోహించి గెలుస్తారు!

ఎందరినో దరులకు చేర్చి
ఏకాకి తాను నావైనట్లు
ఎందరినో ఎదగ చూచువారు
కొందరెపుడూ ఏకాకులట్లు !

ఇతరులను సంతోషపెట్టు
ఈ జన్మ సఫలం చేసుకో
అదే నీ సంతోషం గుట్టు
మరో జన్మ ఆరాట మెందుకో !

అమ్మా నీవే పలికించు
కమ్మని కవితలు వ్రాయించు
జనములు వాహ్వాయనునట్లు
ఘనముగ నన్ను దీవించు!

పారే కన్నీరుకు నేను
పాఠమొకటి నేర్పినాను
ప్రేమను అవమానించకు
ధీమాతో నడువు ముందుకు !

ఒకే చుక్క కన్నీరని మన
మూరుకోలేం ఏలన
అలలనువ్వెత్తు లేపుతుంది
అది ప్రేమ సంద్రంలోన!

ఒడి ఆసరా కన్నీటికి
ఒకటైన దొరకదాయె
పడిపోయే గుండె గుడికి
ప్రమద ఊతం దొరకదాయె!

భూరిగ ఇన్నాళ్లూ
భూమిపై పోరాడాము
గ్రహాలపై ఘర్షణకై
ఇకపై తలపడతాము !

సమయానికి విలువ తెలియని
మంచీ మర్యాదా లేవీ లేని
వారితో మనకు పని పడిందా
ఇక  అంతే కదా మన పని!

తమ నాల్కకు విలువనివ్వని
తమ బుద్ధికి పనే చెప్పని
ఎందరినో దిన చర్యలలో
చూస్తుంటాం ఎందుకని !

భార్య మనిషిలో సగ భాగం
స్నేహ గణములో ప్రియ నేస్తం
ధర్మ అర్థ కామాలకే కాక
మోక్ష స్థితికీ తానే మూలం!

ఫలితంపై ఆశ నిలిపితే
పని సక్రమమవదు సుమా
పనిపైనే ఆశ నిలిపితే
ఫలితం తప్పక కలుగు సుమా!

కుటుంబ విహార యాత్రలు
పటుతరమైన అవసరాలు
మనోల్లాసాలు వెల్లివిరిసి
మానవతా భావం రాటుదేలు !

సద్గుణాల నేదేమైనా
సమసిపోనే పోనీయొద్దు
ఎన్నెని ప్రలోభాలెదురైనా
ఇంచుకైనా లొంగవద్దు!

సమయంతో సరితూగడం
సాధ్యం చేసుకునే దెందరం
సమయాన్నాపి అధిగమించడం
సమయజ్ఞులకే కదా సాధ్యం !

పౌరుల సౌశీల్యంపైనే
ప్రతి యొక్క సమాజపు ఆశలు
ప్రజలవినీతి పరులైతేనే
ప్రజాస్వామ్యం మనలేదసలు !

అంధకారాన్ని తిట్టుకుంటూ
ఆపసోపాలు పడేకన్నా
చిన్న దీపం వెల్గించుకుంటూ
చైతన్యం కల్గించుట మిన్న !

చేతికి జపాను రిస్టు వాచి
చేరరెక్కడికీ ఆచితూచి
ఎంతలేటవెళ్తున్నామని
సుంత చూడడానికా వాచి !

ప్రతి ఒకడూ తన తన
పరిసరాలు శుభ్రపరచిన
ప్రపంచమంతా ఒకప్పుడు
పరిశుభ్రమగును తనంతటన!

ఇండియాలో రైలోనాడు
ఏకంగా టైంకు ప్లాటు ఫారం చేరింది
ఇదేమిటని అడుగగా చెప్పాడొకడు
"ఇది నిన్నటిదిలే ఈ రోజొచ్చింది" !

జ్ఞాన మొక్కటే ఒక్కపాలు
ప్రపంచ పరిజ్ఞానం పదంతలు
కలబోసి జీవిస్తేనే
కమనీయ జీవితమసలు !

సాటి మానవుని ప్రేమించడు
దేవునికీ తను భయపడడు
ఇట్టి మానవుడీ దుస్థితిలో
ఎంతైనా ఓ ఘాతకుడు !

చిమ్మచీకటిలోనూ
చిందిస్తారు వెలుగులు ప్రేమికులు
నెమ్మి వెలుగులలోనూ
కమ్మిస్తారు చీకట్లు దంపతులు!

అందరమూ ఓనాడు
అంతమగు వారమే
అని ఎరిగిన ఎవడు
అహంభావి కాలేడు !

శత్రుత్వంతో హృదయం
శాపంగా మారకముందే
చేసుకొని హృదయచాలనం-
స్నేహితం నేరపాల్సిందే !

ఎంతగ ఎదురు దెబ్బలు తాకితే
అంతగ ఎదుగుతాడు మనిషి
సుంతైనా ఆపదలే లేకపోతే
చూసేందుకు లేనేలేని నగిషి!

మానవీయ విలువలు
మట్టికొట్టుక పోతున్నాయి
తల్లిదండ్రులపై ప్రేమలు
తక్కువై పోతున్నాయి !

పిల్లలు లేరను బాధ
తల్లిదండ్రులు పడొద్దు
ఉన్నావాళ్ళ ఊసులతో
ఓదార్పు చెందుట ముద్దు !

మీకేమండి కవిగారూ
మీరెన్నైనా చెబుతారు
మీలా ఇలా చక చకా
మేమెదిగే ఊసేలేదు!

మన భూగర్భ ఇంధనాలు
మరుగౌతున్న వైనాలు
మన ఇంధన అవసరాలు
నిత్యం పెరిగే సత్యాలు
అందుకనే సంప్రదాయేతర
ఇంధనాలు గత్యంతరాలు !

ఎందరు పుట్టలేదు మహ
నీయులు ఎంతగ కీర్తినందలే
దెందఱినందులోన జగ
తిన్ తమ ఖ్యాతులు శాశ్వతమ్ముగా
కందుము కాల సంద్రమున
కందరు నొక్కటి యేను ఐనయున్
ఇందరు కీర్తికాముకత
కెందుకు అఱ్ఱులు చాచువారలో!

మన శాస్త్రజ్ఞుల దృష్టిని
మరల్చాయి సూర్యశక్తి పైకి
చక్కని అనంత శక్తియని
సాంప్రదాయేతర ఇంధనానికి!

భారతదేశంలో రాజకీయం
పాలక పక్షం - ప్రతిపక్షాలు
బౌండరీ లేని క్రీడా మైదానం-
బాలాటాడే క్రీడాకారులు
కుర్చీ అనే ట్రాఫీననుదినం
కొల్లగొట్టుటే వీరి ఆశయం
పూనికతో దానికై నిరంతరం
పోట్లాటలే వీరాడటం
ఇటూ అటూ ఇద్దరూ తన్నే
ఫుట్‌బాలేంటనుకున్నారు
కోట్ల సంఖ్యలో జనాన్నే
ఓట్ల కోసం తంతున్నతీరు!

చంబల్ వదలిన ఘనులు
అంబలి కాంధ్రాకొచ్చిన జనులు
అన్నంతగా దోస్తున్నట్లున్నది
ఆహా చిన్నారుల నర్సరీలు!

గతించింది ఇతిహాసం
రాబోయేది అనూహ్యం
నమ్మకంగా వర్తమానమే
నాణ్యమైన బహుమానం !

కుంటిసాకులు చెప్పేవాడికన్న
గొప్ప సమయ హంతలేడు
కాలం వృథా చేసేవాడి కన్న
కంగాళీవాడు లేనే లేడు !

కార్యకర్తగా నెగ్గుకొస్తేనే
నిర్వహణాధికారిగా నెగ్గుతావు
ఉట్టికెక్క లేకుంటేనే
స్వర్గానికెలా ఎక్కుతావు !

మంచిని ప్రేమించేవానిని
చెడును దూషించేవానిని
కలికాలం మాయో యేమో
చేరనీయరు కదా దరిని !

పెళ్లీ ఇల్లు కట్టడాలు
పెద్దవే రెండు కార్యాలు
కష్టాలని అనుకోకుంటే
కావా రెండదృష్టాలు !

నా కోర్కెల నగరంలో
నానా దివ్వెలెలిగించాను
పట్ట పగలు కూడా ఇట
దిట్ట చీకటి అనిపించును !

అందాలకు అష్టాంగాలు
అర్పింతాలనిపించును
అందాలన్నీ సృష్టిలో
అవి నా కొరకనిపించును !

బాణాలామె దురాగతాలవి
బాధిస్తునే వుంటున్నా
బాధలోనా ఆ వలపులు
బామ్‌గానే తలపించును !

బాధలతో మరీ మరీ
బద్ధలైన మనసులను
కవితలతో జోడించ
కావ్యంలా మరువకు !

గుండెలోన భగవంతుడు
ఉండి నిదురపోతున్నాడు
కోరికలు గుండెచుట్టూ
గోల మీరు చేయకుడు !

మనల్లో కోట్ల జీవితాలు
మహా భారత రామాయణాలు
అందుకనే నిరంతరమీరెండు
ఆదరింపబడు కథాంశాలు !

జీవన సాగరం మథించి పొందే
చీకటి - వెలుగు, సుఖ - దుఃఖాలు
మథన మెంత ఉద్ధృతమైతే
మనిషి కన్ని అనుభవాలు !

సమస్యలందరికీ ఉంటవి
ఎవరెవరి సమస్యలు వారివి
వాటిని మనం గుర్తించకుంటే
వాటంతటవే సమసి పోతవి !

గతం మరచిన ఘనునికి
భవిష్యత్తు శూన్యమననికి
ఆలోచించాల్సిన పనిలేదు
అది వర్తిస్తుందందరికి !

నేనలా కాదని చెబుతూ
తానలాగే ప్రవర్తించుతూ
అదేందని అడిగితే బుస్సని
అనేవాణ్ణేమందాం చెబుదూ !

కవిత మనిషికో గొప్ప వరం
కలదు అందులో మహాదానందం
ఏమని చెప్పను నా ఈ అనుభవం
వ్యథలన్నిటికీ కవి కడు దూరం !

అసలే కురుల మరులు
అందులోన విరుల సిరులు
పురుషా నీ ప్రతాపం
పోటై పొంగి పొరలు !

పదారేళ్ళు దాటగానే
పార్టైం జాబు చేస్తేను
ఆకలించి బ్రతుకునే
అర్థవంతం చేస్కోవచ్చును !

ఎంత చక్కని భాష
ఈ తెనుగు భాష
ఎంత రాసిన సుంత
విసుగు పుట్టని భాష !

ఎవణ్ణో నేనర్థించనంటూ
అదెదుటి వారల మాటన్నట్లు
అంటూ తగిలిన వాణ్ణల్లా అర్థించే
అమాయకుల నేమనాలన్నట్లు !

బరువాయెనా సంబంధాలు
మరుక్షణం చేస్కో తెగతెంపులు
పొగడ్తయే తలకెక్కిందా
పోనీవాణ్ణి వాని దారులు !

కుజగ్రహంలో నీళ్ళున్నాయని
కన్లాలు పొందగలిగాడు మానవుడు
ఎదుటివారి మనసులో యేముందని
మాత్రం తానెరుగ లేకున్నాడు !

సమస్యల మూల కారణాన్ని
సదా పట్టి పరిష్కరించాలి
లేదా గుర్తించకుండా వాటిని
పట్టీ పట్టించుకోనట్లుండాలి !

కలము పట్టి కవిగారు
కవియైనప్పటి నుండి
గుండెలలో మాకు ఆమని
గొప్పగా చిగురించెనండి !

కవిగారూ మోసపు పీడలు
కాలేదంతం మీకింకా
కలం శైలి ఇంతింతగా
కాగడా చేస్తున్నారింకింకా !

ఎంత పిచ్చి కవిగారూ
దుఃఖం మ్రింగుతూ నవ్విస్తారు
ఇది కూడా కొందరికి
వ్యర్థైతే మీరేం చేస్తారు !

పట్టణంలో అందగత్తెనని
దిట్ట కవితలా మురుస్తున్నది
మూడు నాళ్ళదే తన మురిపెం
కవిత ఎప్పుడూ నవ నాదం !

నా పని తీరు జపనీయమది
నాశం చేయదొక క్షణమది
అందుకే వారి మోడల్స్‌లా
అంతగ ఈ కవిత్వం ఎదుగుతున్నది !

సామెతంటే మీరు
ఏమనుకున్నారు సారు
చిన్నదైనా కూడా వాక్యం
చెప్పలేనంత అనుభవ సారం !

సామర్థ్యం నైపుణ్యాలకు
ససేమిరా దేశంలో లేదు కొదవ
వాటిని వెలికి తీయుటకే
మేటి జనుల కొదవ !

బాల బాలికలు తెలుసా
పౌరులు రేపటి కాలానికి
దేశ భవిష్యత్తూ వారే
దేశ సంపదయు వారే !

ఆడవారి ఆ అందం
ఆ సుకుమార సుగంధం
మోక్షానికే ప్రతిబంధకం
మొగాళ్ళ పాలిటి బంధం !

కవిగారి కవితలన్నీ
కమనీయాలై తోచును
ప్రేయసి చేసే గాయాలను
ప్రేమాంజనమై తీర్చును !

ఇతరులకు చేసిన
ఇంత మంచియే
మానవుడార్జించిన
మహిత మహర్ధనం !

పెళ్ళి - పొరపాటులు
మళ్ళీ మళ్ళీ కూడనివి
ఒక్కసారికే ఒకప్ప
తిక్క కుదిరి పోయేవి !

ఓపిక అని అనునది
ఒక చేదు వృక్షం
ఎంత ఎదిగితే అది
అంతగ ఇచ్చు తీపి ఫలం !

సత్యం- ప్రేమ రెండు
సర్వదా నా మతాలు
వాటి కన్ననూ మెండు
ఏవి కావు ఆనందాలు !

ఎవడూ నీ కష్టాలను
వినేందు కిష్టపడడు
ఎందుకంటే వాడూ కష్టా
లందు కూరుకుని ఉంటాడు !

చనిపోయిన అనంతరం
బ్రతకాలని ఉన్నదా
బ్రతికున్న క్షణ క్షణం
మంచి పనులు వీడబోకు !

కలలు నిజం
కావాలనుంటే
మేల్కొని నీ
నడుం కట్టు !

చెడు అలవాట్లతో
చేయి కలిపితివా
నీపై నీవే నిక్కం
నిగ్రహం కోల్పోతావు !

వృక్షరాజములైనా
విత్తునుండే పుట్టాలి
ఎంతటి గొప్పవైనా
సుంతనుండే ఎదగాలి !

జీవితం మనకిస్తుంది
చెప్పలేనన్నుభవాలు
వాటినుండి నేర్చుకుంటే
కోటి కోటి పాఠాలు !

అలవాటునేదేమైనా
ఆపుకోలేకుంటిమా
అదవసరంగా మారినా
ఆశ్చర్యపడాల్సింది లేదు !

చెవిటి భర్తా
మూగ భార్య
వీరి జీవితాలు
వెర్రి ఆనందాలు !

పూలను సూర్యరశ్మి
పులకింపచేయునట్లు
మన దరహాస మితరులకు
మహాదానందాన్నిస్తుంది !

అందం మన కన్నుల
నమాంతమాకర్షించును
మంచి తనం మన జనుల
మతులనే దోచుకొనును !

పూవుకు సుగంధం రీతి
మానవునకు మహిలో నీతి
అంటి పెట్టుకు అదున్నట్లు
అతడుండాలి నీతితో ఆ రీతి !

చెరకు గడనోటికి
చేదు ఉన్నప్పటికి
కొరికే నోటనే చేటు
చెరుకు నన నేటికి !

అన్ని నీ వస్తువులను
అంతగ పోగొట్టుకున్నను
బాధపడకింకా నీకు
భవిష్యత్తు మిగులును !

పేదవాడివా అన్నంతగా
సాదా జీవితాన్ని గడుపు
గగన విహారివా అన్నంతగా
ఘన ఆలోచనల్ని నడుపు !

సమానులనే ఎపుడూ
సలహాలు నీవడుగు
నీకన్నా అధికులనే
నీవెపుడూ సాయమడుగు !

సహజీవుల తప్పులను
సాహసించి తెలిపితివా
ఇక నీకో మిత్రుడెవడును
ఏమైనా వుండడెరుగుదువా !

ఒకే ఒక్క మేలు కొడుక్కు
ఒనరించ తలంచితివా
ప్రోత్సాహము మూటకట్టి
ఉత్సాహంగా అందించు !

తేనెటీగల పోరు పడితేనే
తీయతేనె లభిస్తుంది
బాధలెన్నో తెగపడిననే
భవ్యంగా జీవితం తరిస్తుంది !

కోరుకున్న వాటన్నిటిని
కూరిమిగా కొనబోకుము
అవసరమైన వాటిని
అమర్చుకోక ఉండకుము !

అహంకారమన్నది
అడుగంటితేనే
అచ్చమైన మానవునిగా
ఆదరింతురందరూను !

ఒకరికొకరం సాయం
ఒద్దికగా చేసుకోకుంటే
ఈ ధరపై నివాసం
ఎందుకికన్నట్టే !

విమర్శ చేయడంలో
విజ్ఞులం మనమంతా
పొగడే విషయంలో
పోమేం ముందుకంత !

ఇతరుల బ్రతుకుతో
సుతారాం పోల్చుకోకు
నీ బ్రతుకును విలువలతో
నీవు బ్రతుక మరువకు !

ఈ యుద్ధాలని
ఆపకుంటే మనము
ఇవి మానవ జాతిని
ఏమార్చును నిజము !

సకలబలునికి
సదా భయపడితే నీవు
సత్యంగా మనిషికి
ససేమిరా భయపడవు !

చిన్న చిన్న పిల్లలప్పుడు
చెప్పి నేర్పిన సద్బుద్ధులు
వృద్ధులు తామైనప్పుడు
వుండిపోయే చిరకాంతులు !

పాచికలను
పన్నివేయడం కన్న
వాకిటి బయట
పారవేయడం మిన్న !

సత్యవ్రతునికి
శత శాతం శత్రువులు
గోడమీది పిల్లికి
గొప్పగనే స్నేహితులు !

ఉద్యోగంలో నీవు చేసిన
ఉపకారాలు ప్రజలకు
చేసిన పదవీ విరమణ
చేరవు నీతో కొంపకు !

పుట్టుక సూర్యోదయం
పోవడమన్నదస్తమయం
జీవితం పని సూర్యునిలా
వస్తూ పోతుండడం !

నీ పని తెలియకున్న
నీకది కఠిన శ్రమ
దానినాకళించుకున్న
పనే నీకగు రమ !

కోపాన్నదుపు చేసు
కోవాలని నీకుందా
అదొచ్చేటప్పు నూరు లెక్క
పెట్టుటే మేలు తెల్సిందా !

ఊయల పొత్తిళ్ళల్లో
ఒనగూడిన అలవాట్లు
ఊపిరాగునందాకా
ఉండునన్న నిజాలు !

పైన ఉన్న రెప్పలను
మన కన్నులు కాంచలేవు
క్రింద నున్న ముక్కునూ
పొందికగా చూడలేవూ !

ఫలించిన మన దినం
ప్రసాదించు మంచి నిద్ర
ఫలమయమైతే జీవితం
ప్రశాంత చావు లభ్యం !

కోరికలన్నీ
ఏరి పారేస్తే
కొరవుండదు
నందానికి !

భూతమూ
భవిష్యత్తూ
మనకొకప్పు
వర్తమానము !

పరువును
లెక్కచేయని
వాని వద్ద
సిరి వుండదు
తప్పులు చేయకుండడం
గొప్ప తానెప్పుడూ కాదు
దిద్దుకొని తిరిగి చేయకుండడం
దివ్యమైన అలవాటు కాకపోదు !

సత్యమన్న ఆసక్తి
అబద్ధంపై అనాసక్తి
అందరిలోనూ ఉన్న
సహజ మహాశక్తి !

పరిసరాలు తామనుకూలిస్తే
ప్రశాంత జీవనం మామూలు
పరిసరాల కనుగుణంగా మెదిలే
బ్రతుకులో అన్నీ ఆనందాలు !

యజ్ఞం చేయిస్తున్న
ఋత్విక్కునైనా సరే
అగ్ని తనను ముట్టుకున్న
ఆహో కాల్చడం తప్పని సరే !

గడ్డు పరిస్థితులేవైనను
అడ్డుకో యజమానిలా
వాటిని నీ యజమానులను
యేటి కవనిస్తావలా !

అణకువ కరుణ
అతి సాదాతనము
అనునీ మూడు కారణాలు
అన్ని గెలుపులకు నిజం !

ఓటమి తను నేరము
ఓ మానాన కానే కాదు
గొప్పది కాదా లక్ష్యము
కొండంత నేరమది నిజము !

మన జ్ఞానం మన
మార్గ నిర్దేశిస్తే
విజ్ఞత మన మార్గాన్ని
వెలిగించి చూపిస్తుంది !

జీవితం సఫలం
చేసుకోవాలా
కూర్చోబోకు క్షణం
కృషించు తేనెటీగలా !

తన విలువను
తానెరుగనివాడు
ఇతరుల విలువను
ఏమెరుగ గలడు !

సత్యానినతరులకు
ససేమిరా పంచలేము
అది మనందరిలోన
అంతగనే వుంది నిజం !

స్వల్పమైనా కూడ
సంఘటిత శక్తులు
మట్టి కరిపిస్తాయి చూడ
మహోమహిత అనైక్యులను !

తనపై లేదా
తనకే నమ్మకం
తనంతటొస్తుందా
తానే విజయం !

మనసందం లేనప్పుడు
మనిషికున్న అందం గోడు
మనం పట్టించుకోలేము
మనసందమెంతదో చూడు !

తెలిసీ తప్పు చేయువాడు
పుట్టు గుడ్డి కన్నా అంధుడు
హితం చెవిని పెట్టనివాడు
ఏమైనా నిజ బధిరుడు
ప్రియ వచనములాడనివాడు
పెద్ద మూగవాడు వాడు !

కఠిన వాక్యములు గుండెను
కాల్చేసు హుతాశను కీలలు
కరుణోక్తులు వెన్న కన్నను
కడుసుతి మెత్తని లీలలు !

కడుపు ఆహారం క్వాంటిటీ కంట్రోలర్
కాని నాలుకేమో క్వాలిటీ కంట్రోలర్
అయినా కడుపునిండాక నాలుక రుచని నింపితే
కలిగే దనర్థం అనారోగ్యం ఆపై డేంజర్ !

యథార్థవాదు లిమిడిపోయే
పృథివి ఇదిప్పుడు కాకపోయే
చస్తూ చస్తూ బ్రతికే కన్న
చనిపోయి బ్రతకడం మిన్న !

సుఖ సంసారాలవన్నీ
ఒకే రీతి గుంటాయనిన్నీ
దుఃఖ దగ్ధులగు వారివి
దొడ్డ వేర్వేరు రీతులనిన్నీ
అన్నాడు కౌంట్ లియోటాల్స్టాయ్
ఆయన వాక్కెంతగా నిజమోయ్ !

ఇనుమునకయస్కాంత మెలా
నరునికి కురులటులా
యేమ్మాయుందో ఆ రెంటిలో
ఈడుస్తాయి ఈ రెంటినలా !

నీలో నీకు నమ్మకం
నిక్కచ్చియైన నాడు
నీవికెవరికి అమ్మకం
నిక్కముగా అవవు చూడు !

ఉపవాసాన్ని దీక్షా తపస్సనీను
ఉచ్చరింతురు - దీనితో వికసించును
ఆత్మ శక్తులూ బుద్ధి బలాలూ
అలాగే సాహస సక్రమ జీవనమూనూ !

ఆడరాక మద్దెల
ఓడందట నాట్యతార
అందరూ తమ లోపాల
నితరులపై నెట్టువారె !

మనిషి శరీరానికి తూర్పు దిశ ముఖం
భ్రూమధ్య మందు భూరి విజ్ఞాన నివాసం
అపుడు పడమర - తలవెన్క భాగం
మాడుత్తరం మరి పాదాలు దక్షణం !

కమ్మరి దాగిలి ఓపికగా
సమ్మెట పోట్ల నోరుస్తుంది
మనము అదే ఆదర్శంగా
ఘన సహన శీలులవాల్సింది !

ప్రతి కొత్త సంవత్సరం తాను
మనకేదో మంచిని తెస్తుందను
మన విష్ఫుల్ థింకింగే గాని
మరవలా వస్తూపోతూనే ఉండును !

క్షణం వృథా కాకుండా
చదువుకోవాలి విద్యార్థులు
గుణం తప్పిపోకుండా
నడచుకోవాలి మానవులు !

సంవత్సరమంతా మనం చూసే
చవులన్నీ కష్ట సుఖాలవి
షడ్రుచులుగాది పచ్చడిలో వేసి
చవి చూపేవే మన ఆనవాయితీలవి !

క్షణమైనా ఏదో ఒక పని
చేయకుండ ఉండబోకు
కర్మలవలననే దాని బంధాన్ని
కడ తేర్చ వచ్చుని మరువకు !

మనిషి విచారంగా ఉన్నప్పుడు
మరో ఉపాయాలన్నీ ఫెయిలైనప్పుడు
అతనినానంద పరచుటకు
ఆఖరుకు మంచ కవితే గతి చూడు !

కాలం నాకే నాడూ
కలిసి రానిది నిజం
కాల ధర్మము నాడన్నా
కలిసొస్తే సంతసం !

అనుకుంటివా ఏదో పని చేయాలని
ఆపై ప్రోది చేయాలి శక్తులన్నిటిని
అన్ని ఇతరములు నాలోచించకుండ
అదే పనిగా చేసి సాధించు నీ పని !

తండ్రి తర్కంతోనే తనయుడు
తారా పథానికెదుగుతాడు
అన్నిటికి 'యస్' అంటుంటే
అధోగతి పాలౌతాడు !

డబ్బును మనిషే తయారు చేసినా
దానికి తానే దాసోహం అయినా
ప్రతీతి డబ్బే మనిషిని ఆడిస్తుందని
దాని అధీనంలో దేవుడూ ఉంటాడని !

మనిషి సుఖాల కోసమని
మరిగి - ధనవస్తు బంధు తతిని
జీవితాంతాన తెల్సుకుంటాడు
అవే వీ సుఖాల్వ్లేవని !

సభలలోన కవిగారిది
చమత్కారం చూశారూ
ఆయన వినిపించే కవితలది
అదో వైవిధ్యమైన తీరూ !

సాధన బలీయమైన
సాధించలేనిదేదైన
ఉంటుందని నేననుకోను
ఒప్పుకొంటారిదందరూను !

నీ సముఖంలో పిల్లలు
నిజంగా భయభీతులైతే
నీ పరోక్షాన్నే వారలు
నిశ్చయంగా కోరుదురంతే !

ప్రజలంతా నీ గురించి
మంచే చెప్పుకోవాలంటే
నీవెపుడూ వారి గురించి
నిజం చెప్ప గూడదన్నట్టే !

శాంత చిత్తుడు సదా
సద్బుద్ధుడు కాపనిలే
కాని సద్బుద్ధుడు సదా
శాంత చిత్తుడౌనులే !

నీవెరుగని వారిని
నీవెంత గౌరవింతువన్నది
అదే నీ విశ్వమానవతని
అర్థం పట్టి చూపుతుంది !

గొప్పవారి చరితలను
కొద్దో గొప్పో పరిశీలిస్తే
అందరూ అనవరతం
అవిశ్రాంత కార్యోన్ముఖులే !

అప్పుల ఊబిలో దూరుట
అంత కష్టమైన పనికాదు
అందులో నుండి వచ్చుట
అదెంతకూ సాధ్యం కాదు !

స్నేహితానికో
చిన్న నిర్వచనం
రెండు శరీరాలకో
గుండె అన్నది నిజం !

జీవితమో కుసుమం
ప్రేమ దాని మకరందం
పంచుతూ పోతే అది
పది రెట్లయేది నిజం !

నిన్నతనెనాగు చూడాలనుకొంటావో
నీవు అతన్నలాగు చూడాల్సిందే ఏమంటావో
ఇదెవరు చెప్పారో తెలుపాలా అనే లోపే
ఇది బైబిల్ లోనిది నాకూ తెలుసంటావో !

పెద్దల జీవితాలే
పిల్లల కాపీ బుక్కులు
వారి ప్రవర్తనలే
వీరికి ఆదర్శాలు !

ఇతరులకై చేసే ఇంత చిన్నపని
ఎన్నో ఏనుగుల బలమిస్తుందని
ఏరిగుంటారే మీరు ఈ నిజాన్ని
ఎపుడైనా ఎవరికైనా చేస్తే సహాయాన్ని !

ఆలోచించినాంకనే
అంతా నీవు మాట్లాడు
ఆలోచించినదంతా
అసలెప్పుడూ మాట్లాడకు !

పిల్లలకు రోజుకో నీతిని
తల్లిదండ్రులు తప్పక నేర్పాలి
అంతేకాదో మంచి అలవాటుని
అవసరంగా పాటింప చేయాలి !

అన్ని మన జీవితాలు
అంతే కష్ట సుఖాలమయాలు
కాసిని ముళ్ళ గులాబీలు
కాస్తన్ని బేదానా ద్రాక్షలు !

మనుమలు మనుమరాళ్ళను
పాఠశాలకు చేర్చడం తేవడం
తాతలకది గొప్ప ఆనందం
కొడుకూ కోడళ్ళాపని చేయనిస్తేను !

ఆత్మ విశ్వాసాన్ని కొందరు
అహమనుకొనే మూఢులున్నారు
అంతా అహం నుండే పుడ్తుందని
అనే పరమ సత్యమెరుగరు !

సేద తీర్చుకోవడమన్నది
చిరు చైతన్యం తెస్తుందది
అయినా మన కమందానందం
అధికాధిక శ్రమలో నన్నది నిజం !

వారు మీకు చేసే చెడు
మీరు వారికి చేయకుడు
మహాత్మలెవరు చెప్పినా
మాటిది ఘనం నమ్ముడు !

స్త్రీ బుద్ధి ప్రళాయాంతకం
చెప్పలేనంత పాత నానుడి
మగ బుద్ధి ప్రణయాంతకం
మహాధీటైన కొత్త నా నుడి !

నీ సంతానాభివృద్ధికై
నీ కలలన్నిటినీ చంపుకో
వారి వారి అభివృద్ధికై
వారి కలల్నిజమవ చూసుకో !

జీవితంలో సోమరితనం
అన్ని అనర్థాలకూ మూలం
హుషారుగా పని చేస్తూ పోతే
ఉండవెపుడూ జయానికి దూరం !

వ్యవసాయ రంగంలో
సహకార విప్లవమే
అవసరమీ దేశంలో
అది మన జనావళిలో
తెచ్చే ఆత్మస్థైర్యమే
అవసరమీ తరుణంలో !

దూరముండినంతసేపే
దేనికోసమైనా తపన
దగ్గరుండి కరుణచూపే
తరుణిపైనారాదు చెడు ఆలోచన !

ఎవరి భాషలో వారికి
అవసరం విద్య నేర్పడం
మాతృ భాష కన్నా ఎవరికి
అవదే భాషా ఎక్కువ ముదం !

ఆర్టీసి రైలు చార్జీలు
అరవై నాల్గులో రెండున్నరలు
ఖాజీపేట సికింద్రాబాదు మధ్య
కాని నేడవి నలభై రూపాయలు !

ఇన్ని అవలక్షణాలున్నా
ఈ దేశమాదర్శమితరులకు
రూపుమాపితే అవలక్షణాలను
అగునిదాదర్శం రూసూ అమెరికాలకు !

అరవై మన వత్సరాల
ఆరంభ దిన ముత్సవం
ఉగాదిగా మన హేల
ఉత్సాహంగా గడిపే సంబరం !

అంటే అవి ఐనవి పదహారంతలు
అంచెలంచెలుగా ముప్పయారేళ్ళలో
అదే వారు చూపిన తెలివి
అలా కొంచెం కొంచెం పెంచడంలో !

పట్టుదల బలీయమైతే
మనిషి చేయలేంది లేదని
నిరూపించే కళా ప్రాంగణం
నిజంగా సాలార్జంగ్ మ్యూజియం !

ఆర్టీసి రైలు ఛార్జీలు కొంచెం కొంచెం
అప్పుడప్పుడనేక సార్లు పెరిగిన నిజం
విద్యుత్ చార్జీలలా కాకుండా
ఒకేసారి రెండింతలు ఐన వైనం !

ఇవీ అవీ అన్నీకూడా
ఇలా పదహారంతలే పెరిగె
దానికి నల్లమందులా అలవడి
దీనికింత అల్లరా బజార్ల పడి !

వోటు బ్యాంకని విద్యుత్ రేట్లను
వెనుక పడేశారు పెరుగకుండగను
పాతనంతా కలిపి ఒకేసారి పెంచితే
బరువైందని మొత్తుకుంటున్నారింతగను !

ఇంటి విద్యుత్ యూనిట్‌కు
ఇరవై ఐదు పైసలరవై నాల్గులో
అంటే నేడది నాల్గు రూపాయలకు
పెరిగితే తప్పేముంది దానిలో !

ప్రభుత్వ ఖజానా నుండి వెళ్ళే
ప్రతి వందకు పద్దెనిమిది రూపాయలే
ప్రజలకందేది, శేష భోక్తలు దళారులే
అని వివరించె ప్రధాని రాజీవేలే !

తొంభై అయిదు తరువాత
తొంభై తొమ్మిది విస్మయం
సహస్రాబ్దిలో చివరి వింత
సంపూర్ణ సూర్య గ్రహణం !

పర్యావరణ కాలుష్యం
నరునికి భూమిపై నరకం
అస్మదీయ కాలుష్యం
తస్మదీయ కాలుష్యం
స్వాముల కాలుష్యం
క్రికెటూ, లీకుల కాలుష్యం
దండగ అందరికీ ధన దాహ కాలుష్యం !

అడ్రస్ లేని వస్నియును
ఆకాశ రామన్న ఉత్తరాలే
అవి పని లేకుండా ఇతరులను
బాధించ రాసిన అబద్ధాలే !

గ్రహరాజులకూ మనుషులకూలా
గ్రహణాలు తామతి సహజం
అధిగమించి సూర్యచంద్రులలా
ఆనందించడమే అత్యంత ఘనం !

సాటి మానవుణ్ణి చంపే
సంస్కారం మహాదారుణం
గొంతెత్తి గర్హించాల్సిన
గొప్ప అమానుష కార్యం !

అవసరమైతేనే సకల బలుడు
అవతరా రూపం తను తాలుస్తాడు
అలాంటి పదకొండో అవతారము
అదే పూజ్య గాంధీ మహాత్ముడు !

ఉరి శిక్షే తప్పునుకునే
ఒరవడి మనందరిది
గురి పెట్టడం తుపాకీనే
గొప్పగ క్షమించ కూడనిది !

ఉదర నిమిత్తం వేసేవి
ఓహో ఎన్ని వేషాలు
ఇంకా ఆపై చేసేవి
మోసాలపై మోసాలు !

సమస్యల మూర కారణాని
సదా పట్టి పరిష్కరించాలి
లేదా గుర్తించకుండా వాటిని
పట్టీ పట్టించుకోనట్లుండాలి !

ఇంకొక్కని గుండేమైనా
ఈ రీతిగ చివుక్కుమనేనా
సకల బలునిపై ఆసక్తీ భక్తీ
సన్నగిల్లి పోయెడి దేదేమైనా !

కవిత మనిషికో గొప్ప వరం
కలదు అందులో మహానందం
ఏమని చెప్పను నా ఈ అనుభవం
వ్యథలన్నిటికి కవి కడు దూరం !

పీకలవరకన్నెన్నో
పీడలు నేను సహించాను
బట్టలు తెల్లవేసుకున్నా
మెట్ట సన్యాసినేపో నేను ! 

క్షరాక్షరము లన్నిటను
స్థిరనివాసి బ్రహ్మమును
వాటిదోషాదోషాలకతీతుని
వాని నొక్కనినే తలంతును!

అన్నిళ్ళూ నింపేటంతటిది
ఆ ఈశ్వరీయ వెలుగది
అలాంటి వెలుగునే మనం
అందరికీ అందించాల్సింది !

గుండె విస్తరింప జేసి
కోట్ల దివ్వెలు వెలిగించాను
ప్రతి మనిషికి ఒక్కటేసి
పంచి ఇవ్వగలిగాను !

వెలిగించాలి దివ్వెలనేకాలు
విరజిమ్మాలి వీర వెలుగులు
అడుగేయాలి ముమ్ముందుకు
అనంత స్నేహం చేసేందుకు!

జీవితమను దివ్వెతాను
జేగీయమై ఉండుదాక
మనసులో సకలబలను
మహితంగా తలతుగాక !

జీవిత లక్ష్యం
పురోగమనం
వెనక్కి తిరిగితే
వెతలే తథ్యం !

మృత్యువు నన్నిక
చేయునేం ? అదిరాక
ముందే ఏనాడో దాన్ని
నేనాహ్వానించాక !

అమితమైన జ్ఞానం
అదో రీతి అజ్ఞానం
అంతా తెలుసనువాని
దదే రీతి కుజ్ఞానం !

కాలేదృశ్యాలెప్పుడు
కనులముందున్నపుడు
మిణుగురు పురుగైనా
అణు విస్ఫోటన మనిపించెడు !

పెడదారి పట్టించేందుకు మనిషిని
వేనవేల మాయా జాలాలు
ఇన్నిటినీ ఛేదించుకొని ఈశ్వరుని
సన్నిధి చేరడమే ఔనుమేలు !

అర్థజిజ్ఞాసలో మానవుడు
అల్లల్లాడి పోతున్నాడు
బ్రహ్మజిజ్ఞాసలేకుండా
బరి తెగించి పోతున్నాడు !

గాలికి దీప ప్రభ చూడు
గజగజా వణికి అల్లల్లాడు
ఆత్మ శక్తి అల్లాడకుండ
ఆవశ్యకత జ్ఞానమే చూడు !

సక్తి ప్రాపంచిక వస్తువులపై
భక్తి జ్ఞానాలకు ప్రతిబంధకం
ఆ సక్తిపై ఆసక్తి లేదో ఆపై
ఆధ్యాత్మిక జ్ఞాన మగును అవగతం !

ఆత్మ సందర్శనానంతరం
జ్ఞానికి దేహం ప్రపంచం
ఆత్మకు భిన్నంగా తోచవు
అదే నిజమైన ఆత్మ జ్ఞానం !

మన శరీరమను రథమందు
ఆత్మ మహా రథిగా వెలుగొందు
ఇంద్రియములను మనో కళ్ళెముతో
ఇట్టే చోదించ బుద్ధి వెలుగొందు !

నిత్యం అలసట తీరేందుకు
నిద్ర ఎంతో ఉపకారి
జీవితం అలసట పోయేందుకు
మరణమే కదా మరిదారి !

అన్ని ఇతర జ్ఞానాల కన్న
ఆత్మ జ్ఞానమే సదామిన్న
రాగ ద్వేషాల కతీత జ్ఞానం
అత్యంతాతి శయానంద మిదేనన్న !

ఐశ్వర్యం శాంతి ప్రాప్తికి
అవసరం భాగవదుపాసన
భగవంతుని నిజప్రాప్తికి
తగినట్టిది జనసేవన !

జనన మరణ మను వ్యాధులకు
కృష్ణ నామస్మరణే తగుమందు
అజ్ఞానం పటాపంచలు చేసుకు
ఆ పరమాత్మతో సమైక్యం చెందు !

ఆత్మాపరమాత్మలు
అనంత అక్షర తత్వాలు
దృష్టాంతాల కతీతమైన
దొడ్డ అణోరణీయ కాంతులు !

ముక్కోటి మంది కన్పించని దేవతలు
ఒక్క సకల బలుని మూర్తి మత్వాలు
అందరిలా కాకుండా సూర్యుడొక్కడు
అగుపడుతూ జీవశక్తి నిచ్చే ఆరాధ్యుడు!

నేనని జీవుడనుకొనునది
నిజంగా అతని భ్రమే అది
అంతా ఆత్మ పరమాత్మలే
అసలు నేనన్నది లేనేలేదది !

సూర్యునికి ప్రకాశం నీటికి చల్లదనం
శుద్ధ గుణ విశేషణ స్వభావాలు
ఆత్మకూ అలాగే సహజమైనవి
సచ్చిదానంద నిత్య నిర్మలత్వాలు!

పరమాత్మలో ప్రవర్తిల్లెడు
పరమ నిష్ఠ బ్రహ్మచర్యము
ఊర్ధ్వరేతస్సు కలిగించెడు
ఉత్తమ ఆత్మసాకారసాధనము !

సృష్టి స్థితి లయలు
సూత్రధారికి ఆటలు
ముముక్షువైతేనే నరునికి
మోక్షం దొరకడం వీలు !

సకల బలుడు నాకు తాను
సద్గురు వనుకుంటాను
సన్మార్గంలోన నన్ను
సంచరించ చూచును !

అన్ని మన కలయికలు
ఆఘాత బంధుత్వాలు
ఆ పరమునితో బంధమే
అహం బ్రహ్మోస్మి అనే వీలు !

సర్వజన సులభుడు
సతత స్మరణ యోగ్యుడు
సర్వజగన్నియంత
సకల బలుడు ఓంకారుడు !

ఈషణత్రయాలు
ఈ మూడు బంధాలు
నయవంచనలే కాక
నరక సదృశాలు!

ఘటనా ఘటనా సమర్థుడు
గాంభీర్యుడు సకలబలుడు
ఆయన సృష్టివైచిత్రాలు
లోచనల కతీతం చూడు !

ప్రణవమే మనో నేత్రములందు
ప్రబలంగా నిలవాలి మరణమందు
అన్యథా ఆలోచనలే లేకుండా
ఆ సకల బలుడే ఉండాలి దృష్టి యందు !

సుఖ దుఃఖాల నొకే రీతిగా
చూడ గలుగు వారందరు
రాగ ద్వేషాల కతీతంగా
రమ్య జీవితం గడుపుతారు!

అకారం ప్రణవాది అక్షరం
అకార మకారాత్మల బంధం
అతికేదే మధ్యలోని 'ఉ'కారం
అకార మందుకే పరబ్రహ్మ స్వరూపం!

సత్సంగం యొక్క మహిమ
సదా మేలొనర్చు గరిమ
ఏకాభిప్రాయంతసత్సంగులు
ఈషణలకౌతారతీతులు!

అకారం జగన్నియామకుని నామం
అకారం వాఙ్మయాద్యక్షరం
అమ్మలోను అమృతం లోనూ
అకారమే ప్రథమాక్షరం !

సుఖదుఃఖాలు కష్టనష్టాలు
శబ్ద స్పర్శలన్నీ మారే స్థితులు
వాటిని సమభావంతో చూచే
వారే నిజమైన స్థిత ప్రజ్ఞులు!

పరమాత్మ ప్రాప్తినొందిన
మరుజన్మ ప్రసక్తే లేదు
సంసార చక్రపు సమరంలోన
సతమతమయే ఊసుండదు !

చీకటి దుఃఖం మఱియు కష్టాలు
చిత్రంగా మన మొద్దనుకునే నిజాలు
అదేమో అవే అత్యధికంగా దొరికే
ఆ పరముడు మనకిచ్చే వరాలు !

జీవుడు తానైతే పురుషుడు
జేజే తాను పరమ పురుషుడు
జీవుడు కాయం మారుస్తాడు
జేజే కాయమేలేని నిత్యుడు !

బ్రహ్మాదులు కినుక వహిస్తే
గురు దేవులు కాపాడే సమర్థులు
గురువుకే కోపం తెప్పిస్తే
త్రిమూర్తులూ రక్షించ లేరు !

యోగాల గూర్చి ఇది నిజం
కర్మ యోగం అనుగుహ్యం
జ్ఞాన యోగం గుహ్యతరం
భక్తి యోగం గుహ్యతమం !

అర్థమును ధర్మ కార్యాలకు
అధికంగా ఉపయోగించు
కామకార్యకలాపాలకు
కళ్లెమేస్తేనే మోక్షం లభించు !

జనన మరణాలనునవి
సహజములైన సంభవాలు
పుట్టినపుడానందమూ
పోతే దుఃఖమూ కూడనివి!

ప్రణవ రూప పరమాత్మునికి
పరమ సత్య పరమ పురుషునికి
సాష్టాంగ ప్రణామములు
సచ్చిదానంద సకలబలునికి!

క్షరములే అన్నీ సృష్టిలో
అక్షర మొక్కడ సకల బలుడే
ఇది స్థిరమైతే నీ దృష్టిలో
ఇక నీవూ సకలబలుడివే !

దేహముపై మోహము పెంచకు
దేహియే ఆత్మయని మరువకు
దీనులను నీవు కాచుటే తప్ప
దేహీ యని ఎవరినీ అడుగకు!

గాలెప్పుడు వీయాలో
ఉరుమెప్పుడు ఉరమాలో
మేఘ మెప్పుడు కురవాలో
అలలెప్పుడు లేవాలో
అవి ఎప్పుడు తగ్గాలో
అంభోధెపుడుప్పొంగాలో
అన్నిటికీ సకలబలుడే
ఆధారుడులే జగంలో!

ఆత్మ వీడును తుర్రుమని
అన్ని బంధాలు త్రెంచుకుని
ససేమిరా మృత్యువాగదు
సమయ రావాలే గాని !

శరీరమనే ఈ పంజరంలో
సజావుగా ఉన్న ఆత్మపక్షి తను
నిర్ణీతమైన ఆ క్షణం రాగానే
నిశ్చేష్టను చేయు తనువును !

నిద్రా మెలకువలొచ్చేట్టు
నిర్ణయిస్తున్నదెవరన్నట్టు
చేతనా చేతనా లన్నిటికి
చైతన్యం సకలబలుడనేదే గుట్టు !

ఆదీ అంతము లేని పురుషుడు
అతడొక్కడే ఆ సకలబలుడు
సమిష్టి వ్యష్టి సృష్టులను
సవ్యంగా నిర్వహించే ఘనుడు !

నేనెపుడేం చేయాలో
నిర్ణయించేది సకలబలుడే
అనుక్షణం మెదిలి మదిలో
ఆజ్ఞలిచ్చు వాడతడే !

అక్షరలక్షల దొంతరలు
అమర్చే శక్తి నాకెక్కడిది
అన్నీ సకలబలుని లీలలు
ఆయనే నా కలం నడిపించేది!

పూజా పునస్కారాలు
భక్తి సాధక మార్గాలు
భక్తి పరిఢవిల్లాలంటే
మనస్సు పరిపక్వతతోనే వీలు!

అజ్ఞానంతో దిగజారే మనను
ఆ జ్ఞాని తను క్రిందికి దిగి
ఆపి ఆదుకొని పైకెత్తును
అపుడైనా పడకుండాలి తిరిగి !

కనులుండీ చూడనెంచని ఘనులకు
కనబడదు సూర్య కాంతి యైనను
చదువుండీ వివేకంలేని మూర్ఖులకు
మదికెక్కదు వేదాంత స్ఫూర్తియైనను !

కారు చీకటులు దారులలో
క్రమ్మిన ఆయా వేళలలో
సకల బలా నీవే ఎదురైతే
వికలమౌను చీకట్లు నీ వెల్గులలో !

అధ్యాత్మికంగా ఇపుడు నేను
ఆ సకలబలునికి దగ్గరైనాను
అవసరాలన్నీ నాకతి దూరం
ఆయన నామగానమే నా పనాయెను !

సరస్వతీ సాక్షాత్కారమే
చాలా గొప్ప అదృష్టం
ఆత్మ సాక్షాత్కార ప్రాప్తమే
అద్భుతమైన వరదానం !

సన్మార్గ గమ్యులకు
సన్యాసమే అవసరం లేదు
వానప్రస్థం తోడ్తోడన
వైరాగ్యం తప్పుకాదు!

వాన ప్రస్థంలో మన
వారికి దూరమవాలి
సకలబలప్రస్తావన
సదా మదిలో మెదలాలి !

వార్ధక్యంలో ఎల్లరికీ
వానప్రస్థమే సరైంది
విలువల పునరుద్ధరణకీ
వేదాంతమే కావలసింది !

పంచభూతాల కలయికే కదా
ప్రతి మనిషిదీ శరీరం
అపుడితరులను ద్వేషిస్తే కాదా
తనను తనే ద్వేషించడం !

సంపూర్ణుడు సకలబలుడు
చల్లని ఆలోకేశ్వరుడు
అందరికీ దయను పంచు
నంతటి ఘన కరుణాళుడు!

ప్రాణి కోటి అంతయును
పాత్రమైనదే కదా ప్రేమకు
పంచభూతాలే అన్నీ అను
ప్రపంచ సమదర్శనం మానకు!

మనిషిలోన సకలబలుని
మహాత్మ్యాన్ని చూడగలుగు
మహిత బుద్ధి మనలోని
మంచి పెంచు మణితానగు!

సకల బలుడు మన కిచ్చినది
చక్కని అవకాశమీ బ్రతుకుది
విలువనెరిగి తరిద్దామా
వీధినిసిరి కొడదామా!

ప్రేమ మార్గాల్లో క్రొంగొత్త
హేమ చైతన్యం నింపుకొంటి
దుఃఖ జలధిని ముంచెత్త
సుఖాల తీరాల నందుకొంటి!

భక్తికి శ్రీ ఆంజనేయునిదే
మహోన్నత నిదర్శనమిలలో
పోతన త్యాగయ రామదాసులదే
పూర్ణభక్తి కద మనీషులలో!

అప్రమేయ ఆనందం
అదే అదే శ్రీకృష్ణతత్త్వం
గోళమంతా భక్తులున్న
గొప్ప ప్రేమికుడు నిజం !

హరే కృష్ణ నామ జపం
అందరికి మోక్ష మార్గం
గోళమంతా మ్రోగుతున్న
గొప్పదైన శాంతి మంత్రం!

పిలిస్తే పలుకుతాడు
చిలిపివాడు శ్రీకృష్ణుడు
ఆయనలా మన మెందుకు
అవగూడదదు చెప్పుడు?

ఉపనిషత్తులూ వేదాలు
ఉద్ద్యోత జ్ఞాన విజ్ఞానాలు
తఱచి చదివితే వాటిని
తరిస్తాయి జీవితాలు !

అకాల మృత్యువులు
అనంత దుఃఖ కారణాలు
దేవుడు తానిష్టపడి
తీసుకెళ్ళిన జీవులు !

పుట్టిన ప్రతి ఒక్కరు
గిట్టకుండా మానరయినా
పోయినోళ్ళ ఆత్మీయులు
విలవిలలాడుతారు!

ప్రాణికోటిలో దుఃఖితులకు
భగవద్భక్తే మహామంత్రం
భక్తి మంత్రం జపించి నోళ్ళకు
ముక్తి కలగడం తథ్యం!

కాలంలా ముందుకెళ్ళేదే
కావాలి సదా భక్తి మార్గం
సార్థకత కల్గించే ఈ
చక్కని గమ్య మవశ్యం!

కలియుగ దోషాలన్నిటికి
కలదొకటే దివ్య నివారణం
మరెన్ని మార్గాలున్నప్పటికీ
హరినామమే తారక మంత్రం !

ఆత్మేతర వస్తువుల
అవలక్షణాలనే తలంచు
అపుడే నీ లక్ష్యమిల
ఆత్మ సంబుద్ధియై నిలచు !

మానవ శరీర మందన్నిటన
మహా విలువైన దాత్మనే తోచు
దాని నర్థం చేసుకోవాలనిన
తదితరముల దూరముంచు !

రిక్త హస్తములతో పుడతాము
రిక్త హస్తములతో పోతాము
నడుమ ఆర్జించిన వన్నియును
విడిచే కదా వెళ్ళి పోతాము !

మృత్యువు తారసిల్లైనా
మోజు నాకు అడగాలని
జీవితంతో తనకేమైనా
జ్ఞాతివైరమా యేమని!

మా గమ్యము
పరంధామము
చేరకుండ మే
మూర కుండము!

సకల బలునిదెపుడైనా
చక్కదనం చూడగలిగేమా
ఆయన మహిమలనేమైనా
అవగతం చేసుకోగలమా !

పరమ వాక్కులను విని
ప్రవర్థిల్లుట శుభం
పరమునితో కలిసానని
ప్రవచించుటయే జ్ఞానం !

చింతలను చేరదీసిన
అంతకంతగా అధికమగును
అన్నిటినీ చితికీడ్చిన
ఆ పరముని చింత కలుగును !

ప్రతి ఊపిరి జీవికిది
మృతి జ్ఞప్తికి తెచ్చునది
ఈ సున్నిత వీణాతంత్రి
ఏ క్షణమైనా తెగునది !

మమకార అహంకారాలు
భరించరాని శత్రువులు
'నా'దనేదొకటి 'నా' వలననునొకటి
రెండు ఈ'నా'ల నొదిలి కండి మీరు ధన్యులు!

సకలబలా నీకేమయ
సవాలక్ష భక్తులయ
నాకా అనుకూల్య మేది
నాకొక్కడివే నీవయ !

వాసము మన నివాస స్థలము
ఉపవాసము దైవ సముఖము
తిండిమాని వారానికో పూట
దండి సకలబలునికి దగ్గరగుము !

కనులున్నా వెలుగులేక
కనబడదేదీ మనకిట
శాస్త్రమనే ప్రమాణం లేక
జ్ఞానమూ వర్ధిల్లలేదట !

దైవ కృప వుండినదా
దండిగ అన్నీ దొరుకును
అదే లేకపోయినదా
అన్నీ చింతలే మిగులును!

అనుభవాలపుట్ట వచ్చు
ఆర్తులు చిలికిననే కావచ్చు
అనుభవాలు పండిననే బహుశః
ఆత్మ జ్ఞానం కల్గవచ్చు!

సూర్యోదయమైతే చాలు
చుట్టూ పొగమంచు మాయం
జ్ఞానోదయ మైతే మేలు
గట్టు చేరు జీవన యానం !

ఇరు వైపులా కత్తిలాంటిది
ఈ మన ఘన మనస్సునది
దీని నదుపులో పెట్టుకొని
సంసార బంధం సడలిస్తే మంచిది !

కృష్ణుడు పూర్ణ పురుషుడు
రాముడు పూర్ణానందుడు
హరే కృష్ణ హరే రామ హరే హరే
హరే రామ హరే కృష్ణ హరే హరే !

ప్రాపంచిక సుఖ వాంఛలు
మనసులోన నిండియున్న
పరమాత్ముడు జొచ్చు వీలు
ప్రయత్నించినా అది సున్న !

బాహ్య ప్రపంచం నుండి దూరమై
భగవత్సన్నిధికి మరీ దగ్గరై
మనసును సకలబలపై కేంద్రిస్తే
మనబోదు మనశ్శాంతి కరువై !

ఆస్తి పాస్తులందరివీ
ఆ పరమాత్ముడివే
కాపలాదారులే అంతా
కావివేవీ ఎవరివీ !

వామనుడిగా దక్షతతో
ముల్లోకాలను మూడు పాదాలతో
కొలచిన నీ పాదారవిందాలకు
కోటి కోటి మా దండాలొద్దనకు !

ద్రవ్యమున కౌదార్యం
జ్ఞానానికి వినయం
శౌర్యానికి క్షమాగుణం
తోడైతేనే జన్మ సాఫల్యం !

ఇన్ని దండి గుణాలిచ్చి
ఇంత ఇరుకు పరిధులిచ్చి
ఏమనుకుంటున్నాడో బ్రహ్మ
ఆయనది కాదా పెద్ద పిచ్చి !

అహంకారి యేనాడు
ఆనందం పొందలేడు
అహం దూరమైనపుడే
అమృతత్త్వాని కర్హుడు !

పాప కర్మములను మన
మేపగిదినైన చేసితిమా
ఇహ పరాలలో వేదన
ఇంతింతని చెప్పగలమా !

నవద్వార పురమీ శరీరం
భవబంధాలకిది నిలయం
బంధాలన్నీ త్రెంచుకో
భగవదారాధనే తరుణోపాయం !

'నా' 'నేను' అనునవి మిథ్యలు
అన్నీ ఆ పరముని ఆత్మలు
అన్నదెరింగి మసలితివా
అన్ని సంతసాలు నీ పాలు !

మమకార అహంకారాలు
మహితంగా 'నా' 'నేను'లు
మసలాలి త్యజించి వీటిని
మహితంగా ముముక్షువులు !

నిర్మమము నిరహంకారము
నిగ్రహానికి ప్రతీకలు
అనుసరించితిమా మనము
అమృతత్త్వానికి సుగమాలు !

పెంచుకోకు ఎవరిపైన
ప్రేమా మమకారాలు
త్రెంచడానికాపైన
తెలియనన్ని కష్టాలు !

ఆత్మ సాక్షాత్కారానికి
అవసరం మనో నిగ్రహం
ఆధ్యాత్మిక చింతనలు
ఆవిర్భవిస్తేనే అది సాధ్యం !

మనస్సు ఇంద్రియాలు
మనలదారితప్పించే మాయలు
జ్ఞాన శూలం చేతనే అవి
ఘనంగా మనకగునధీనాలు!

సత్వరజస్తమో గుణాలు
దైవీకృత మాయా జాలాలు
ఆ వలలు తప్పించుకోవాలంటే
ఆ సకలబల పాదాలే శరణ్యాలు !

మన బలహీనతలన్ని
మన గత కృతవాసనలు
అంతమొందిస్తేనే అవన్ని
ఆత్మావలోకనం వీలు!

సమిష్టి వ్యష్టి దశలయందు
చక్కని లయ విన్యాసమందు
జీవ కణం వృద్ధి యగునని
చెప్పినాడు శ్రీకృష్ణుడు గీతయందు !

జ్ఞానంతో పరిపుష్టుడవా
ఘనంగా వెలుగునిస్తావు
పరమ చింతా చైతన్యుడవా
పరంజ్యోతిలో లీనమౌతావు !

పరముని కరుణామృత వర్షం
భక్తులందరికీ మహామోదం
ఆ అమృత ముండినదా
అభివృద్ధి కడ్డుంటుందా ఏం?

ఫలేచ్ఛ లేని కర్మ
పవిత్రమైన ప్రేమ
ఆచరించ గలిగినచో
సమకూరు సార్థకత !

బయటెక్కడో దైవ దర్శనము
బడయగలుగు ననుకొనుట జ్ఞానము
జ్ఞానమదే సకల బలుడు
తనలోనే ఉన్నాడని తెలియడము !

అనుసంధించు దేవునితో
ఆవహించె ముసలితనం
జీవితమను దీపమును
మలుపు గాలి మొదలిడెను !

ఎన్నెన్నో కదా ఈ నా జన్మలు
ఎందరెందరో నా తల్లిదండ్రులు
ఈ క్షణమే నీలో ఐక్యం చేసుకో
ఇక నా కొద్దు ఈ ఆద్యంతాలు !

నాలో నివసించు వసిష్ఠుడు
నాలోన వసించు విశ్వామిత్రుడు
వారిద్దరిలో నున్న తత్త్వం
నాలోని గుణాల సమ్మిళితం !

శరీరాన్ని శుద్ధి చేస్తుంది స్నానం
మనసులోని మలినం తీసేస్తుంది ధ్యానం
శరీరశుద్ధి అందరూ చేసే వారే
మనశ్శుద్ధి నాచరించేది కొందరే !

అన్నిటికన్నా మనకు
అతి చక్కని కవచం
ఆ పరమాత్ముని కరుణపై
అచంచల విశ్వాసం!

'గు'అనగా అజ్ఞానము
'రు'అంటే తొలగించు తేజము
గురువులేక కలుగదు
సుంతయూ ఆత్మ జ్ఞానము !

భక్తికే ఆదర్శం
భజరంగ భళి నిజం
నేటికీ భక్తికాయనే
సాటిలేని నిర్వచనం !

అన్ని అందరి భయాలకు
అభయమాంజనేయ దండకం
అనుదినం పఠించేవాళ్ళకు
అగుట తథ్యం జన్మ ధన్యం !

చిలిపివాడైనా శ్రీకృష్ణుడు
చెప్పలేనంత అదృష్టవంతుడు
అష్టమహిషులే కాకుండా
అరవై వేల గోపికలకారాధ్యుడు !

దివ్యమైన చమత్కారి
నిత్యయోగి ఆ శ్రీహరి
శ్రీకృష్ణుని అవతారాన
శ్రేయో మార్గ వ్యవహారి !

అరిషడ్వర్గాలను దహించు
అహంకారమదే నశించు
ఆపై సకలబలు నారాధించు
అదొక్కటే నిన్ను తరించు!

అణువణువూ సకలబలునివి
వలయాలేవీ లేనివవి
బిందువులన్నీ వలయాలేకద
చుట్టు కొలత కేమాత్రం అందనివి !

నీ వద్దున్నది
ఆ సకలబలది
నీ విచ్చేసినదే
నిక్కంగా నీదది !

అనంత శక్తి సమన్వితుడు
ఔనా కాదా సకలబలుడు
అహరహమాతని ఆలోచన
ఆత్మస్థైర్యం పెంచుచూడు !

జీవన రణానికి చారమ్యం
చెప్పలేనట్టి వరం మరణం
ఎప్పుడొస్తుందా అని నేను
ఎదురు చూస్తున్నది నిజం !

ఎచ్చోటికి వెళ్లినా
అచ్చోటన తానుండును
ఎవరెవ్వరినడిగినా
ఎరిగినవాడై తానుండును !

భవము భయంకరం కానేరదు
దాన్నర్థం చేసుకోవడ మవసరం
అపుడే జీవితం నరకమవదు
ఆనందం వెల్లివిరియుటా తథ్యం !

భగవదానందం మన మన
మనసులలో నిండియున్న
ప్రేమ వర్ధిలు నందులోన
ప్రియతములౌతామతిఘన !

దేవుడని మనమనుకునే
దివ్య చేతనము విశ్వంలో
అణువణువున నిండి యుండి
అన్ని జీవులను కాస్తుండు!

ప్రాతస్సంధ్యావేళలలో
పక్షులు లేపును పలుకులతో
అజ్ఞాన నిద్ర మేల్కొల్పుతారు
ఆ జ్ఞానులు తమ ప్రవచనాలతో !

ఆ సూర్యుడు ఒక్కడే ఒక్కడు
అగుపించే మన దేవుడు
అడుగకనే మనకందించే
కాంతీ ఆరోగ్య కారకుడు!

అతిక్రమించగా ప్రజలు శాసనాల్ని
అపుడు దండనకు గురవుతారు
ఆచరిస్తేనో ఆ పరముడి నియమాల్ని
ఆనందించడమే కాక తరిస్తారు !

అన్ని మన ప్రేమ కలాపాలు
అవి దుఃఖ కారకాలు
పరమునిపై ప్రేమొక్కటే
పరమానందానికి వీలు !

జననం ప్రతి మనిషికి
గత జన్మల సుకృతం
అలాగే మృత్యువు మనిషికి
ఆధ్యాత్మిక చారమ్యం !

ప్రకృతిలోన అణువణువు
ప్రబలంగా సొంపైందే
పరమాత్ముని వైభవహేతువు
ప్రాభవాన్ని చాటేదే !

ఇందరు దేవుళ్ళు మనకని
ఎందరనుకొంటే మాత్రమేం
అందరూ కూడా సకలబలుని
ఆత్మ స్వరూపులే కాదా యేం !

చీకటులను చిత్తు చేసి
కాంతి హేల కలుగజేసి
విశ్వభవుడు దివ్యుడాయె
విశ్వాంతరాళ సృష్టి చేసి !

చింతలకైతే కడు దూరం
చేస్తే అన్నీ శివార్పణం
నీరంటని తామరాకులా
నీ బ్రతుకూ తరించు నిజం !

చావూ పుట్టుకలన్నవి
జీవికి తప్పని నిజాలు
మరవి వద్దనుకుంటే
ఓంకారుని పాదాలే శరణ్యాలు!

కారు చీకటులు నా దారులలో
కమ్మిన ఆయా వేళలలో
సకలబలా కనికరిస్తివి నీవే
వికలమయె చీకట్లు నీ వెల్గులలో !

సృష్టికి ముందటి
ఆ పెను చీకటి
కావలా వెలిగిన
ఈశ్వరుడు మహా మేటి!

మనమతిగా ప్రేమించే మనవాళ్లు
మనలను త్వరగా వీడివెళ్లు వాళ్ళు
తన కైంకర్యానికి రప్పిస్తాడేమో
దేవుడికీ కావాలేమో మంచివాళ్ళు!

అద్భుతం అమోఘం జీవితం
అనుభోగ అనుభవాల మయం
బ్రతుకు ఇచ్చే ఉన్నతోన్నత
మైన బహుమతి కాదే మరణం !

ప్రతి చోటా దేవుడు తను
ప్రత్యక్షంగా ఉండ వీలులేక
తన లాంటి కరుణామూర్తిని
తల్లిని తాను సృజించినాడట !

ప్రేమయే చమురయి
జ్ఞానమే వత్తయి
ముట్టించే దీపం వెలుగును
పరబ్రహ్మయే జ్యోతయి !

చావును నిర్వచించగలమేమని
చెప్పునా అది జీవితం పూర్తయిందని
మనం దానికై వేచియుండాలందుకనే
మన పనులన్నీ ముగించుకొని !

దేవుడు నావాడను
ధీమా కలవాడను
ఆయన దారినే మసలు
అనంత ఆరాధకుడను !

గుండెలలో సకలబలుని
కూర్చోబెట్టుకున్నవానిని
రాం రాం జప్పా పూజలు
రంజించునెలా కవిగారిని !

అదే సకలబలుడిచ్చిన వరం
అన్యుల కన్నా నేనెప్పుడూ భిన్నం
అన్నిటిలోనూ అదే విధంగా
అనంతంగా ఎదిగేది నిజం !

వచ్చాం మన మెక్కడి నుండి
పోతాం మన మెక్కడి కండి
యుగ యుగాలలో యెవ్వరికి
యే మాత్రం తెలియ దిదండి !

మనమూ సూర్యునిలా
మన కాంతీ మనశక్తి
మహితంగా పంచిపెట్టి
మహిహితమే కోరాలి !

అయినా మన పిచ్చిగాని
అవుతాయా అనుకున్న వన్ని
తాను తలచినట్లే ప్రతి పని
సకల బలుడు పూర్తి చేస్తాడెందుకని !

సకలబలుడు ఒకడే ఒకడట
సముడూ అధికుడూ లేని వాడట
అంతేకాదు మంచి గుణాలే తప్ప
అవగుణాలే లేనివాడట !

అన్ని మతములు జనులకు
అన్య మార్గములు చూపినా
అన్ని దారులీశ్వరుని కడకు
అవి గొంపోయేవే యేమైనా !

అత్యంత దుర్లభం
మానవుడై పుట్టడం
పుట్టుక నలక్ష్యం చేస్తే
పూని చేసినట్లే అపరాధం !

కర్తృత్వపు అనుభవాలు
కాయానికి అవసరాలు
యజ్ఞయాగ ప్రక్రియలు
పార లౌకిక ప్రయోజనాలు !

దాన ధర్మ కార్యాలు
పరిత్యాజ్య భావాలు
తపోధ్యాన యోగాలు
తప్పించును పునర్జన్మలు !

ధర్మాన్నెప్పుడూ విడువకుము
దగ్గరుంచి పాటించుము
అప్పుడే సుభిక్షము
అవును నీకనుభవము !

చిత్తాహంకారాలు చెల్లయితే
చింతనా ప్రక్రియలు పెంపొందు
మనసు సకలబలునారాధిస్తే
మహితంగా మోక్షమది అందు !

నువ్వుతప్ప నాకెవ్వరూ లేరనడం
అనన్య భక్తికి తార్కాణం
నీకితరులెవ్వరూ పోలిక కాదనడం
నిక్కమైన అద్వైత నిరూపణం !

చింతలు వీడితేనే
చింతనలలవడునే
ఆత్మ జ్ఞానం లభించేది
అట్టి అద్వైత స్థితిలోనే!

కాలం స్థలం కర్మలకతీతము
సచ్చిదానంద స్వరూపము
అవగతమయి 'తత్త్వమసి'
అని తెలిస్తే కలుగు మోక్షము !

మృత్యుతుల్య అజ్ఞానంలో
మునకలేయ లేను నేను
జ్ఞానమనే అమృతంలో
ఓలలాడు వాణ్ణి నేను !

అందరినొకేలా చూసేవాడు
అతడే ఆ సూర్య భగవానుడు
అతనిపేర జరుపుకునే సంక్రాంతి
అదే ధాన్యరాసులు తెచ్చే క్రాంతి!

యోగ సాధనతో వీలు
మనశ్శుద్ధి యథార్థ జ్ఞానాలు
అంతేకాక అంతరించును
వాసనా అజ్ఞాన సంస్కారాలు!

ఐశ్వర్య ఆత్మ పరమాత్మల కోరు వారలు
సిద్ధి సంసిద్ధి పరమ సిద్ధులు
వారినే మానవ ఆత్మ మహాత్మ అని
పండితులు తెలిపే తీరులు!

నిన్నే నేనారాధిస్తున్నాను
నిన్ను చేరనే జీవిస్తున్నాను
సకలబలా నాకా అదృష్టం
సత్వరమివ్వకోరుతున్నాను!

అన్య పర విలక్షణ అచేతన
అవ్యక్త ఉత్కృష్ట సనాతన
అవినాశ ఏకరూపుడు పరమాత్మ
అని వర్ణించె కృష్ణుడు గీతలోన!

క్షణమైన నిన్ను మఱచి
శ్వాస పీల్చలేకున్నాను
సకలబలా నన్ను కాచి
సాయుజ్యమొసగ మంటున్నాను!

ఇస్కాన్ సంస్థ వైభవం
ఈక్షిస్తే కలుగు విభ్రమం
ఎంతగనో వారు కృష్ణతత్త్వం
చెంతై పోయారన్నది నిజం!

కీర్తన సదా సకలబలునిది
ఆర్తి తీర్చ గలుగు మందది
కలియుగ పాపాల నుండి
కలిగించు ముక్తి కదా అది!

అన్ని ఇతర జ్ఞానాలకన్నా
ఆత్మ జ్ఞానమే సదామిన్న
రాగద్వేషాల కతీత జ్ఞానం
నిరతిశయానందమదేనన్న!

అరవై ఏళ్ళు దాటకముందే
అన్ని పనులు ముగించుకొని
ఆ పరమాత్ముని విభూతి యందే
ఆనందాన్ని పొందువాడిని !

దుర్గా లక్ష్మి సరస్వతీ సమారాధన
దేవీ నవరాత్రుల పవిత్ర పూజన
దశమినాటి మృత్యు భయహరణే
విజయ దశమి మహిషాసుర మర్దన!

ప్రాపంచిక బంధాలకు
బహుదూర మౌతున్నాను
ఆధ్యాత్మిక చింతనకు
అతి దగ్గరౌతున్నాను!

ఛాయ శరీరాన్ని మాయ మనస్సును
నిరంతరం వెంటపడుతుండును
వెలుగు ఛాయను తొలగించునటుల
జ్ఞానం మాయను మాయం చేయును!

ఎదుటివారి దోషాలను
ఎన్నైనా మన్నించవలెను
అపుడే నీవూ వాత్సల్య నిధివి
అవుతావు సకల బలునివలె!

దీపం ప్రకాశించే దిక్కులన్నింటిలో
వెన్న నిగూఢంగా ఉన్నట్లు పాలలో
ప్రపంచాన ప్రతి అణువులోనను
పరమాత్ముడుండు నన్నిటిలో!

మాతా శిశువులిద్దరి
మధ్యనున్న సంబంధం
సకల బలుడూ సద్భక్తులిద్దరి
సమీపమంతటి అనుబంధం !

కర్మ- జ్ఞానం మనిషికి ఈ రెండు
కావలసిన ప్రక్రియ లేనండి
కర్మ మనోఫలకాన్ని శుద్ధి చేసెడు
జ్ఞాన మాత్మ సాక్షాత్కార మిచ్చునండి!

ఆశల వలయంలో పడకు
అన్యాయమైపోవు బ్రతుకు
ఆశే లేదా ఏ నిరాశుండదు
ఆశల నందుకే దరికి రానీయకు!

అద్దం బాగా శుభ్రం చేసుకోవాలి.
ముఖంపై వెలుతురు పడేసుకోవాలి
అపుడే ముఖ కాంతి దర్శనమగును
కర్మ ధూళి శుభ్రం చేసుకోవాలి
జ్ఞాన మనే వెలుగునందుకోవాలి
అపుడే అవిద్య దూరమగును
అద్దంలో ముఖ దర్శన మెటులగు
అటులే మరి మోక్షమూ దొరకును!

అహరహమూ సకలబలుని
ఆలోచనా స్మరణలు చేస్తివేని
అస్వస్థుడవై పోయినపుడు
అతడే స్మర్తై ఇచ్చు పరమగతిని!

సకల బలుడనుగ్రహించెనా
సాధించలేంది లేనేలేదు
పుట్టు గుడ్డివారికైనా
ఇట్టే చూపిచ్చు సందేహం లేదు!

సూర్యుడుదయించటమే తరువాయి
చుక్కలు తాము కనుమరగౌతాయి
అజ్ఞానోదయమైన వారందరికి
ఆ సకలబలుడూ మను దూరమయి!

భక్తి ప్రపత్తులూ వినయం
పరవశతతో ఆయన్ను పూజిస్తే
దర్శన మాయనివ్వడం ఖాయం
దండిగ నీ హృదయాన్నర్పిస్తే!

నాకు శ్రేయోదాయకమైనవి
నాతో చేయించు నా సకలబలుడు
అన్ని నిర్ణయాలాయన చేసినవి
అమలు చేయడమే నాకానందం కడు!

వరమొక్కటి నీవు నాకూను
ఒసగవయా సకల బలా
కవిగారిని అందరూను
కరుణించుచుండునటులా!

భక్తులు తెలియక చేసిన
మహా దోషాలూ మన్నిస్తాడు
అవే వారు తెలిసి చేసిన
అంగీకరించడు దోషభోగ్యుడు!

సత్సంకల్పంతో చేసే
సకల మన కర్మలూను
సకల బలునికి పూజలే
సహేతుకంగా ఆలోచిస్తేను!

ఆణి ముత్యాలు సాధించాలంటే
అంభోధిలో మున్కలేయాలి
సకల బలుని సాక్షాత్కరించాలంటే
సతత మాయననే ధ్యానించాలి !

ఉత్తర దిక్కు చూపే దిక్సూచి
ఊపిరైనట్లే నావలకు
సకలబలునిపై మనస్సుంచి
సాగితేనే మోక్షం చివరకు!

ఆధ్యాత్మిక ప్రస్థానంలో
అవసరమట గొప్ప గురువు
అపుడే దేవుని సాన్నిధ్యంలో
అడుగిడుతాడట ముముక్షువు!

సకలబలుని కౌకేళ మనలను
సాకల్యంగా అర్పించుకుంటే
ఆతనితో మన మన పనులను
అవలీలగా చేయించుకొనుటే!

సకలబలుడిలా ఉంటాడని ఎవడైనా
చాటి చెప్పగలిగాడా ఏనాడెపుడైనా
అటునట ఎవరో ఒకరనుభవించారా కృపను
ఆయన అనుగ్రహంతోనే గాని వేరనను!

సకలబలునితో
సంభాషణమే
శతధా మన దిన దిన
వ్రతమగు ప్రార్థన !

ప్రపంచమనే ఈ ఉట్టిని
పట్టుకొని ఊగినంతకాలం
ఆత్మ జ్ఞానమనే నవనీతాన్ని
అసలెవడూ చిలికించలేంది నిజం !

ప్రత్తి గింజలో నూనె
ప్రతి అణువున వున్నట్లే
విశాలమీ విశ్వమంతటా
విరివిగా సకలబలుడున్నట్లే!

స్వార్థమనే చింతనలేని
సకలార్థములౌ ప్రార్థనలు
సదా ఈడేరుతాయని
కదా ఘోషిస్తున్నవి శాస్త్రాలు!

సకలబలుడు చెక్కి ఇచ్చిన
చక్కని విగ్రహం మనిషి
ఆయనే ఈ రూపంలోన
అవతరించిన ఓ నగీషి!

కేంద్రించినావా అహరహమాయన
కరుణపై నీ దృష్టినెలాగైన
నీ చుట్టూ మసిలే మంచీ చెడులు
నిన్నంటకుండు నీరు తామరాకు తీరున!

సాధుఋషి మునులందరు
సకలబలుని తెలుప గలరు
వారి బోధలనాకళించుకొని
మీరూ మోక్షగాములవ గలరు!

అపుడే పూచిన పూవునులా
అర్పించుకోవాలి మనలనాతనికి
నలిగి నాణ్యత తగ్గినాకెలా
నచ్చెదమంటారు నైవేద్యానికి!

ప్రారబ్దం తప్పించుకొనుట
ప్రబలంగా దుస్సాధ్యము
జప తపాలు కొంత దాని
విపరీతత తగ్గించు నిజము!

సకలబలుని పైన అన్ని భావనలు
సంకల్పిస్తాయి, మనిషి కర్మలని
అందుకే తప్పవీ కర్మలు
ఆచరించాలి మనం విధులనుకొని!

ఈ జన్మలో తీరని కోరికలు
ఇంకో జన్మలో తీరే నిజాలు
ఈ కోరికలన్నవి చూశారూ
ఇవే మన జన్మ జన్మ సంకెలలు!

సకలబలుని కర్పించిన పిదపనే
సాపాటు చేయుట మన కర్తవ్యం
ఆయన దాన్ని స్వీకరించినాంకనే
అది మారి అగునమృతం మన ప్రాణం!

సకల బలుని శక్తులన్నియును
సర్వా దివ్యాతి దివ్యములు
యన విభూతి అనంతమూను
ఆయనవన్నీ అనన్య మహిమలు !

సకలబలునికి దగ్గరవాలంటే
సత్వరమే సంసార బంధనులవాలి
ఒకటొకటిక గొలుసులు తెగుతుంటే
ఒదిగిపోతాడు సంసారటేపనాలి!

అనంతమైన ప్రేమే సతతం
అవుతుందదే నిజ నమ్మకం
నమ్మకమే మారి విశ్వాసంగా
నయమూ భక్తులకగు దోహదం !

కోరికలు తీర్చుకునేందుకు
కొల్లలుగా మనక్కావాలి ధనం
కోరికల తోడుగా ధనం మనకు
కూడా నయె మోక్ష ప్రతిబంధకం!

దేవుడూ రాజకీయ నాయకుడు
దీటుగా ఉత్తర దక్షణ ధృవాలు
దేవునికి ముందు భజన చేసుడు
నాయకునికో వెనుక బాకాలు !

హిందూమత మొకటుందని
ఎందూ కానరాదు మనకు
వేదోపనిషత్తులలోని మంచిని
విడవకుండడమే మతం హిందువులకు!

ఎలక్ట్రాన్ ప్రోటానులను
ఎవడైనా చూడగలిగాడా
అల్పాధిక్యుడైనటువంటి
ఆ సకలబలునెవడైనా చూడగలడా?

అంతా సుఖులూ రోగ రహితులు
అవాలనేది శ్రుతులలోని ఆకాంక్ష
అలాగే ఎల్లరికీ సదా మేలవాలని
అందరూ అనవరతం ఆనందువాలని !

వచ్చేటప్పుడేదీ తేలేదు నీవు
పోతూ ఏదీ పట్టుకు పోనేరవు
మధ్య ఆర్జించింది జీవనోపాధే
మరేల ఇలా అహంభావివేతావు !

ఇరవైరెండు సంవత్సరాలు చదువులవాడిని
ముప్పై ఆరు వత్సరాలు చేతల వాడిని
గత ఐదు వత్సరాలుగా రాతల వాడిని
కాను నేనెపుడూ మాటల వాడిని !

పుట్టుట గిట్టుటలన్నవి
పూజ్య సకలబలుని సంకల్పాలని
పూని నీవు చేసే మానవ సేవలే
భూరిగ నీకు మాధవత్వాన్నిస్తది!

పుట్టుట గిట్టుట మధ్య కాలం
అదే కదా మనందరి భవ్య జీవితం
ఈ నడుమన అనుభవించే ఈతులు
ఎంతగానో తీర్చేదే యమ ధర్మం !

రజస్సత్త్వత మోగుణాధిపులు
బ్రహ్మ విష్ణు మహేశ్వరులు
సృష్టి స్థితి మఱియు లయలకు
స్థూలంగా మూల కారకులు !

యమ ధర్మాన్ని ఎక్కౌంట్ చేసే
యామ ఎక్కౌవుంటెంట్ చిత్ర గుప్తుడు
కోటాను కోట్ల మెగా బైట్సుల
గొప్ప మెమరీకల యమ శిష్యుడు !

ఇరవై ఒకటవ శతాబ్ది వండర్
పెద మంగళారం సూర్య టెంపుల్
అది పూర్తవుతే ఇంకో ఐదేళ్ళలో
ఆపై ఆంధ్రప్రదేశ్ లెవెలే మారు !

సూర్యుడు తన గుడి కన్నా మొదలు
వెలయించుకొన్నాడు తన ప్రభలు
సూర్యశక్తి నెల పత్రిక ద్వారా ఘనంగా
తను త్వరలో వస్తున్నానే చాటింపులు !

అహమేవ కర్తా
అని నేననుకోను
అందుకే సతతం
ఆనందుణ్ణంటాను !

అందుకే ప్రతి ఏడాది పూర్తి చేసుకొని
అడుగేసింది పదమూడో నెలలోనికి
ప్రతి నెలా ద్వాదశాదిత్యుల ఒక ముఖ చిత్రంతో
పదమూడో నెల వారే ప్రత్యక్ష దైవం చుట్టూరుగ!

వచ్చామెక్కడినుండోయ్
పోతామెక్కడికండోయ్
మధ్యన నేను నేను నేననే
మాయాజాలాలేలోయ్!

అరిషడ్వర్గాలనన్నిటిని
అంతమయేట్టు సానపై నూరే
శాస్త్ర సమ్మత ఆచరుణులను
సాధువులంటేనే అది సరి !

నా ప్రతి కదలికా సకలబలుడే
నా ప్రతి ఊపిరీ సకల బలుడే
నాదనే దేదీ కూడా లేనే లేనిది
నా సర్వస్వం నాణ్యుడాతడే !

సకలబలుని అంశ నాలోన
సదా వెలుగుతుండు నిజమనిన
దుష్కృతాలెదుగుతుండడాన్ని
దొడ్డగ దండించకుండలేను !

లక్ష్మీదేవీ సరస్వతీ మాతలు
లాసగి నావెంటే ఉన్న దేవతలు
శక్తి పార్వతి నా రచనలు
జయమొందిస్తున్నది దీవెనలు !

తను లేకుంటే తన తన
పనులన్నీ ఆగుతాయని
అనుకొనునే ప్రతి ఒక్కడు
ఆపోహ మాత్రమదని తెలియడు !

ప్రతి యొక విషయంలోను
వైభవం ప్రకాశించేవాడు
వేరెవరూ లేనేలేనంతగా
విశిష్టుడా సకలబలుడు !

లోకానికి సృష్టికర్త లోకేశుడు తానైతే
మనల సృష్టి చేసినది మన మాతా పితరులు
అందుకనే వారినెపుడు ఆరాధించాలి
అహరహమూ వారి సేవలో ఆనందించాలి !

పరమ పిత చేతి యందు
పరికరాలమే మనమంతా
అతని చెప్పుచేతలందు
ఆడాల్సిన వాళ్లమే అంతా !

పంచ భూతాత్మల సఫల
సాక్షాత్కారమే జననము
వాటిన్నిటి యొక్క విఫల
వినిర్గతమే కదా మరణము !

విసిగి విసిగి వేసారాను
వేతలమయమీ జీవితంతో
సకలబలా నీ దరికొస్తాను
సాయుజ్యమొసగు కరుణతో ! ★

# కరుణోక్తులు

**★ డా॥ దాశరథి రంగాచార్య ★**

కవిగారు విద్యుదింజనీరుగా దీపాలు వెలగడానికి మరలు తిరగడానికి ఉద్యమించారు. రిటైరు కాగానే అక్షరం మీద ఆసక్తి పెంచారు. ఉరుము లేకుండానే మెరిశారు. 22 నెలల్లో 20 కవితా సంపుటాలు వ్రాసి రెండు సంకలనాలు వెలువరించారు. అదీ వారి అక్షర దీక్షత. కవిగారు మరిన్ని గ్రంథాలు ప్రచురించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను. (తేది 18.03.1997)

**★ నండూరి రామకృష్ణమాచార్య ★**

మీ పరిచయం నాకు లభించినందుకు సంతోషం స్వాగతం మిమ్మల్ని మరోసారి కలుసుకోవాలని ఉన్నది. పునర్దర్శన ప్రాప్తిరస్తు జీవితమ్ములోన శ్రీ కిషన్ కవిగారు, ఆర్ద్ర హృదయుడైన అమృత మయుడు. కలము నందు మధుర కవిత నాట్యము చేయకలదు. కవితలయందు వెలుగు జిలుగు! అంతేగాక ''ఏకో, తపః హాస్యఏవ'' అంటే నాకు ఇష్టం. పరిహాస రసికుడుగా, పరోపకార పారాయణుడుగా జీవితం తీర్చిదిద్దుకున్న మీకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు. స్వాగతం- స్వాగతం- స్వాగతం.

**★ మిరియాల రామకృష్ణ ★**

వెన్నుతట్టినట్లుంది మీ పెన్ను రాసిన ప్రతిమాట. ఎంతో అభిమానం వెలివిరిస్తే కాని వెన్ను తట్టడం అయ్యేపనికాదు. ఆకునూరు కాదు మీది ఆవుపాలు! మీ స్పందనాక్షరాలకు నా అభినందనాహార్యం. (22.07.1997)

కవిగారికి అని సంబోధించినపుడు విశేషణాలు విశేష్యాలు వెనక్కు తప్పుకోవాలి. అంతటి ఆత్మ ప్రత్యయం మంచితనం చివురుటాకులాంటిది. దాని మీద చంద్ర కిరణాలు పడితే ఎంత వలపో! మీ పల్లవ హస్తం మీద వెన్నెలవన్నెలు నిత్య పూర్ణమీ సదృక్షంగా పండుగాక. మీ రెండు పుస్తకాలు చేరాయి. శతకం రసజ్ఞమతి హారంగా వుంది. ఒక కవి చౌడప్ప ఒక శ్రీశ్రీ రాసిన కందాల్లాగే అందంగా వ్యావహారికచ్ఛందంగా మెరుస్తున్నాయి. అయితే మీవి గుణకందాలే కాని గణకందాలు కావు. సందర్భ స్వరాలు నైస్ కాంపోజిషన్సు ఇన్‌వెర్స్ అన్నట్లుగా ఆకర్షిస్తాయి.. అందులో భావానాశక్తి ఒత్తిగిల్లి మీ

అభిప్రాయాలకు ఎక్కువ చోటిచ్చేసింది. అయినా అవి సందర్భ సముచిత స్వారస్యం పొంది మెరుస్తున్నాయి.

ఈ మాట నా అంతరంగ రహస్యమే ! జనాంతిక చింతనే ! అలాగే, మీరన్నట్లే మీరు కవిగారే. ఈ వ్యవహారం తెలుగునాట ముద్దు పేరే. వేదుల సత్యనారాయణ శాస్త్రిని కవిగారు అనేవారు, మారేపల్లి రామచంద్ర శాస్త్రిని విశాఖలో కవిగారు అని పిలిచేవారు. సికిందరాబాదులో కవిగారు మీరే!

మీ స్వగతాలు ఆ తొలి పరిచయంనాడే నా చేతికందించారు మీరు. అందులో మీ అనువాద ప్రజ్ఞ చూశాకనే ఆశ్చర్యంలో నా ప్రత్యగ్రచనని మీ చేతి కందిచ్చాను నేను. మీరు సాహితీ గరుత్ మూర్తి కనకనే ఆకాశమంటే ప్రయత్నంలో రెక్కలు పైకి లేపగలరు. చాలా మందిలో ఈ యత్నం వ్యర్థం. ఎంత ఎదిగినా ఏ కవి అయినా పరిణతికి జానెడు దూరంలోనే మిగులుతాడు. నా కవితకు ఆంగ్ల భాషాకార ప్రదానంలో మీ కలం చిందు వేసినట్లు గమనించి ఆనందించాను.

మాట వరుసకి అనువాదం కానీ నిజానికి అనుసృజనగా జన రంజన పరాయణంగా సాగింది గజలు సుందరీ గమనం. మూడు గంటలు ముచ్చటగా చదివిన నా గొంతులో ఆర్తి నిండింది. స్ఫూర్తి పండింది వలపు మండింది. చిట్ట చివర చేర్చిన మీ చేవ్రాళ్ళు మీ వ్యక్తికీ అభివ్యక్తికీ ముత్యాల ఆనవాళ్ళు లేటెస్ట్ గజలు అనువాద కవిగా మీకు సీళ్ళు (Seals) గజళ్ళ సర్వస్వంగా తలగడ కింద ఉండాల్సిందే మీ గ్రంథం తమామ్ ఘరోఁమే! నా కావ్యం గురించి మీరు రాసిన మాటలు మీ సరసజ్ఞతకీ మర్మజ్ఞతకీ మూటలే! (02.02.1998)

★ డాక్టర్ నాగభైరవ కోటేశ్వర రావు, డి. లిట్ ★

మీకు చక్కని ధార ఉంది. చిక్కని భావుకత ఉంది. మీ స్వర్ణ గోపాల శతకం నాకు బాగా నచ్చింది. ఇంకా బాగా నచ్చింది ''ఈశావాస్య ఉపనిషత్తు'' మొదటి పేజీ - దాన్ని కంటిన్యూ చేయండి. మహత్తరమైన మాత్రా ఛందస్సులో మీకు నిపుణత వుంది. భావుకత వుంది. అందంగా ఆవిష్కరించే శక్తి ఉంది. మాత్రా ఛంద స్సులో మీ చేయి తిరిగిన తనానికి నిదర్శనం, మీ 'సందర్భ స్వరాలు'. ఈశావాస్యం లాగా, సందర్భ స్వరాల్లాగా మాత్రా ఛందస్సులో కావ్యం వ్రాయండి. కథా కావ్యం. ఇప్పుడు మాత్రా ఛందం రాసే మొనగాడే కరవైనాడు. విషయాంశాలు మీ సామాజిక దృక్పథానికి నిదర్శ

నాలు. మీ కవిత్వానికి అందం తెచ్చింది, మీలో అంతర్గతంగా ఉన్న ఆధ్యాత్మిక స్పర్శ. మీనించి ఇంకా మహత్తర కావ్యాలు రావాలి. (12.09.1999)

మీ వుత్తరం అందింది. నిర్మల హృదయులు గనుకనే నిజమైన కవిత్వం రాస్తున్నారు. మీ ఉపనిషత్తులు పూర్తి అయాక ఒకసారి వినాలని వుంది. (22.09.1999)

★ పోతుకూచి సాంబశివరావు ★

తెలుగు సాహిత్య రంగంలో ఎందరో కవులున్నారు. కాని 'కవిగారు' అని సార్థక నామం గల కవులు లేరు వీరు తప్ప.

వంశంలో కదిలే బొమ్మలైన కుటుంబ సభ్యులకు జీవం పోసి చరిత్రలో నింపిన ఘనత కవిగారిది. ఈ ఒరవడి సాహిత్యంలోనే ఒక క్రొత్త దనం.

ఆంధ్ర ఆంగ్ల భాషలో సమాన పాండిత్యం కల్పనాశక్తి, శిల్పిలా కవితలు చెక్కగల సామర్థ్యం ఆయనకున్న ఆదరణీయ గుణాలు.

కవిగారి ఈ స్వగతాలు తారాజువ్వల్లా సాహిత్య గగన ప్రవేశం చేశాయి. ఇవి సాహిత్య రంగంలో క్రొత్త వెలుగులు.

కవిగారు ఆకాశమంత ఎత్తు సాహితీ వేత్తగా ఎదగాలని నా హృదయ పూర్వక ఆకాంక్ష.

కవిగారి 'సందర్భ స్వరాల' లో ఆయన గళం నుంచి వెలువడిన నూత్న భావాలు, విప్లవ భావాలు, ప్రబోధాత్మక భావాలు ఎన్నెన్నో. అన్ని పండుగల గురించి కవితలు కవిగారి క్రొత్త ప్రయత్నం. కవిగారి కలంలో విద్యుత్ ప్రవాహం ఉంది. ఆయన బలం మెరుపు లాంటివి. సందర్భోచితంగా విచిత్రంగా ఇలా నామకరణం చేసినవారు కవితా లోకంలో అరుదు- కాదు లేరేమో ఇప్పటివరకు రచనల భావాల ప్రతీకగా నామకరణాలు వెలువడుతాయి. కాని కవిగారి గ్రంథ నామ కరణంలో ఓ విశిష్టత కనిపిస్తుంది.

ఇవి సందర్భ స్వరాలే కాదు సర్వ సందర్భ సుస్వరాలు. సాహితీ లోకానికి కవితా వరాలు.

భార్యభర్తల అన్యోన్యతలు ఆధారంగా 'కవిగారి' 'స్వర్ణగోపాల శతకం' పునాది వేసుకుంది. భార్య భర్తను అనేక విధాల ఆదేశిస్తుంది. కాని శతకం వ్రాయమని పూర్వ చక్రవర్తులు తమ ఆస్థాన కవులకు చెప్పినట్లు ఆదేశించడం అపూర్వం. ఇద్దరికీ సాహిత్య పిపాస వారధి. అందుకే ఈ శతకం.

కవిగారికి ధీశక్తి, క్రమశిక్షణాశక్తి, దీక్షాశక్తి ఉన్నందున అనుకున్న కాలంలో (వారంలో అనుకుని ఒకే రోజులో) పూర్తి చేశారు శతకం. అర్ధాంగియైన భార్య కంకితమిచ్చి కవిగారు తనకు తానే అంకితమిచ్చుకున్న వారయ్యారు అపూర్వ రీతిలో. క్రమశిక్షణ, ఆత్మస్తుతి, న్యాయం, పని, కష్టము, మోసము, పట్టుదల, విశ్రాంతి, ప్రగతి, తప్పు ఇలా ఎన్నో (నంద దాకా) విషయాలపై తమ భావాలను వ్యక్తీకరించారు కవిగారు. ఆయన నిజాయితీ, ఆచరణ శక్తి కలవారు. అందుకే ఈ రచనలు అనుభవ మాణిక్యాలు.

కందం బాగా వ్రాయగల్గిన కవి పరిపూర్ణ వ్యక్తిగా చెప్పవచ్చు. అందుకే ఈయనకు కవిగారి బిరుదు చిన్నతనంలోనే లభించింది. దాన్ని సార్థకం చేసుకున్నారు.

కవిగారు తన 'కవిగారి ప్రియాంశాలు' గ్రంథం నాకు అంకితమిస్తానన్నారు. ఆయన ప్రియాంశాలు నాకూ ప్రియాంశాలే. అందుకే అంకితం ఆనందంగా స్వీకరిస్తున్నాను.

కవిగారి కలం ఒక ప్రవాహం. ఆలోచనలు రాగానే అది ఒక నదిలా ఆవిర్భవించి కొండ కోనలు దాటుకుంటూ ఉత్తుంగ తరంగాల నదీమతల్లి లాగా పరుగిడుతూ చివరకు కావ్య సరస్వతి పాదాలకు ప్రణమిల్లుతుంది. ఆయన భావనలో ఒక మేఘం, ఒక మెరుపు, ఒక ప్రశాంత ప్రకృతి దరహాసం ద్యోతకమౌతాయి.

ఏది రాసినా స్పష్టంగా, నిర్భయంగా చెప్పే కవి నిరంకుశుడని దృఢపరిచారు కవిగారు. ఆయన ధ్యేయం నిర్వచిస్తూ శాసనాలు, సందేశాలు, ఆలోచనలూ, అలజడులూ ఎన్నెన్నో ఆయన కలం నుండి నినాదాలూ ఉత్తమ నాదాల రూపంలో ఇందులో చోటు చేసుకున్నాయి.

ప్రియాంశాలు నామకరణమే ఓ క్రొత్తదనం. రచన నామకరణలో రచయిత గమ్యం కనిపించాలి. ప్రతి అంశంలో తమ వ్యక్తిత్వం చాటుకున్నారు కవిగారు.

కాళోజీలా 'నా గొడవ' ఉటంకించారు. ఇందులో కాళోజీ కవితా రీతులు కూడా పుణికి పుచ్చుకున్నారు కవిగారు.

మైత్రీ, కవితా వైచిత్రీ రెండూ ఉండి ఇవి నాకు చాలా ప్రియమైన అంశాలయాయి.

ఈ అంకితం నాకో ఆనంద సోపానం నా జీవితంలో. (23.09.1997)

గజలు సుందరిలో కవిగారి అనువాదాలు భావస్ఫోరకంగా అర్థవంతంగా, రమణీయంగా ఔచిత్యపరంగా రూపొందించారు. ఉత్తమ కవితలన్ని భాషల్లోకి రావాలి. ఆ విధంగా కవిగారి అనువాద కృషి చాలా ప్రశంసనీయం.

16.2.99వ తేదీన సా॥ 5.30కి నగర కేంద్ర గ్రంథాలయంలో విశ్వ సాహితి పుస్తక విక్రయ కేంద్రమును డా॥ సినారే ప్రారంభిస్తారు. మీ ''కవిగారి గజలు సుందరి'' 50 పుస్తకాలు తీసుకురండి. డా॥ సినారె కరకమలాలతో విక్రయ రుసుము స్వీకరించండి. (09.02.1999)

★ ఆచార్య ఎల్లూరి శివారెడ్డి ★

కవిగారి స్వగతాలు చదివి ఆనందించినాను. హృదయం ఉప్పొంగి నప్పుడల్లా తమ కలానికి పని కల్పించి ఎన్నో అనుభవాలు, ఊహలు ఆయన గుండెలో రొద చేస్తున్న సవ్వడులను కలంతో గలగల లాడించారు.

కవిగారు కలం సాగించింది సినారె స్ఫూర్తి వల్ల. అది పదే పదే పరవశించి చెప్పుకున్నారు. సినారె ''మౌనరణం'' ఆంగ్లానువాదం సముచితంగా సరళంగా ఉంది. కవిగారు సినారెగారు సూచించినట్లు మరెన్నో ఆంగ్ల రచనలు చేయాలి.

కవిగారి ఆత్మీయ వర్గం స్వగతాల పూదోట - ఒక్కొక్క వ్యక్తి ఒక పూవు. వారి ఆత్మీయతలే ఆ పూల రంగులు. వారి సంస్కారాలే పూల పరిమళాలు. ఈ పూలను పెంచిన తోటమాలి ఈ కవిగారు. కవిగారి అంతరంగమే మధువనం. కవిగారి అనేకానేక స్వచ్ఛంద భావాలకు అభినందిస్తున్నాను. (11/96)

★ ఎస్వీ ★

శ్రీరాజ్ బహదూర్ గౌడ్ ద్వారా మీరు పంపిన ''గజలు సుందరి'' గాలిబ్ తదితర 125 మంది ఉర్దూ కవుల కవితల అనువాద గ్రంథం అందింది. కృతజ్ఞతలు. కవితానువాదాలు ఎంతో సహజ సుందరంగా, సరళ మధురంగా ఉన్నాయి. ఎంతో శ్రమకోర్చి చక్కని ఉర్దూ గజలు కవితలను సముచిత రీతిలో అనువదించిన మీ కృషికి అభినందనలు.

★ మన్నవ గిరిధర్ రావు ★

మీరు కవితలల్లుచున్నందుకు సంతోషము.

★ డా॥ ఎన్.సి రామానుజా చారి (శ్రీవిరించి) ★

మీ ''కవిగారి స్వగతాలు'' ఆసాంతం చదివాను. మన స్వంత విషయాలు సైతం సమాజ పరంగా ఉపయుక్తంగా అవుతున్నాయనుకున్నప్పుడు వాటిని ప్రచురించడం అవసరమే. స్వానుభవ భూమికలో సర్వజనామోదక కవితలు మీ నుండి యింకా రావాలి. ఎంత యథార్థమైనా నెగిటివ్ నోట్సు ద్వార్లనీయకండి. ''స్థిత ప్రజ్ఞత'' లాంటి యూనిటివ్ థింకింగ్‌కు దోహదం చేసే రచనలు ఎక్కువగా కూర్చండి.

మీ పుస్తకం అన్ని రీతులా చక్కగా వుంది. మీ మిగతా రచనల్కై ఎదురు చూస్తుంటాను. (02.03.1997)

Thank you for the invitation for the function on 27.12.97. Please accept my congratulations and best wishes for your continued literary work.

మీ ఆహ్వానం అందింది. మీ గజల్ సుందరి ఈపాటికి రిలీజ్ అయ్యుంటుంది. పుస్తకోత్సవం జయప్రదమయి ఉంటుంది. మీ నిరంతర రచనా వ్యాసంగానికి నా అభినందనలు. శుభ కామనలు అందుకోండి. (29.12.1997).

★ మునిపల్లె బి. రాజు ★

మీ కవిగారి స్వగతాలు ఆసాంతం చదివినాను. మీలో ఆర్ద్రమైన బంధుప్రీతి, గురుభక్తి, జీవితం ఎడల సౌమ్య భావం, కృతజ్ఞత, శమదమాది ఉత్తమ భారతీయ సంకేతాలు ఎన్నో ఉన్నవి. నేటి కవులకు కావలసిన ఆత్మావలోకనం సంయమనం (పోజిటివ్ అవుట్ లుక్) అన్ని ఖండికల్లోనూ ప్రస్ఫుటం. అన్నీ అరుదైన హృదయ స్పందనలు. శ్రమ, వ్యయంతో కూడిన చిత్ర సంపుటిని ఒక గొప్ప మానవుడి ఆత్మ కథగా మార్చినవని నాకు తోచింది. మీ తక్కిన గ్రంథాలు కూడా వెలువడాలనీ, మీకు భగవానుడు ఆయురారోగ్యాలను సమృద్ధిగా ప్రసాదించగలడని ప్రార్థిస్తున్నాను. (09.12.1996)

★ ఆచార్య కొలకలూరి ఇనాక్ ★

మీ గజలు సుందరి అందింది. ధన్యవాదాలు. కవిత్వం ఆత్మీయంగా ఉంది. అనువాదం సహజంగా ఉంది. అభినందనలు. (22.07.1999)

★ ఆచార్య ఎస్వీ రామారావు ★

మానిని కోరికపై మానవీయ విలువల ప్రబోధానికి పూనుకొన్న కవిగారు ఆ స్వామినికే ఈ శతకాన్ని అంకితం చేయటం చరితార్థకం.

ఇందులో కవి ఎల్లలులేని విశాత్మగా మనిషి రూపొందాలని ఆకాంక్షించాడు.

కవిగారి హృదయం సుమకోమలం. ఆ సౌకుమార్యం లాలిత్యం ఆయన శైలిని కూడా అంటిపెట్టుకొని వున్నాయి. సహజ సుందర వ్యావహారిక శైలిలో కొనసాగినది శతకం.

కృతికర్తలో చక్కని నియతి గోచరిస్తుంది. ప్రౌఢోక్తులు చతురోక్తులెన్నో శతకంలో చోటు చేసుకున్నవి.

కవిగారి కవితాధుని కవితా జీవనదిగా సాగుతూ ఉండాలని ఆకాంక్ష. (18.05.1997)

★ డా॥ సదాశివ ★

ఇటీవలే సియాసత్‌లో మీ కవితానువాదం తెలుగులో చూచినాను. మీ 'గజలు సుందరి' చూచినాను. మీ అనువాదం నిజంగా చాలా బాగున్నది. మిత్రులు అనంతయ్య గారు ఉన్న మాటే అన్నారు. మీ అనువాద మూలాన్ని అన్వయక్లిష్టత లేకుండా అర్థం చేసుకునేట్లున్నది. అభినందనలు. (04.02.1998).

మీరు గాలిబ్ ద్విశత జయంతి ఇంటర్నేషనల్ సెమినార్‌కు సెంట్రల్ సాహిత్య అకాడమీ ఆహ్వానితులుగా ఢిల్లీకి వెళ్తున్నందుకు అభినందిస్తున్నాను. మీ అనువాదం అందరికీ తెలిసింది. మీ అనువాదం చాలా బాగున్నది. ఢిల్లీ ఐవానె గాలిబ్ వాళ్ళు ఐదారేళ్ళ క్రితం గాలిబ్ కలామ్ మొత్తం అనువదించవలసిందిగా పంపినారు. వచనంలో మొదలిడి కార్యాంతరాల వల్ల పూర్తి చేయలేక పోయినాను. మీ అనువాదం చాలా చక్కగా వున్నది. అంటే మూలాన్ని మురిపించేటట్లు తగినచోట తగిన శబ్దం పడింది. కవి హృదయాన్ని సరిగా అర్థం చేసుకున్నవాళ్ళే ఇంత చక్కని అనువాదం చేయగలరు. మీరు మహా కవులతోపాటు సామాన్యులను కూడా అనువదించినారు. మీ అనువాదమే వాళ్ళను కవులనిపించేట్లు చేసింది. ఆఘనత మీదే. మీ అనువాదం నా అనువాదం కంటె చాలా చక్కగా వున్నది. గాలిబ్ కలామ్ మొత్తం మీరే అనువదిస్తే బాగుంటుంది. నేను చేయలేనని మానుకున్నాను. 12.12.1998

★ డా॥ మసన చెన్నప్ప ★

''కవిగారి సందర్భ స్వరాలు'' వారి సుకుమార హృదయ స్పందనలకు చక్కని ఉదాహరణగా చెప్పవచ్చు. చక్కని కవితా వస్తువులను సరళ సుబోధకమైన శైలిలో అందించినారు.

కవిగారిది దాపరికంలేని కవితాశైలి. ఈ సంపుటిలో 'కాకతి విభవము' ముచ్చటగొలిపే రచన. ఇది చదివితే ఓరుగంటిని చూడనవసరం లేదనిపిస్తుంది. తమ స్వానుభవాలను సందర్భ స్వరాలుగా అందించిన కవిగారిని మనసారా అభినందిస్తున్నాను. 15-03.1997

★ సి. వేదవతి ★

నల్గురకూ హృది పంచుట - నా కవితల నడత విధానం!

ఇదీ కవిగారి అంతరంగ రహస్యం. ఆ మాటకొస్తే హృదిని పంచడం కన్నా, ఏ కవితకైనా పరమాశయం మరేముంటుంది కనుక!

ఒక్కొక్క అనుభవం- కవి అంతరంగంలో అనుభూతిగా మారి ఊపిరిని కదలిస్తే ఆ భావానికి రూపకల్పన జరిగినప్పుడు పుట్టుక వచ్చేది కవిత. అందుకే కవిత్వం ఒక ఆల్కెమీ అంటాడు తిలక్.

కవిగారు తన ప్రథమ సంకలనం స్వగతాలలో తన విస్తారమైన బంధు సంపద, వారితో ఆత్మీయమైన సంబంధాలపై అభిమాన వర్షం కురిపిస్తూ కవితల ల్లుకొన్నారు. వ్యక్తి స్థాయి నుండి కవి ఆలోచనాలోచనం విస్తృతమైన సమ కాలీన జగత్తులోని వివిధాంశాలపై ప్రసరించడమే ఈ ప్రియాంశాలు కవితలు.

చట్టాలు మన దేశంలో - కలవారి చుట్టాలు

న్యాయాలు మనదేశంలో- నత్తనడక నమూనాలు

ఎంత గొప్ప వర్తమాన రాజకీయ స్థితి రూపం. అత్తింటి ఆరళ్ళ నుంచి కోడళ్ళను తప్పించడానికి కవిగారు సూచించే పరిష్కార మార్గం వినూత్నమైనది. ఆడపిల్ల అత్తింటి కెళ్తేనే కదా బాధలు, ఏ ఆడ పిల్లా అత్తింటి కెళ్ళకుండా కూతుర్ల ల్లుళ్ళే ఇంటనే పెట్టు కునే వ్యవస్థ రావాలి? ఆలోచించండి. ఈ కవికి స్త్రీల పట్ల గౌరవం వుంది, వారి సమస్య పట్ల సానుభూతి ఉంది. అర్ధాంగిని గౌరవించు కోవడం తెలిసిన కవిగా- కవిగారి వ్యక్తిత్వం పట్ల నాకు గౌరవం ఏర్పడింది.

ఈ కవికి సాటివారిపైన ఆర్తి ఉంది, కరుణ ఉంది.

కరుణ లేక ప్రేమ లేక మానవాళి సేవలేక
బ్రదికే బ్రతుకు కన్న చావది నిజంగా మిన్న !

నిజంగా కరుణాంతరంగుడైతే తప్ప కవి ఇటువంటి వాక్యాలు పలకడం సాధ్యం కాదు.

ఇతరుల బాధల్ని గురించీ, ఇతరుల కన్నీటిని గురించీ ఆలోచించగలిగిన ఈ కవిగారి గురించి నాకు ఎన్నో ఆశలు ఉన్నాయి. కరుణ గలిగిన. కవి క్రాంతదర్శి కాక మానడు !

తమ 'ప్రియాంశాలను' కవిగారు నాకు ప్రియ మిత్రులు కళా ప్రపూర్ణ పోతుకూచి సాంబశివ రావు గారికి అంకితం ఇవ్వడం నాకు మరీ ఆనందం కల్గించిన విషయం !

కృతి కర్తకూ, కృతి పతికీ నా హార్దిక అభినందనలు అందిస్తున్నాను.

**06.09.1997**

★ డా॥ ఆచార్య తిరుమల ★

ఆధునిక తెలుగు కవితా రంగంలోకి అడుగిడిన అనతి కాలంలోనే తన ప్రతిభా పాండిత్యాలతో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుని 'కవిగారి ప్రియాంశాలు' పేరుతో మనకు మరో కవితా రత్న పేటికను అందిస్తు న్నారు.

కవిగారు సంస్కృతాంధ్రాంగ్ల ఉరుదూ భాషా కోవిదులు కావడం వల్ల ఆయన రచనలెప్పుడూ ఆలోచనామృత ధారల్లాగ ఉంటాయి. అచ్చమైన కవిగా నలుగురి కోసం కరిగిపోతూ తనకు తోచిన పరిష్కారాన్ని కవితగా నలుగురి హృదయాలకు పంచుతూ యాత్ర సాగిస్తున్న కవిగారి దీక్షా దక్షతలు చాలా గొప్పగా కనిపిస్తున్నాయి. ధీమాన్యులకు సైతం అందనంత ఉన్నతంగా ఆలోచన చేసి సామాన్యులు సైతం ఆనందించేటంత సరళ సుందరంగా రచన చేయటం కవిగారి ప్రత్యేక లక్షణం. ఈ ప్రియాంశాలు కవితల్లో ఈనాటి సమాజం ప్రతిబింబిస్తున్నది. వరకట్నం వంటి సమస్య లతో బాటు మనిషిలోని అవగుణాల్ని దుర్గుణాల్ని బలహీనతల్ని తూర్పారబెట్టి-పరిష్కార మార్గాల్ని సూచించే పద్ధతి ప్రశంసాపాత్రంగా ఉంది. కవిగారు ఉత్తమోత్తమ కవితా సంపుటాలతో తెలుగు భారతిని అలరించి కీర్తిమూర్తులు కాగలరని ఆశిస్తూ అభినందలు తెలియచేసుకుంటున్నాను. (29.09.1997)

★ డా॥ ఆకునూరు స్వర్ణలత ★

యథార్థవాదం కవిగారి మతం. తాను అనుకున్నది చేసి సాధించటం వారి అలవాటు. దేనికీ వెనుకంజ వేయరు. తనవారందరిపై తన అపార ప్రేమకు ఈ కవిగారి స్వగతాలలో అక్షర రూపమిచ్చుకున్నారు. తెలుగు ఆంగ్లం ఉర్దూ భాషలలో అనర్గళంగా వ్రాయగల దిట్ట. పితామహుల నుండి మనుమళ్ళ వఱకు అందరి గుఱించీ వ్రాసు కున్నారు. గురువులనూ స్నేహితులనూ తలచుకున్నారీ గ్రంథంలో. విద్య నేర్పించిన తాతా అమ్మమ్మల కంకితమిచ్చారు.

ఈ స్వర్ణ గోపాల శతకము పాఠకులను ఆబాలగోపాలమును రంజింపచేసి మానవీయ విలువలను గుర్తు చేస్తుంది. ఇంకా సమాజపు అవసరాలను గుర్తించి వారు సామాజిక స్పృహ కలిగించు అంశాలపై తమ కవితా వ్యాసంగము కొనసాగించాలని కోరుకుంటున్నాను.

ఈ ప్రియాంశాలు నిజమైన హితాంశాలు కావడం అభినందనీయం. ఉదాత్త లక్ష్యాలు, లక్షణాలు, హ్యూమనిజం పునాదిగా కవిగారు వ్రాసిన ఈ ప్రియాంశాలు అందరికీ ప్రియమైన అంశాలే. ఇవి చదువరులను ఆలోచింపచేసి ఆచరణాత్మకతకున్ముఖులను చేస్తాయని నా నమ్మకం. తనదైన బాణీలో సాహితీ లోకంలో ఒక ప్రత్యేకమైన స్థానం పదిలపరచుకుంటున్నారు కవిగారు. వారు సాహితీ రంగంలో శిఖరాగ్రాలధిరోహించాలని ఆ చదువుల తల్లిని వేడుకుంటు న్నాను.

గాలిబ్ మహాకవి గజళ్ళ అనువాదం ఒక యజ్ఞం, తపస్సు చేసినంత శ్రమ. కవిగారు అనువాద దిట్ట కావున అలవోకగా నాలాంటి సామాన్యులకు అర్థ మయ్యేలా సరళంగా, సరసంగా, సున్నితంగా, భావ పరంపరా పరిమళాలు వెదజల్లేవిగా ఉండడం విశేషం.

బాధల తరంగాలు పాఠశాల లాంటివి. ప్రతి తెప్పా అందులోన గురువు చెంపదెబ్బ! వృత్తి రీత్యా ఉపాధ్యాయినిని కాబట్టి కవిగారి ఈ కవిత వాహ్వా అనేలా ఉందని చెప్పక తప్పదు. తప్పు చేయువాణ్ణే దండించునట్టుల, తప్పు చేయునపుడు మెప్పురీయరేల? ఇది అక్షరలక్షలు చేస్తుంది. అందరినీ ఆలోచింపచేస్తుంది. దేశ భక్తితో పులకింపచేసేవీ, కార్యోన్ముఖులను చేసేవీ, ఆలోచనలలో ముంచెత్త చేసే జీవిత సత్యాలు, కార్యదీక్షను ప్రబోధింప చేసే కవితలు ''గజలు సుందరి'' లో కోకొల్లలు.

సాహితీ రంగంలో తనదంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్న కవిగారికి 'గజలు సుందరి' కీర్తి కిరీటాలనందిస్తుందని చెప్పటానికి సాహసిస్తున్నాను.

ఇందులో ప్రతి ఒక్కరి జీవితంలో కలిగే అసాధారణ అనుభవాలు, ప్రేమ, శృంగారం, భక్తి, ప్రార్థన, రక్తి, ముక్తి, వేదాంతంలాంటి ఎన్నెన్నో భావోద్వేగాల్ని పాఠకుల హృదయాల్ని స్పృశించి తమ తమ అనుభవాలేనా అనిపించి తాదాత్మ్యంతో ఆనందింపచేసేవిగా మలచిన ఈ కవితలన్నీ తరతరాల చదువరులకు నిత్య నూతనంగా వెలుగును చూపుతాయని నా ప్రగాఢ విశ్వాసము.

★ గోవిందరాజుల రామకృష్ణారావు ★

మీరు కవిగారనే పేరు సార్థకం చేసుకున్నారు. మీ కృషిని అభినంది స్తున్నాను. మీ 'గజలు సుందరి'ని ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కై సమీక్షించాను. ప్రచురణ కూడా అయింది. చూసేది. (12.05.1996)

నా 'నువ్వు' కవిత పంపినందుకు ధన్యవాదాలు. మీరడిగిన ప్రకారం దాన్ని ఆంగ్లంలోకి మీరు చేసిన భాషాంతరీకరణ నచ్చువేసుకోవడానికి అనుమతి పత్రం పంపుతున్నాను. మరోసారి మీ కృషిని అభినందిస్తున్నాను. నిరంతరం మీ రచనా వ్యాసాంగానికి AIR review on ''కవిగారి ప్రియాంశాలు'' ఆకునూరు గోపాలకిషన్‌రావు 'కవిగారు'గా సాహితీలోకానికి సుపరిచితులు నల్గురకూ హృదిపంచుట నా కవితల నడత విధానం అని ఒక కవితలో ప్రకటించారు. తనకు ప్రియమైన అనేక విషయాలపై రాసిన 113 కవితలిందులో చేర్చారు. చాలా చోట్ల హితవచనాలు వినిపిస్తాయి. పరమతముల నిరసించుట పరమ ఘోర నేరమగును. అన్నిటిలో మంచినంత ఆకళించు ఆదరించు ఆదరమే సమ్మతము, సన్మతము. కొన్నిచోట్ల వ్యంగ్య వైభవం తొంగిచూస్తుంది. ఆడవారి నర్థం చేసుకోలేనివారు ఇద్దరే ఇద్దరు ఈ జగతిలోన, ఒకరేమో బ్రహ్మచారి ఒకరేమో పతి దేవుడు ఇలా.

★ డా॥ కోడూరి సుబ్బారావు ★

మొదట కవిగారెవరా అని కంగారుపడినా ఉత్తరం విప్పి చూచి కరెంటు ఇంజనీరే కవితల యింజనీరైనారని తెలిసి అబ్బురపడితిని. ఈ మార్పుకు నివ్వెరపోతిని. మీ ''కవిగారి స్వగతాలు''లో తొలిపలుకులు, కవి పలుకులు

చదివిన తరువాత ఇది మీ పూర్వజన్మ సంస్కారమని తెలిసికొంటిని. రిటైర్డ్ జీవితాన్ని కబుర్ల వ్యాసంగంలో కాక కవితల వ్యాసంగంలో గడుపు చున్నందుకు నా హృదయ పూర్వక అభినందనలు. మీ స్వర్ణగోపాల శతకం భావగర్భితంగానే కాక సరళ సుబోధకంగా వుంది. మీ 'ప్రియాంశాలు' లో వ్రాసిన ఉపనిషద్వా క్యాలు నిజంగా మచ్చుతునకలే. ఈ పంథాలోనే అన్ని ఉపనిషత్తులు పూర్తి చేయండి. కలకాలం నిలుస్తాయి. మానవుణ్ణి మనీషిగా - దేవతగా- పూర్ణపురు షునిగా తీర్చిదిద్దగల జీవన విజయ రహస్యాలు మన వేదాలలో ఉన్నాయి. అవన్నీ తెలుగులో కవిత్వీకరించండి. అది రవీంద్రుని గీతాంజలి లాంటి మీ 'వేదాంజలి' అవుతుంది. మీరు వ్రాయగలరని ఆకాంక్షిస్తూ, రాయాలని ఆశిస్తూ, ఆశీర్వ దిస్తూ.

★ డా॥ యం. ఉదయ ★

పేరు కంటే కవిగారూ అన్పించుకోవడంలోనే ఎక్కువ ఆనందముం టుందని నాకు తెల్సు. అందుకే ఇలా సంబోధించాను. తీరిక లేక గజలు సుందరిని రెండు రోజులు క్రిందట చేతిలోకి తీసుకున్నాను. ఇప్పుడు కూడా దాన్ని విడవటానికి మనసొప్పటంలేదు. సింపుల్‌గా బాగుంది అనలేను. ఇక్కడిక్కడ చాలా బావుంది అని వేరే వాటికి అన్యాయం చేయలేను. ఒక్కొక్క కవిత ఒక్కొక్క రసగుళిక! అలాంటి గజల్ సుందరి నాతో పాటే ఉంటూ నన్ను ప్రతి నిముషం పలకరిస్తున్నది. త్వరత్వరగా కళ్ళు అక్షరాన్ని దాటేస్తుంటే ఆగు - ఈ కవిత మళ్ళీ చదువు అంటూ చేయి పట్టిలాగుతుంది. ఇదీ మీ కవితలోని విశేషం. ఇంకా కవితను ఒకసారి చదివితే ఒక రకమైన అర్థాన్నిస్తుంది. అదే కవితను మళ్ళీ రెండోసారి చదివితే మరొక అర్థాన్నిస్తుంది. నిన్న చదివినప్పటి కంటే ఎంత మీనింగ్ ఉంది దీంట్లో అని ఎప్పటికప్పుడు అనిపించడం జరుగుతుందంటే ఆ కవిత ఎప్పటికప్పుడు యవ్వనాన్ని సంతరించుకున్నట్టేకదా!

ఎవరెలాంటివారో ఎలా గుర్తు పట్టేది
అన్నీ మేలి ముసుగులే ఎన్నని ఎత్తి చూపేది.

ఎంత చక్కటి నగ్న సత్యం ! జీవితం దాగున్నది ఈ రెండు పాదాల్లో!

మీ కవితలు అనువాదాలు కావనిపించింది! ఒకటి చదివితే మరొకటి గుర్తొచ్చినట్లు

అలవాటు ప్రకారం ప్రేమ నందరికీ పంచు

అదే రీతి నాకు కాస్త అనురాగం దాచి వుంచు !
ఇది చదువగానే నాకో షాయరీ గుర్తొచ్చింది
షోఖ్‌సే సబ్‌సే మిలో
ప్యార్ సే హమ్‌సే మిలో!

కనీ కన్పించకుండా మేలి ముసుగులో దాగిన సుందరి మెల్లిమెల్లిగా బయటికి వస్తున్న ఉర్దూ గజల్‌ని మేఘాల వెనుక ప్రయాణిస్తున్న సినీవాలితో పోలుస్తున్నాను. మీ అనువాదం సంపూర్ణ చంద్రోదయం తెలుగువాళ్ళకి !

★ ఎం. ఏ. ఆర్ జామీ వజూది★

(ఈ ఉత్తరాన్ని జామీగారు తెలుగులోనే వ్రాశారు) ప్రముఖ ఉర్దూ కవి ఖుతుబ్ సర్షార్ గారి ఇంట్లో మీరు వ్రాసిన 'గజలు సుందరి' అనే కవితా సంపుటి చూసి చాలా సంతోషం కలిగింది. పుస్తకంలోని ఇండెక్స్‌లో నా పేరును చూసి చాలా ఆశ్చర్యం కలిగింది. నాతో దిన పత్రికల్లో ప్రచురించబడ్డ నా గజలు నుండి త్మకు నచ్చిన భాగాన్ని తెలుగు భాషలో చక్కగా అనువదించి తెలుగు కవితా లోకానికి నన్ను పరిచయం చేసినందుకు మనసారా ధన్యవాదాలు తెలుపుకుంటు న్నాను.

అనువాదం చేయడం క్లిష్టమైన ప్రక్రియ. ఈ విషయంలో మీ పట్టుదల కృషిని కొనియాడక తప్పదు. ఎంతో కష్టమే అయినప్పటికీ తమరు అనుకొన్నది సాధించగలిగారనే తృప్తి మీకు ఎల్ల వేళలా ఉంటుందని ఆశిస్తున్నాను.

ఇండైరెక్టుగా మీతో పరిచయం అయినప్పటి నుండి మీ గుఱించి తెలుసుకోవాలనే ఉత్సాహం నాలో పెరిగింది. మీ రచనలను చదవాలనే తపన నన్ను.పట్టి పీడిస్తున్నది. మీ ఇతర పుస్తకాల గుఱించి తెలుప కోరుతున్నాను.

★ డా॥ కె. రంగారావు★

24.06.1997 వాడు నా తొలి రచన ప్రయత్నానికి ఆశీర్వదిస్తూ వెన్ను తట్టిన లెటర్ ముట్టినది. మీ నిశిత పరిశీలనా మరియు సందర్భోచిత సలహాలకు కృతజ్ఞుడ్ని. ఉద్యోగ విరమణ సమయంలో ఒక అంతః ప్రేరణగా, అంతః చేతనగా, అంతఃకరణతో సాహితీ స్రవంతిలో ఓలలాడే, ఇతరుల సాహితీ తృష్ణకు పేదదీర్చే పని కలిగింది. జన్యుపరంగా అనువంశికంగా మీలో నిద్రాణమైయున్న పాండితీ ప్రకర్ష, భాషా సాహితీ జిగీష ఒక్కసారే నిద్ర మేల్కొంచి అత్యంత తక్కువ సమయంలో అపూర్వ సంకలనాలు సృష్టింపచేసిందంటే అది అన్యులెందరికో

ప్రేరణ కాబోతుందనడానికి అనుమానం లేదు.

మీరు ఉపనిషత్తుల వేదాల సారాన్ని కవిత్వీకరిస్తున్నారు కదా? సర్వకాలీన సత్యాలు భాషకు లొంగని భావాలు కఠినమైన కార్యభారానికే పూనుకున్నారు. ఆ భగవంతుడే మిమ్మల్ని వ్రాయ జేస్తాడు.

**★ ఆర్షకవి భూషణ వడ్డపల్లి సత్యంనాయుడు★**

సుప్రసిద్ధ కవివర్యులు కవిగారు మానవతా మూల్యాలు ప్రోది చేసి రచించిన కవిగారి ప్రియాంశాలలో చివరి పేజీలో కృష్ణార్జునులు ఆయన కూతురు కొడుకు కుమారుళ్ళు ( ఆయన మనుమళ్ళు) పై వ్రాసిన అద్భుత కవిత నాకెంతో నచ్చింది.

అందులో ఆయన 3 ఏళ్ళ కొడుకు కొడుకు చి॥ అమోఘ ( చక్కదనాల చలాకీ పిడుగు) ను నెలల బుల్లోడు కూతురు కొడుకు చి॥ శౌర్యని కృష్ణార్జునులుగా అభివర్ణించడం సహజంగా కొడుకు కొడుకు పై వంశోద్ధారకుడుగా ఉండే అవ్యాజప్రేమతో వాడినాట పట్టించవద్దనీ ఇద్దరూ ఇలలో కృష్ణార్జునుల్లా వర్థిల్లాలని తాతగారు బ్రతిమాలుతూ వారిద్దరి కీర్తి ఆకసమంటాలని ఆశీర్వదించడం మనుమలపై తాతకున్న ప్రేమకు తార్కాణం. ఇలాంటి ఈశ్వర భావాల కవీశ్వరులైనారు, కవిగారు. చివరిదే ఇలా ఉంటే మిగతావన్నీ ఎలాగుంటాయో మీరే చదివితీరాల్సిందే!

పది నెలలలో నాల్గవ గ్రంథం ''కవిగారి ప్రియాంశాలు'' వెలువరిస్తూ తన పెద్ద మేనమామగారు 47 సంవత్సరాల క్రితం తనను 'కవిగారూ' అని పిలి చిన పిలుపును సార్థకం చేసుకున్నారు కవిగారు. తన రచనలకు పేరు పెట్టడంలో కవిగారు సిద్ధహస్తుడు. నేడు కవిత్వం అట్టడుగు బడుగువానికి అందుబాటులో లేదని నిందింపబడుతున్న తరుణంలో ఆ మాట నిజం కాదని నిరూపిస్తు న్నట్లున్నవి కవిగారి మకరంద బాణీలు.

వేదాలు ఉపనిషత్తులు తనదైన బాణీలో వస్తే అవి శతకాల్లా ప్రజామో దం పొందుతాయనడానికి ఈ పొత్తంలోని మొదటి రెండు శీర్షికలే తార్కాణం.

సామాజిక సమస్య నెత్తి చూపడమే గాక దానికి పరిష్కారం కవితలో చూపడం కవిగారి ప్రత్యేకత. కవిగారు స్త్రీ జనోద్ధరణకూ పూనుకున్న సంస్కార ప్రియుల్లా కవిత్వాలు చేస్తున్నారు. ప్రతి ఖండిక ఒక ఉదాత్తమైనదిగా స్ఫూర్తి, సందేశాత్మకత, పరిష్కార మార్గాలతో చక్కదనంగా రూపొందింది. కవిగారు

తప్పక ఆంధ్ర పాఠక అభిమానం చూరగొంటారని అనడంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు. వారికి నా అభినందనలు.

★ పత్తిపాక మోహన్ ★

ఆంధ్ర జ్యోతి ఆదివారం అనుబంధంలో మీ 'కవిగారి గజలు సుందరి' పుస్తక పరిచయం చూశాను. నేను ప్రస్తుతం ఉస్మానియా తెలుగు శాఖలో 'గజల్ ప్రక్రియ అంశంపై పి.హెచ్‌డి' చేస్తున్నాను. నా పరిశోధనకు మీ అండదండలు అంది స్తారని ఆశిస్తున్నాను. గాలిబ్‌తో సహా మిమ్మల్నీకాక, 125 మంది ఉర్దూ కవులను తెలుగువారి ముంగిళ్ళలోకి తెచ్చిన మీరు నిజంగా అభినందనీయులు. త్వరలో మిమ్మల్ని కలుసుకుంటాను.

★ కొండపల్లి రామకృష్ణారావు ★

మీ ''గజలు సుందరి'' తప్పకుండా ఒక అమూల్య సంపుటిగా శోభిల్లుతుందని ఆకాంక్షిస్తున్నాను. మరెన్నో కవితా సంపుటాలు మీ నుండి వెలువడాలని మనస్సారా కోరుకుంటూ. (30.12.1997)

విద్యుత్ వెలుగుల దివ్వెవైనావు
కవితాలోకంలో మెరుపువైనావు
గతాల లోతులు స్పృశిస్తూ
అనుభవ సారాన్నందిస్తున్న
నీ ఆలోచనలు ప్రవచనాలై
నీ ప్రతి అక్షరం గతం సాక్షిగా వర్ధిల్లాలి! (30.11.1996)

★ సాహిత్య బ్రహ్మ డా॥ వి.వి.యల్. నరసింహారావు ★

మకుటానికి సార్థక్యం కల్పిస్తూ మీరు మీ స్వర్ణగోపాల శతకంలో ఇచ్చిన వివరణ నా మనస్సును ఎంతో ఆర్ద్రం చేసింది.

శబ్ద భావచ్ఛందో విషయాలలో మీరు ప్రదర్శించిన స్వచ్ఛంద రీతిని నేను అవగాహన చేసుకోగలిగాను.

స్వామిణి కోరి తీర్చి తత్సమ భావం సాధించిన మీ కవిత మీ వలెనే పరమ ధన్యం

★ ముక్తి వాంఛ కొండలరావు ★

మన గోపాలకిషన్‌రావుగారు ప్రేమ కవులు- ప్రేమ తత్త్వం తెల్సినవారే

వీటిని వ్రాయగలరు. వీరిలో ప్రేమ, అనురాగం, ఆప్యాయత మాటల్లో చేతల్లో కూడా ఉట్టిపడుతాయి. ఈయన యథార్థవాది, ప్రేమార్ద్ర హృదయుడు కరుణాశీలుడు.

మేనమామ దేవేరా గారు ఈయనను చిన్నప్పుడే కవిగారూ అని చమత్కారంగా పిలిచిన పలుకు వరప్రసాదముగా బ్రహ్మవ్రాతగా వారి కవికుల సంభూతుడైనాడు. ఆ పేరనే కవిగారుగా నిలిచారు.

తన ''కవిగారి స్వగతాలు'' గ్రంథంలో ఎన్నో ఎన్నెన్నో కవితలు ప్రేమమయాలు. ప్రేమలోని చేదు నిజాలు నిజమైన చేదులను అనుభవించి చల్లని తెల్లని ముత్యాల్లాంటి కవితలందించారు.

కవిగారు కవిగారే కాక అనేకానేక అద్భుత కవితలతో సుకవి అనిపించుకున్నారు. ఆయన కవితలు చదువరులకు రమ్యంగా మనోజ్ఞంగా వుంటాయి. ఆయన పుస్తకానేకాలు అతితొందరగా ప్రజలకందించాలని ప్రార్థిస్తున్నాను.

**★ గుడిపూడి సుబ్బారావు★**

గ్రామాంతరం వెళ్ళి ఇంటికి వచ్చేసరికి మీ ఆహ్వానం ఉంది. మీ గజలు సుందరి ఆహ్వానం సరైన సమయంలో అందుకోలేకపోయాను. మంచి కార్యక్రమానికి రాలేకపోయాను. కవి మిత్రుడు అంకిత కేశవులుగారికి మీ గురించి మా తాలుకావారని చెప్పి గజల్ సుందరి వయ్యారాల్ని, హొయల్ని చూడమని యిచ్చాను. కృతజ్ఞతలు. (10.07.1998)

కవిగారూ- మీరే ప్రక్రియనైనా సాధించగలరు. 'పెద్దమావయ్య' అశీః ఫలం అని నేనప్పుడప్పుడనుకుంటూ వుంటాను. కృషితో ఏదైనా సాధ్యమవుతుందని - మళ్ళీ పూర్వజన్మ సుకృతమూ అన్పిస్తుంది. అక్కపక్కలా అన్న మీ పద బంధం యాభై ఏళ్ళ క్రితం విన్నాను. ఈ మధ్య అందరూ దాన్ని మరిచే పోయారు. మీది సార్థక జన్మ. వేదాల్ని అనువదించడం సాధిస్తారు. మీరు ప్రేమించే భారతీయతకది మీ అక్షరాంజలి కాగలదు. (27.07.1998)

నిజంగా మీ పెదమేనమామ గారు ద్రష్టలు. చిన్ననాడే మీ భవిష్యత్తు ఎంత చక్కగా వూహించారో. మీ యింటి వాతావరణంలోనే సంగీత సాహిత్య సరస్వతి ప్రభావముంది. అందుకే మీకు గాలిబ్ యెడల అవ్యాజానురాగం మమకారం, గౌరవము. గాలిబ్‌ను మీరు ఆవాహనం చేశారు. భయం లేని ప్రకృతి మీది. దేనికీ భయపడని బిడియపడని మనస్తత్వం. మనః కుహరంలో వచ్చిన

ప్రతిదాన్ని రాయగల నేర్పు అలవడడం మీ అదృష్టం. కృంగె హృదయం కాలేయం, రెంటి కోసం ఏడ్పొయెను. సహాశోకిని పెట్టుకునే, శక్తి నాకు లేదాయెను ! సహ శోకిని ఎంత మంచి మాటవాడారు మాష్టారు! మీరు సూర్యాపేట తాలుకావారే నన్ను గర్వం అహంభావం నాకు బాగా వున్నవి. (21.08.1998)

గాలిబ్ మహాకవి. ఆయన ద్విశతజయంతి ఉత్సవాల్లో పాల్గొనగలిగిన తెలుగువారుగా నాకు తెలిసినంతవరకు మీరొకరే ! వందలాది మంది పాల్గొన్న సభలలో ప్రత్యేక ఆహ్వానితులుగా మీరూ వెళ్ళడం గర్వ. మీరెంతో అభినంద నీయులు. మీరంటే తెలియని మా తాలుకావారు చాలామందే! (04.12.1998).

''గజలు సుందరి'' పై రివ్యూలు చదివాను ప్రభలోను-వార్తలోను. వేసుకునేవాడుంటే అంతకంటే మంచిగా పాఠకులే రాయగలరేమో? అని పించింది. న్యాయం చేయలేని పరిశీలన, విచారణలా అనిపించాయి. (01.09.1998)

తమ అనువాద 'గజల్ సుందరి' బాగున్నదని పెద్దలు పూజనీయులు సదాశివగారు తెలిపినారు. చిన్నప్పుడు కొద్దిగా చదువుకున్న ఉరుదూ భాష మూలంగా మీలాంటి వారు చేసిన గజళ్ళ అనువాదాలు చదవాలనే ఉత్సుకతతో వ్రాస్తున్నాను. వీలుచేసుకుని మిమ్మల్ని కలుస్తాను. (21.03.1998)

లేడుగాలిబు ఇకపైన లేనె లేడు
ప్రణయ సమ్రాట్టు ఆ మధుపాయి లేడు
ఎంతలేసి సౌందర్య పిపాసి తాను
అంత దీనంగానూ మరణించినాడు ! ఎంత బాగా చెప్పారు.

మళ్ళీ మళ్ళీ చదువుతున్నాను. నిజంగా గజళ్ళు చాలా బాగా కుదిరాయి. భావం వెంటనే స్ఫురించడమో మదిని తట్టడమో చేస్తాయి. స్వతంత్రుడు స్వాభిమాని గాలిబు, నిరుపేదగా బ్రతుకునీడ్చె నా సాహిబు, చివరికి శవం మీద కప్పుటకో, చిన్న గుడ్డలేకనే చచ్చెనా గరీబు! ఎంత నిజం?

మీ మేనమామగారి దీవెన మి ఎడల ఎంత గొప్పగా ఫలించింది. అమృత వాక్కు-లంటే యివేనేమో! (31.07.1998)

మూడు రోజుల క్రితం కోదాడ నుండి హైదరాబాదు నుండి సాహితీ మిత్రులు వచ్చారు. మీ గజళ్ళను విని అనందించారు. పుస్తకం అడగడానికి బిడియపడుతున్నవారిని అదేమిటి? చదవండి. మీరందరు చదవాలి మన

ప్రాంతం కవి రచన మనకు గర్వకారణం కదూ? 'గజలు సుందరి' హైకోర్టు అడ్వకేట్ చేతుల్లోకి చేరింది. నేనొక్కణ్ణే చదవడం కాదు, నా అనుభూతులు వారూ పొందాలి. పరవశించాలి. పల్లవించాలి. వరంగల్‌కు కాళోజీ సోదరులు, పల్లా దుర్గయ్య, రామరాజు, సంపత్కుమారాచార్య, మాదిరాజు చాలమందే వున్నారు. మీరు మటుకు మా సూర్యాపేట తాలుకా వెంపటి గ్రామస్థుడిగానే వుండండి. మా ప్రాంతం చాలా పేదది సాహిత్య సృష్టిలో. అందుకే మీకీ దరఖాస్తు మీ వీరాభిమాని.

మీ అవ్యాజమైన ప్రేమకు కృతజ్ఞుణ్ణి ఎంత అదృష్టవంతుణ్ణో అనుకుంటు న్నాను. 12 మంది స్వామీజీలతో మీ ఉపనిషత్ప్రారంభోత్సవ కార్యక్రమం మీరనుకున్నట్లు విజయవంతమౌతుంది. కొంచెం ఆలస్యమైనా సరే - భగవద్గీతను మీదైన బాణీలో సామాన్యుడైనా అర్థం చేసుకునేట్లు వ్రాయండి. మీలో ఆ పట్టుదల భాషా జ్ఞానము వుంది. వేదాలూను అప్రతిహతంగా వెలువడాలని సామాన్యుల్ని రంజింప చేయాలనీ మరీ మరీ ఆకాంక్షిస్తున్నాను. (26.10.1999)

35 ఏళ్ళ తరువాత మీరు కవిగా రూపొందడం సరస్వతీ దేవి అంతర్వాసినిగా జలపాతంలా త్రిభాషల్లో అలవోకగా నిరంతరంగా సాగిపోవడం ఏమిటి? మీ పెద్ద మావయ్య కీ॥శే॥ దేవేరా వాక్కు ఎన్నో ఏళ్ళకు ముందునాడే వూహించి కవిగారూ అని పిలవడం మీ బాల్యాన్ని ఎరిగిన మీ మావయ్యల ఎడ మీ భక్తి ప్రపత్తులు ప్రతి నిమిషమూ మీరు ఆ జ్ఞాపకాల్ని నెమరువేసుకోవడం అదో ముచ్చట!

ప్రపంచంలో చాలామంది భార్యాభర్తలు రచయితలున్నా భర్త వ్రాసిన పుస్తకానికి భార్య తన అభిప్రాయాన్ని రాయడమరుదైన విషయమే అను కొంటాను. మీరెంత ఆదర్శదంపతులు? చేయెత్తి నమస్కరిస్తున్నాను. మీతోపాటు నేనూ సూర్యాపేట తాలుకా వాణ్ణే కావడం నాకదో గర్వం, గౌరవ మూను. నేను కేవలమో మామూలు పాఠకుణ్ణే. భగవంతుడనండి, మీ కృషి అనండి, మీరు మీలో ఉన్న అపార కవితాధారను యింకా యింకా సంపన్నం చేయండి. గజలు సౌందర్యం అనుభవించడానికి కొంత విరహ వేదన పడివున్న వానికి అర్థమయినంతగా షండుడికి కాదు. దాశరథిగారూ, సదాశివగారూ- అనంతయ్యగారూ ఇంకా ఎందరో అనువదించినా ఎవరి శక్తి యుక్తుల మేరకు వీలైన ఛందస్సులలో వారు కవిత్వీకరించారు. ఉరుదూ భాషా సౌందర్యం ఆ

వ్యక్తీకరణ అంతగా తెలుగులో రావడం అంత తేలికకాదు. చెఱుకు గడ నమలడం లోని తృప్తి చెఱుకు రసం త్రాగడంలో లేదనుకుంటాను. ఈ రెండు గ్రోలిన నేను ఆ రుచిని ఎలా మర్చిపోగలను. ఉర్దూ భాషా మధురిమకు ముగ్ధులయ్యేకదా మీ తోటి వాడూ ఆ ఆనందాన్నీ ఆ ఉద్వేగాన్నీ పొందాలన్న తాపత్రయంతోనే కదా అనువదించారు. మీకు ఇతరులకై ఇంత గొప్ప ప్రయాసా? అందుకే మీ అందరికీ చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

మీ అనుభవం అర్థాన్నీ, భావాన్నీ నిబద్ధత చేసేతీరు చాలా బాగున్నవి. గజళ్ళ యెడ మీ ఆరాధనా భావానికి నేనెంతో ముగ్ధుణ్ణవుతున్నాను. మీ యెడల నా గౌరవమినుమడిస్తున్నది. మీ భావాలు, మీ సంస్కారం, మీ బంధుప్రీతీ, మీ ఆకాంక్షలూ నిజంగా మీరెంత విశిష్ట వ్యక్తిత్వం కలవారు? (27.04.1998).

**★ ఎమ్. భండారి ★**

ప్రతి కవీ తన తీపి చేదుల కలయికల గతాన్ని చెప్పుకోలేడు. దానికి తగినంత నిజాయితీ ధైర్యం, నిష్కల్మషత అవసరం. ఎక్కువగా తమ చేదు జీవితానికి పరదా వేసి స్వాప్నిక లోకంలో విహరించే వారే ఎక్కువ- మొదటి పని చేసి మీ స్వగతాలుతో మీ నిజాయితీకి అద్దం పట్టారు.

ఇకపోతే రాయలవారి తర్వాత మిమ్మల్నే చూస్తున్నాను. అష్టదిగ్గజాల నెన్నుకుని సన్మానించడం. మొత్తానికి ఉర్దూ హాలు మరో విజయ నగర దర్బారు హాలులా మారింది. ఇక వజ్రోత్సవ దంపతులెవరో తెలుపకుండా సన్మానించడం బాగుంది . (వారు మా అమ్మా నాన్నలు - కవిగారు).

**★ వేమూరి వేంకటేశ్వర శర్మ ★**

మీ 'స్వర్ణగోపాల శతకం' లో 24 గంటల్లో 108 పద్యాలు వ్రాయడం ద్వారా మీ కార్యశీలత దృఢ సంకల్పాన్ని వ్యక్తం చేస్తున్నది. అందులోని నీతి సూక్తులు, సాంఘిక దురాచారాలు, హాస్యరసోక్తులు మీ వ్యక్తిత్వానికి గీటురాళ్ళు. ప్రార్థన నిష్కామం కావాలని చెప్పినప్పుడు ఓ ఆధ్యాత్మిక రహస్య వేత్తగా, సమాజ హితాన్ని కోరినప్పుడు ఓ మానవతా వాదిగా కనిపించారు. మీరు చెప్పినవన్నీ విజ్ఞాన వీచికలు. మీరు నిజంగా యతులే. మకుట నిర్ణయంలోని మీ తెంపరితనం అమోఘం.

ఇక 'సందర్భ స్వరాలు'లో ఏ పండుగ గురించి చెప్పినా మీలో చూపు దర్శనీయమవుతుంది. మీ పరిశీలన అమోఘం. మీ రచనా కుతూహలం చాలా ప్రశంసనీయం.

జీవితాన్ని ఎందరో నిర్వీర్యం చేసుకునేవారిలా కాక అక్షరాన్ని నమ్ముకున్న మీకది సకల శుభాలనూ కల్గిస్తుంది.

సతీమణికి శతకమణి నంకిత మివ్వడం చాలా గొప్ప విషయం. ఆలుమగల అన్యోన్యతకు యింతకన్నా వేరే నిదర్శనముండదు. మీరిద్దరూ వేర్వేరైనా మకుటంలో చక్కగా కలిసిపోయి అద్వైత చిహ్నమై విరాజిల్లినారు. మీ దంపతులు చిరకాలం సకల శ్రేయాలతో వర్ధిల్లాలని కోరుతూ మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నాను. (21.12.1999)

★ శ్రీమతి త్రిపురారిభట్ల ఇందిరా చిరంజీవి ★

మీ స్వగతాలు ఆసాంతం చదివి ఆనందించినాను. ఇటువంటి నూతన ప్రక్రియలో వున్న పుస్తకం ఇంతవరకు చదవలేదు. సాహిత్యంలో ఇది సరిక్రొత్త భావ కెరటాలు.

మీరు మీ కుటుంబంలోని వారి గూర్చి ఉదాత్తంగా కవితలు వ్రాయడమే కాక వారి ఫోటోలు మీ వంశవృక్షం చిరస్థాయిగా వుండునట్లు ప్రచురించి కవిగా శాశ్వత కీర్తిని సంపాదించినారు. 'జననీ జనకులు' లో మీ భక్తి ప్రపత్తులు తల్లి దండ్రులయెడ విశ్వరూపమయాయి. వారు ధన్యులైనారు. మౌనరణం ,దాని మీ అనువాదం ప్రతి మనిషీ అనుసరించదగిన మార్గదర్శిగా వున్నది.

భర్త వ్రాసిన గ్రంథానికి భార్య తొలిపలుకు వ్రాయటం, ఇది మీ దంపతుల అన్యోన్యానురాగానికి నిదర్శనము. మీరిరువురు ప్రేమైక మూర్తులు మీ కుటుంబం ప్రేమాలయం, దేవాలయం అనిపించింది.

కవిత్వానికి హృదయ సంబంధమైన భావావేశము మృదువైన భాషా సరళి తోడైతే అది వచన కవితైనా మీ కవితలా లయ ఉంటే ఇంకేం కావాలి?

మీ ఇతర రచనలూ గ్రంథించి సాహితీ పిపాసుల కందిస్తారని ఆశిస్తూ అభినందనలు తెలుపుతూ. (18.01.1997)

★ కాసర్ల తాండవ కిషన్ రావు, హన్మకొండ ★

నీ ''ప్రియాంశాలు'' ఆమూలాగ్రం చదివి ఆనందించాను. ప్రార్థనా గీతితో ప్రారంభమై, దినమంతా సుదినంగా రూపందుకొన్నాయి. నీ 'స్వర్ణగోపాల శతకం' లో నా కోడలు స్వర్ణలతకు పుట్టినరోజు కానుకగా మానవతా విలువల శతసుమాల మాలను కూర్చి మాకందాల అందాల సౌరభం అలది కొప్పు నిండా పెట్టావు. ఆమె అబ్బుతో శబ్బాషనిపించుకున్నావు.

గిర్వాణి కృపతో పూదోట ఎదిగింది. పూలే పూలను నింపుకుంది.

ఇవి సుప్రియాలు, ఆశయాల అంశాలుగా, అనుభవాల భావాలుగా అందిం చావు ఖండకావ్యంలో ఇది చదివినవారికి కవిగారు తమను గూర్చే వ్రాశారా అనుకునేట్లుగా ఉన్నాయి. ఈ సెలయేరు ఆగక సాగాలి. అవశ్యం కొనసాగు తుంది. శుభం భవతు అల్లుడూ ! (29.11.1997)

★ శ్రీమతి అల్లుమోలు చంద్రావతీరావ్ ★

కవిగారి సందర్భ స్వరాలు లోని కవితలు ఒకదానికన్నా మరోటి మిన్నగా సమాజాని కనుగుణంగా సాగినవి. సర్వమత సమానత్వం, మానవత్వం కోరుతూ వ్రాయడం దీక్ష అనే చెప్పాలి. సాంఘిక దురాచారాలన్నీ విశ్లేషించి రచన చేయడం వరం. పుట్టపర్తి బాబాపై కవిత చదువుతుంటే భక్తి భావన పెల్లుబుకు తుంది. నేతాజీ నుండి జాతిపితదాకా చంద్రబాబు (రారాజు) నుంచీ నేటి భారతం వరకు అన్నీ ముఖ్యాంశాలే అయిన కవిత లల్లిన కవిగారికి నా అభినంద నలు. (10.05.1997)

★ చందన్ రావు ★

ఉర్దూ గజల్ సౌందర్యాన్ని సౌకుమార్యాన్ని సౌరభాల్ని తెలుగులోకి అను వాదిత కృతిగా వెలువరించి సాహిత్యాభిమానులకు ఆహ్లాదం కల్గించి నందుకు ఒక కవిగా మిమ్మభినందిస్తున్నాను. స్వీకరించండి.

★ గజవాడ రాములు ★

మీ కవిత్వం మహోన్నత స్థాయిలో పయనిస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది. సర్వజనానికి మేలుకొలుపుగా వున్న మీ కవిత్వానికి జనమెంతో ఋణపడి వుంటారు.

జీవితంలో మీతో గమించినవారందరినీ మీ హృదయంలో పదిలపరచు కొని గ్రథనం చేయడం మీ నిజాయితీకి తార్కాణం. మీ 'కవిగారి స్వగ తాలు' లోని భావగాంభీర్యాలు వైదిక సాహిత్యమున కనుకూలముగా వుండడం చాలా విశేషము. తెలుసుకోగోరే ప్రజావళికి భగవంతుణ్ణి తెలుసుకోవడానికి ఇది గొప్ప మార్గదర్శక భావనగా తోచుచున్నది.

దేశ సౌభాగ్యము కొఱకు మీలాంటి కవులు చాలా అవసరము. మీకు ఆయురారోగ్య సంపదలు వంద సంవత్సరములు పైన భద్రముగా వుండవలె

నని భగవంతుణ్ణి వేడుకొంటున్నాను. ఈ నాలుగు మాటలు వ్రాయడం నా పూర్వ జన్మ సుకృతంగా భావించుచున్నాను. (13.04.1997)

★ డి.ఏ.ఎల్.ఎన్. మూర్తి★

మీ 'గజలు సుందరి' లోని కవితలు దాశరథిగారి గాలీబు గీతాలను తలపిస్తున్నాయి. చాలా బాగున్నాయి. నాల్గు పంక్తులలో అంత చమత్కారం, క్లైమాక్స్ తీసుకురావడం చాలా కష్టం. మీకు అంత ఉరుదూ భాషాజ్ఞానం ఉండడం ముదావహం.

తీగలు రెండు కలవగానె జీవకాంతి ఉద్భవించు, ఖుదా వీరందరికీ ఐక్యత నీవైనా నేర్పవా వంటి అక్షర సత్యాలు కోకొల్లలు, మీ గజలు సుందరిలో. ఇంకా చాలా రచనలు చేయడమే కాక సంఘ సంస్కర్తగా కూడా ఎదగాలని, భగవంతుడు మీకు ఆయురారోగ్యాలు ఇవ్వాలని సదా మీ శ్రేయోభిలాషిగా నా ఆకాంక్ష.

★మేడిచర్ల సూర్యప్రకాశరావు ★

మీ ''కవిగారి స్వగతాలు'' నాకు బాగా నచ్చింది. కవితల్లో చక్కని భావాలు పలికించారు. జనవరి 8 నా డైరీ మీ గుఱించి మీ సంకలనం గురించియే నిండిపోయింది. మీరు మరిన్ని సంకలనాలు వెలువరించి మంచి పేరు ప్రతిష్ఠలు పొందగలవని ఆశిస్తున్నాను. (09.01.1997)

మీ ''కవిగారి ప్రియాంశాలు'' లో 'సదాచార సృష్టి' లో సూచించిన మగ వారిని అత్తింటికి పంపి కూతురుకి పెళ్ళి చేసి అల్లుడ్ని తెచ్చుకోవాలనునది చాలా గొప్ప భావం. 07.09.1996)

★ జెట్టి నాగేశ్వరరావు ★

మీ స్వర్ణ గోపాల శతకమును ఆమూలాగ్రం చదివినాను. అన్ని మీ అభిప్రాయాలతో ఏకీభవించుచున్నాను. అందరూ ఏకీభవిస్తారు. కాని ఆచరణలో పెట్టేవారే అరుదు. మీరు వ్రాసిన 100 విలువలు మీరు పాటిస్తూ ఇతరులకు విన్నవిస్తున్నానని, మీరు రాసిన పద్యమే నన్ను శతకం పూర్తిగా చదివించింది. దీన్నిలా రసాత్మకం విశ్వ శ్రేయోదాయకమైనదే కావ్యం, ఛందో బద్ధము కానక్కరలేదు. ధారణ సౌలభ్యముంటే చాలును. మీ సతీమణికే శతకం షష్టిపూర్తి సందర్భంగా అంకితమివ్వడం మీ రసికత చాటుతున్నది. అభినందనలు.

మీ ఆత్మాచరణము చాలా బాగున్నది. మీలాంటి వ్యక్తితో పరిచయం

నాకు సంతోషదాయకము. "Make others happy if you can" అన్న ఆర్.ఎల్ స్టీవెన్సన్ భావాన్ని తలపోసే భావమే మీ ఆదర్శము అవడం ముదా వహం.

★ పైడి లక్ష్మీకాంతరావు ★

మీ కవిగారి స్వగతాలు చదివిన నాకెంతయో అమందానందమయెను. (10.11.1998).

★ కమల్ తేజ్ ★

ఉర్దూ భాష సొగసుకు మనసుపడి మహాకవి దాశరథి మూడు దశాబ్దాల క్రితమే గాలిబ్ గీతాలుగా ఉరుదూ గజళ్ళ ననువదించారు.

ఇప్పుడు కవిగారు యింకా ముందుకెళ్లి గాలిబ్‌తో బాటు 125 ఉర్దూ కవుల కవితలను ఎంతో రసవంతంగా, అర్థవంతంగా అనువదించారు.

వారిరువురి, మహోపకారం వల్లే మనకీ భాగ్యం కలిగింది. కవిగారి 'గజలు సుందరి' తెలుగు వారి 'గజ్జెల సుందరి'గా కలకాలం అందరి హృదయాల్లో ఆనందపు చిందులు వేస్తూవుంటుంది. కాంతిశక్తి ఉద్యోగానికి స్వస్తి చెప్పి క్రాంతి శక్తి (సాహిత్యం) ఉద్యమం చేపట్టారనిపిస్తున్నది. ఉపనిషత్తులూ వేదాలూ భగవద్గీత కవిత్వానువాదం చేస్తున్నారని విన్నాను.

కవిగారిది అనువాదం కాదని ఆయన అనుసృజనే అని చాలా చోట్ల అనిపించింది. కవిగారి కవితల్లో రసం, భావం, సౌమ్యత, రమ్యత సమపాళ్ళలో నిండి వున్నాయి. ఇంతగా ప్రేమానుభూతిమయంగా వ్రాసిన కవిగారు ప్రేమ హృదయులనే చెప్పాలి. పాఠకులకూ ఆ దివ్య అనుభూతినే అందించినారు. వారు సంకల్పించిన కార్యాలన్నింటినీ నెరవేర్చేలా భగవంతుడు వారికి ఆయురారోగ్య, ఐశ్వర్యాలను ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

## ★ M. Leelavatharam ★

The occasion of release of your "Kavigari Swagathalu" is more glorifying by the presence of persons of repute and reverence, who made a mark in the Telugu Literature and by the presence of a good gathering even on a chilly evening.

Your speech is as usual direct to the point and the subject brief and effective. Not lagging behind is your noble son who

preceeded you. His introduction is very striking and received very well by the audience.

I thankyou for chancing me to ingress your glory in the literary field, not to speak of the Technical field where you made a mark to the envy of many. I wish you to repeatedly earn the envy of men in the new field too.

★ జెంగిటి కొండల్ రావు★

మీ స్వగతాలు చదివి మేమంతా తెలుసుకున్నది, ఎంత మంచి ఎందరికి చేయగలమో అందరు ఇతరులకు చేయాలన్నది. ఎన్నిసార్లు ఎన్ని విధములుగా చేయగలమో అన్నిసార్లు అన్ని విధాల చేయాలన్నది. ఎంత కాలం ఎన్ని చల్లని చూపులు చూడాలో అంతకాలం చూడాలన్నది. (05.05.2000)

★ డా॥ తిరునగరి (కవి) ఆలేరు ★

మీ గజలు సుందరి ఆవిష్కరణ విశేషాలు పత్రికలో చదివి ఆనందించాను. మీకు నా హృదయ పూర్వక అభినందనలు. మీ లేఖిని నుండి రసవద్రచనలు మరిన్ని రావాలని ఆకాంక్షిస్తున్నాను.

★ పొణుగుపాటి కృష్ణమూర్తి, సంపాదకులు సూర్యశక్తి ★

''కవిగారి సందర్భ స్వరాలు'' లో మిత్రులు కవిగారు పండుగ మఱియు ముఖ్య ప్రయోజన సందర్భములందు తన మనసున పొడమిన ఆలోచనలకు అక్షర రూపమిచ్చి తన మనోభావనలను మనందరితో పంచుకొనుటే కాక రానున్న తరాలవారికి అందించేందుకు రమ్యమైన కృషి చేసి ధన్యులైనారు. వారి భావ గాంభీర్యమును ప్రతి పదమున నిక్షిప్తము గావించినారు. ఓంకార నాదమ యమైన ఈ విశ్వనాటక ప్రక్రియలో కవిగారి ఈ స్వరాలు లీనమై అంతర్వా హినులై మానవాళి సుఖ శాంతులతో మనుగడ సాగించుటకు కృషి సల్పి జయులై నారు.

★ దేవులపల్లి వెంకట హరీష్ బాబు★

''కవిగారి సందర్భ స్వరాలు'' రేపటి తరానికి చక్కని వరాలు. మానవు లంతా ఒకే కులం అదే మానవకులం అనే అంతర్జాతీయ సమైక్యతా భావాన్ని

నినదించి విశ్వమానవుడి ననిపించారు. హిందూ ముస్లిం ఈసాయీ అందరూ ఒకటే నన్నంతగా అందరి పండుగల గూర్చి వ్రాశారు.

అంతమౌతున్న మానవతా విలువల నడుగడుగునా గుర్తుచేశారు. జపనీయుల సమయపాలన, జాత్యభిమానం ఆదర్శంగా తీసుకుని ముందంజ వేయాలన్నారు. ఇవి సత్సంకల్ప స్వరాలే కదా?

★కె.ఆర్.కె. మోహన్★

దాశరథి కేవలం గాలిబ్ గజళ్ళను అనవదిస్తే, సినారె స్వయంగా తెలుగు గజల్స్‌ను రచిస్తే, గాలిబ్ గజళ్ళననువదించడమే కాక మరో 126 మంది ( తనతో సహా) ప్రసిద్ధ ఉర్దూ కవుల కవితలను కూడా తెలుగులోకి అనువదించి మరో అడుగు ముందుకు వేసినవాడు తెలుగు సాహితీ ప్రపంచంలో 'కవిగారు'గా ప్రసిద్ధికెక్కిన ఆకునూరు గోపాల కిషన్‌రావు. పార్శీ ఉర్దూలలో ప్రావీణ్యమున్న వారే గజళ్ళ సౌందర్యాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించగలరు. తెలుగులో సమాన ప్రతిభవున్నప్పుడే వాటిని అర్థవంతంగా ఆకర్షణీయంగా అనువాదం చేసి మూలానికి పరిపూర్ణ న్యాయం చేయడం సాధ్యం అవుతుంది. ఈ మూడు భాషలలో సమాన ప్రతిభ కలిగిన కవిగారు 'గజలు సుందరి' అన్న పేర గాలిబ్ రచించిన 246 గజల్ అష్ఆర్లను గ్రంథ రూపంలో బంధించారు. అంతేకాక 125 మంది ఉర్దూ కవిరాజుల ప్రసిద్ధ కవితలను పొందుపరిచారు. స్వయంగా ఉర్దూలో కూడా మంచి కవిగా గుర్తింపు పొందిన కవిగారు తన కవితలను అందరికంటే చివరన వుంచడం ఆయన వినయ శీలతను చూపుతోంది. చివరన ఉన్నా ప్రథ మాన ఉండదగ్గ రీతిలో ఉన్నాయి ఆయన కవితలు. ఆయన భావనా బలానికి మచ్చు తునకలు. ఆయన అనువాదం కూడా సరళంగా అర్థవంతంగా ఉంది. ప్రేమ కవితల అనువాదాలు అందాలకు మచ్చు తునకలు.

కవితలను స్త్రీ పరంగా చెప్పుకుంటాం. అందుకేనేమో ఆ సౌందర్యానికి ముగ్ధుడై ఈ కవితా సంకలనానికి 'గజలు సుందరి' అని పేరు పెట్టడం. ఎంతో ఉచితంగా ఉంది. చక్కనమ్మ చిక్కినా అందమే అన్నట్లు ఇందులోని ప్రతి కవితా ఒక సుందరియే. ఇలా గలు గల్లున గజ్జలు గల గల మ్రోగంగ కలహంస నడకల కదలి వచ్చిన ఈ గజలు సుందరిని స్వాగతిద్దాం. ఈ సుందరిని కవితా పుత్రికగా అందించిన కవిగారిని అభినందిస్తున్నాను. ఆయన కలం నుండి మరిన్ని మంచి కవితలు రావాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.
(01.08.2000)

★ డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం ★

సతీపతుల అద్వైత ప్రణయ జీవితానికి సహజమైన సాహితీ సంకేతం కవిగారి స్వర్ణగోపాల శతకం మకుటం. స్వర్ణగోపాల శతకం పేరు వినగానే స్వర్ణ అనే పట్టణంలో వెలసిన వేణుగోపాల స్వామిపై వ్రాసిన శతకమేమో అనిపిస్తుంది. అసలు కథ వింటే ఆశ్చర్యం వేస్తుంది. 'స్వర్ణ' భార్య పేరు ముద్ర. 'గోపాల' శతక రచయిత, స్వర్ణ భర్తకు సూచికముద్ర. కందం పల్లకీ లాంటిది. అందులో ఇమడాలంటే గోపాలుడు సైతం తలవంచి కాస్త లఘువు కావలసి వచ్చింది. అందుకే స్వర్ణగోపాలా బదులు స్వర్ణ గొపాలా అయింది.

స్వర్ణమాట కవిగారు తలఒగ్గి కాకున్నా మనసొగ్గి అయినా తప్పక వింటాడు. ఆ సుగుణమే ఈ శతకావతారానికి మూలకారణం. శతకం వ్రాసిన కవి భారతికి మకుటం పెట్టే కవి అని ఆమెకు తెలుసు. అందుకే భార్య మీద కవిత చెప్పే 'కవిగారి'ని భారతివైపు మళ్ళించిన 'స్వర్ణ' గారిని ఎటు తిప్పినా 'స్వర్ణ'ను విడిచే మాటే లేదన్నట్లు మకుటంలో ఇమిడించి దాన్ని బంగారం చేశారు. స్వర్ణగోపాల శతకం నిజానికి స్వర్ణ గోపాల పతకం.

శతకానికి ప్రేరణ మకుటానికి మాన్యతలేగాక తను చేసిన పరిశోధ నాంశాలు మానవ మూల్యాల వస్తువునూ ఇచ్చిందామె! ఆమె మాట కాదనలేని కవిగారు ఉత్తేజితులయ్యారు. మకుటాన్ని క్షణంలో కుదించుకుని వస్తువుని Human Values గా ఎంచుకుని ఒకో విలువనొకో పద్యంగా చెప్పాలనుకున్నారు. వృత్తాన్ని కందంగా నిర్ణయించుకొని వస్తువు కొట్టిన పిండి కావడంతో కందాలు వండడం తేలికైంది. భక్తి శతకం కాదు, రక్తి శతకం కావచ్చు కాని కాదలచుకోలేదు. ఆమె అభిమతం మేరకు సూక్తి శతకమై అవతరించింది. కందంలో సూక్తి చెపితే తెలుగు వారికెంతో అభిమానం, ఆనందం, అందువల్ల మాకందం వంటి కందం సూక్తి శతకానికి అందమైన ఛందంగా జాలువారింది.

వేమనలాగా కవిగారు కూడా మకుటాన్ని ఆత్మ సంబుద్ధిగా నిలపటం విశేషం. సామాన్యంగా తత్త్వవేత్తలు చేసే పని అది. కవిగారు తాత్త్విక రంగంలో కూడా కవిత్వం సాగిస్తారేమో చూడాలి. ఇది ఒక ప్రయోగం దీని వెనుక నున్న సతీ పతులకు సహృదయాభివందనలు. (15.05.1997)

★ పటేలు అనంతయ్య ★

గజలు ప్రక్రియను యితర భాషల్లోకి అనువదించుటకు ఉత్సాహపడటం

సమర్థులైన ఉభయ భాషాప్రవీణులైన (ఉర్దూ - తెలుగు) పండిత కవులకు సహజమే!

గాలిబు కవితలు (గజళ్ళు) అర్థం కావాలంటే మొదలు గాలిబును అర్థం చేసుకోవాలి. ఇతరులలా కాక ఆయన ఆలోచనా సరళి భిన్నం, సర్వ స్వతంత్ర భావనా పటిమ.

కవిగారిలో గాలిబ్ గుణాలు దృక్పథాలు కొట్టొచ్చినట్లు కన్పడతాయి, త్రాగుడు జూదం మినహాయించి. కాబట్టి వారి అనువాదాలు గాలిబ్ ఆలోచనా ధోరణికి అతి దగ్గరగా ఉండడం విశేషం. ఇవెన్నుకున్నందుకు అభినందనీయులు.

వారి భాషా సాహసం, స్వతంత్ర నిఖ్ఖచ్చివైఖరి ఒక కవికుండవల్సిన యథేచ్ఛలు. సునాయాసంగా మాతృకలోని భావం సంపూర్ణంగా తోడి యిటు గుమ్మరించారు.

ఇది మక్కీకి మక్కీ అనువాదం కాకుండా ఔత్సాహిక అనువాదంగా ప్రయోగాలు ప్రయోజనాత్మకాలు తోడై ప్రశంసా పాత్రాలయాయి

ప్రేయసిని పొందు భాగ్యము
పొసగదాయె యే మాత్రము
ఎంత కాలమిక బ్రతికిన
ఎదురు చూపె గతి మాత్రము !

ఇది అనువాదం కాక సిసలైన మూలంలా వియోగపూరిత ఆవేదన ఘోషిస్తున్నది. అందుకే గాలిబ్ వలె కవిగారు బాధాగ్రస్తులు కాలేదు కదా అనేంత అనుమానం కలిగించడం విశేషం- అనువాదానికి యింతకంటె ఉదాత్తత అబ్బే భాగ్యముంటుందా ఓహో!

కవిగారి అనువాదాలలో మూలంలోని సోయగాలు, సొగసులు, క్లుప్తత, గుప్తత గాడి తప్పకుండ నడవడము భావం ఎక్కడా వికటించకుండా పొందుపర చడం శ్లాఘనీయం.

తెలుగు పాఠకులకు 'కవిగారు' ఉర్దూ కవితా మృష్టాన్నమందించుటకు చేసిన ప్రయత్నము శతధా అభినందనీయం. (19.05.1997)

★ ఏలూరిపాటి అనంతరామయ్య ★

ఇదం ప్రథమతయా అహల్యలాంటి ప్రదేశాన్ని హల్యను చేసేసరికి నేలబారు మొక్కలు నింగినంటేవయి కుంచెడు పుట్టెడుగా పండించే వయాయని తోచింది.

ఏనాటినుంచో ఒక రంగంలో ఏదో పనిచేస్తూ ఆ రంగంలో ఏదో ఉత్పత్తి చేయవలసిన వాళ్ళు ఏమి చేయకుండానో చేసినదంత సారవంతం కాకుండానో చేసేవాళ్ళుగా మిగిలిపోతే హఠాత్తుగా ఒక్కసారి స్ఫులింగాల్లాగా రోదసిలోకి దూసుకుపోవడం అన్ని రంగాల్లో కనిపిస్తుంది. ఇక్కడ ఇలా జరగడానికి ఇదే కీలకం. కనుక సాహిత్యం విషయంలో ఎవరి అంచనాలు నిర్దుష్టాలు కావు, శాశ్వతాలూ కావు.

కవిగారు ఇంజనీరుగా పేరుకెక్కినవారు- రిటైరు కాబోయే ముందు కవిత్వ రచనకు పూనుకుని అవిరామంగా అవిచ్ఛిన్నంగా కవిత్వ మైరేయాన్ని శ్వేతపత్ర చషకంలో పోసి అందరినీ మైమరపింప చేస్తున్నారు.

వారు ఉరుదూ, హిందీ, ఇంగ్లీషు, తెలుగు కవిత్వం అందచందాలకు పరవశించినారు. పరదా వెనుకనున్న ఉరుదూ కవితా సుందరి ఘోషా తొలగించి కేవలం ఘోషా కలవాటుపడినవారికి ఆనందం కలిగించాలని ఈ 'గజలు సుందరి' ని మనముందు నిలిపిన ఉదారులు.

ఇందులో కొన్నింటికి ప్రసిద్ధుల అనువాదాలుండవచ్చు గాక. ముఖ్యంగా గాలిబు మహాకవి దాశరథి అనువాదాలు ప్రచారం లోకి వచ్చాయి కూడా. మళ్ళీ ఇందెందుకు? ఈ ప్రశ్న తెలిసినవారెవరూ వేయరు? వాల్మీకి రామాయణం కాక సంస్కృతంలోనే ఎంతమంది ఎన్ని రూపాలలో వ్రాయలేదు? ఎన్ని భాషలలోనికి ఎన్ని రూపాలలో అది నిరంతం అనువాదం కావడం లేదు?

కవిగారి ఈ కవితలు నాకు ఆనందం కలిగించాయి. అరమరికలు లేని మనస్సుతో చదివిన వారెవరికైనా ఆనందం కల్గిస్తాయి.

★ సుధామ ★

అనువాదకుడు ఉభయ భాషాజ్ఞాని సరసుడు సహృదయుడు అయినప్పుడు ఒక భాషా సాహిత్యంలో తనను అలరించిన ఆకర్షించిన తన హృదయాన్నీ బుద్ధినీ కూడా రంజింపచేసిన రచనను తనకు నచ్చిన మరో భాషలోకి

( మరీ ప్రత్యేకించి సహజంగా తన మాతృభాషలోకి) అనువదించడానికి సంసిద్ధు డవుతాడు.

కవిగారి 'గజలు సుందరి' తెలుగు పాఠకుల కోసం దిగి వచ్చిన సుందరి ఆ 'హసీనా' హొసొలను ఆయన అక్షరాల్లో గుమ్మరిస్తున్నారు. తులనాత్మక అధ్యయనం చేసే పండితుల కోసమో ఛందోగణ విశ్లేషకుల కొరకో కవిగారి అనువాదం చేయలేదు. కవితలో సౌందర్యం కోసం, ఆనందానుభూతి కోసం అర్రులు చాచే సహృదయ సామాన్య పాఠకుల కోసం ఆయన ఈ అనువాదానికి పూనుకుని నిర్వర్తించారు.

అందుకనే కవిగారి గజలు సుందరి సౌందర్యం బురఖాలోనే వుండిపో కుండా కొన్ని తావుల్లో పరదాల మాటునుండి మెరిపిస్తూ మురిపిస్తున్నది నిజం. ఈమె స్వేచ్ఛ సరళత సూటి దనం ఈ నవ్యకాలానికి తగిన నాగరిక సౌందర్యంతో భాసిస్తున్నాయి. శతాధిక ఉర్దూకవుల భావ శబలతను అనుభూతి రమ్యంగా స్వచ్ఛందంగా రస ప్రవచనంగా అందించారు కవిగారు.

ప్రణయం, ప్రళయం, వలపు, మగువు, శృంగారం, సింగారం, తరుణరక్తి, ముక్తి వంటి భావాలన్నీ లలితంగా రంగరించిపోశారు.

అన్ని అందాలకన్న
ఆత్మానందమేమిన్న
నశ్వరాలందాలన్నీ
శ్వరములేనిదాత్మేనన్న!

అని విశ్వసించిన కవిగారు ఈ 'గజలు సుందరి' లో అనువాద సౌందర్యా నికి మించి అనుభూతి ఆత్మకు ప్రాముఖ్యమివ్వడం ప్రశంసనీయం- కవిగారి ఈ అనువాద మానస సరోవరంలోనికి పాఠక హంసలకు స్వాగతం. (13.10.1997)

★ వోలేటి పార్వతీశం ★

ప్రకృతిలో అన్ని కార్యకలాపాలను ప్రకృతి నిర్దేశిస్తున్నది. మనిషి విషయంలో యే నిర్దేశాలు నిర్ణయాలు, నిరంకుశత్వాలు లేవు. అందుకని అతడే పువ్వుని చూసి స్పందిస్తాడో ఏ కుసుమ పేశలమైన భావానికి చలించిపోతాడో ఏ భావాన్ని ఆస్వాదించి పరవశిస్తాడో ఆ స్పందన అనిర్వచనీయం.

ఈ స్వేచ్ఛ వల్లనే భావుకుడైన మనిషి ఒక్కొక్క సందర్భంలో అనుకో కుండా కలిగిన అనుభూతికి కవిగా మారుతాడు.

సరిగ్గా అలాగే కవిగారైపోయిన ఒక భావకుడి భావహర్మ్యం 'ఈ గజలు సుందరి' ఇంతకు మునుపు ఆవిష్కరించిన నాల్గు కావ్యాలతో ఆంధ్రదేశంలో 'కవి'గా స్థిరపడిన శ్రీ ఆకునూరు గోపాలకిషన్ రావు ఇప్పుడు ఈ కార్యంతో సుప్రసిద్ధులౌతున్నారు.

పరభాషా సుందరిని చూసి పరవశించిన కవిగారు ఆమెకు తెలుగు తనాన్ని కలిగించే అలంకారాలు తొడిగారు. తెలుగు మాటల వస్త్రాలను అలంకరించారు. పరగేయ ప్రవేశం చేసి రసరమ్యంగా తీర్చి మనముందు ఆవిష్కరించారు.

నైరాశ్యం ఎంతగాను నరకంలా తోస్తున్నది
ప్రేయసి తీపి జ్ఞాపకాలను వేగంగా మరిపిస్తున్నది!

మనిషికి నైరాశ్యం ఎంత మాత్రం కూడదనుకునే దాన్ని అది ఎంత ఆవశ్యకమో ఒక కొత్త కోణం నుండి మనకు ప్రదర్శించారు.

చిరకాలం జీవించే సుర మిత్రులకన్నా
పది మందికి పనికి వచ్చు మన నరులేమిన్న !

మనుషులందే మాధవుణ్ణి వెదకి పట్టుకోమన్న ఆర్యుల భావానికి ఇదొక క్రొత్త ప్రతిబింబం.

ఇలాంటివెన్నో ఎన్నెన్నో కవిగారి కవన నైపుణ్యానికి చిరునామా లై నిలిచేవి, గుండె పగిలే మాటల్లోంచి పరవశించే అర్థాలను ప్రకటిస్తూ కవిగారి సమర్థతకు నిలువెత్తు దర్పణాలయేవి కన్పిస్తాయి 'గజలు సుందరి' లో.

ప్రేమలో పడిన వారికి లేదు చావు.బ్రతుకుల్లో తేడా
ఎవరికై పడిచస్తారో వారి కొఱకే బ్రతుకుతారు !
రెండు గీతల్ని కలిపి అందాన్ని ప్రతిష్ఠించ గలిగిన 'బాపు' కి
రెండు మాటల్ని కలిపి అర్థాన్ని ప్రతిష్ఠించగలిగిన 'ఆత్రేయ' కి
వారసత్వపుఛాయల్ని ప్రతిష్ఠించారు కవిగారు పై పంక్తుల్లో.

భావకవుల వారసత్వం 'కవిగారి గజల్ సుందరి' భామ సౌందర్యంలో వసంతమై ప్రవహించింది. కవిగారి కవన పటిమకు ఇది గీటురాయై నిలుస్తుంది. గజల్ సుందరి థ్యాసలో కవిగారికి ఈ ప్రశంసలు. (25.11.1997)

★ దేవులపల్లి సుదర్శన్ ★

తన మనస్సుని నిర్భయంగా, నిష్కర్షగా, నిర్ద్వంద్వంగా చెప్పగల నిజాయితీ నిజమైన కవి లక్షణంగా వున్న ఈ వయో యువ కవిని మనసారా అభినందిస్తూ మరెన్నో ఉత్తమ రచనలు చేయాలని ప్రోత్సహిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

గోపాల కిషన్ రచనా వ్యాసంగం ప్రారంభించిన అనతి కాలంలోనే నాలాంటి సామాన్యుని ఊహని తబ్బిబ్బు చేసే సంఖ్యలో రచనలు చేశాడు. ఏది చేసినా అపూర్వ పద్ధతిలోనే చేయడం అతడి అలవాటు, ఈ 'సందర్భ స్వరాలు' కూడా దానికి నిదర్శనం.

అనతి కాలంలోనే తమ భాషలలో హర్షించదగిన కృషి సల్పి దశాబ్దాల సాహిత్య చరిత్ర కలిగినవారి వలె అనేకానేక ప్రక్రియల్లో చి॥ గోపాల కిషన్ రావు (కవిగారు) రచనలు చేస్తున్నందుకు నా వరకు నేను గర్విస్తున్నాను.

కేవలం 24 గంటలలో ఒక శతకం అత్యున్నత విద్యా సంపన్నురాలైన తన సతీమణికి జన్మ దిన కానుకగా యివ్వడానికి ఆమె పేరుతో తన పేరు జత పఱచుకొని 'స్వర్ణగోపాల' మకుటంతో పూర్తి చేసిన శతాధిక పద్యాలవలనే శతాధిక గ్రంథాలు రచించి తన సాంకేతిక వృత్తిలో ప్రదర్శించిన అనన్య సామాన్య నైపుణ్యాన్ని సాహిత్య రంగంలో కూడా సాధించ గలడన్న విశ్వాసం నాకున్నది.

ఈ చిరంజీవునిలోగల వయస్సుకు మించిన పరిణతికి నేను ఆనందిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

''కవిగారి ప్రియాంశాలు'' సర్వజన ప్రియాంశాలు. కటుక రోహిణి కన్న గడు చేదు నిజాన్ని తేనె పూతతో తీర్చిదిద్ది సమర్పించగల నేర్పు కవిగారికున్నది.

వేదోపనిషత్తుల వాక్యాల స్వేచ్ఛానువాదాలు వైదిక వాఙ్మయమునందితనికి గల ఆసక్తికి నిదర్శనాలు.

ఆంధ్రులారంభ శూరులన్న అపప్రథను కవిత్వంలోనేగాక నిజ జీవితంలో కూడా వరమని విజయవంతంగా నిరూపించగలిగాడు. అన్నీ చదివి ఆనందించ దగ్గ శీర్షికలే.

రామాయణ, మహాభారత, భాగవతాది పురాణేతిహాసాలన్నీ తెలుగు వారికి అనువాదాలుగా లభించినవే. అనువాదం ఒక విశిష్టమైన కళ.

సంస్కృత భాగవత ఆంధ్రీకరణలో కొన్ని ఘట్టాల్లో పోతనగారి పోకడ మూలాన్ని మించి పోయిందని ఒప్పుకోవటానికి ఎవ్వరూ వెనుదీయరు. 'గజలు సుందరి' పేర కవిగారు గోపాల కిషన్ విషయంలో అదంతే నిజమయ్యింది. ఉర్దూ మాధ్యమంతో కేవలం నాల్గవ తరగతి వరకు చదివి దానితో నిత్య సంబంధంలేక గృహస్థ జీవితం పదహారణాల ఆంధ్ర వాతావరణంలో సాగినా, ఇంతమంది ఉర్దూ కవులను తెలుగువారికి పరిచయం చేయబూనడం కవి నా మేనల్లుడే అయినా నాకాశ్చర్యం కల్గిస్తున్నది. ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించిన అనన్య సామాన్య అంకిత భావంతోనే ఈ సాహిత్య శిశువు ఆంధ్ర, ఆంగ్ల, ఉర్దూ భాషల్లో చక్కని రచనలు చేస్తూ ఒక భాష నుండి మరో భాషకి మూలాన్ని మురిపించే స్థాయిలో అనువాదాలు చేయడాన్ని సంతోషించడమే కాక ఒక విధంగా గర్విస్తున్నాను కూడా. (01.05.1997)

★ మాదాసు పిచ్చయ్య ★

మిత్రులు కవిగారు రచనా వ్యాసంగం ప్రారంభించి రెండు సంవత్సరాలే అయినా వివిధ ప్రక్రియలలో 22 పుస్తకాలు వ్రాసి అప్పుడే (దీనితో సహా) మూడు వెలయించారు. ఇది విలువల పునరుద్ధరణకు కావడం అత్యంత ముదావహం. ఈ విధంగా కవిగారు శతక కవుల జాబితాలో చేరి ప్రాచుర్యం పొందుతారనడంలో నాకేవిధమైన సందేహమూ లేదు.

గంగా ఝురిలా, వీణియ సంగీతంలా సాగుతున్న కవిగారి కవన సుందరి ఆయన కలం గళం విప్పి అద్భుతంగా నర్తిస్తోంది.

ఎన్నో విశ్వజనీన నీతి సూక్తులతో సరళంగా, స్పష్టంగా ఆప్త వచనమయంగా సాగిన ఈ శతకం ప్రాచుర్యం పొందాలని కవిగారి కవితా సుందరి విశ్వసుందరి అవాలని ఆశిద్దాం. (24.05.1997)

★ కె. వి. రమణ, ఐ. ఏ. ఎస్ ★

ఉర్దూ భాషా యోషాప్రియుడైన కవిగారు గాలిబ్‌తో బాటు 125 మంది హేమా హేమీ ఉరుదూ కవివరుల కమనీయ కవితా లహరిలో పరవశుడై జోల పాడుతున్నట్లు, జ్వాల రేపుతున్నట్లు అనుభూతిని ముప్పేటలా కలగలిపి స్వేచ్ఛాను వాదం చేస్తూ గుండెతో పలికించే 'గజలు సుందరి' ని సృష్టించారు. ఈ సుందరికి తాత్త్విక స్పర్శ, ప్రగతి శీలము మానవీయ దృక్పథాలు అలంకారాలు.

దాశరథి గాలిబ్ గీతాలు సినారె మౌనరణం కవిగారికి ఆదర్శమూ - స్ఫూర్తీను. గాలిబు ద్విశత జయంతి సందర్భంగా గాలిబునీ ఇతర 125 మంది ఉర్దూ కవుల కవితల అనువాదాలూ, చివరికి తనవీ ఏర్చి, కూర్చి పేర్చిన సంపుటి 'గజలు సుందరి'

గాలిబ్ గజళ్ళలోని జీవిత సత్యాల్ని అనల్పార్థం వచ్చే రీతిలో చిన్న చిన్న మాటల్లో పొందు పరిచారు కవిగారు.

ఇంతకు ముందెవరన్నా చస్తే ఏడ్చేవారము
ఇప్పుడెవడైనా బాగా బ్రతికితే ఏడుస్తున్నాము !

కాదనలేము ! అవుననడానికి కాదనిపించే నగ్న సత్యం. సమాజ స్థితి తిలకిస్తున్న వాడెవడికైనా గుండెను కదిలించే చరణాలివి.

తాను గజళ్ళను రుబాయిలను వ్రాశాననికాక ఉర్దూ కవుల గజలు రుబాయిలలో తనకు నచ్చిన, ముషాయిరాల్లో వహ్వాయనిపించే ప్రజలు మెచ్చిన ఒళ్ళు జలదరించే, అషార్ల నెన్ను కొని స్వతంత్రంగా సుందరంగా అనువదించి సహృదయ సాహితీ జనావళికి ఆమోద యోగ్యంగా కన్నుల పండుగగా కవిగారు 'గజలు సుందరి' నలంకరించి వీక్షించడానికి, సమీక్షించడానికి, రసజ్ఞుల హృదయం రసాలంలా మలచుకోవడానికి అవకాశం కల్పించారని విశ్వసిస్తూ, కవిగారి ఈ ప్రయత్నం సాహితీ మూర్తులు, సాహితీ పరులు హర్షిస్తారని ఆశిస్తూ ఆసాంతం 'గజలు సుందరి' సౌందర్య విశేషాల్ని తిలకించగోరుతూ - సెలవు తీసుకుంటున్నాను. (10.10.1997)

★ అంతటి నరసింహం ★

కవిగారు అక్షరాల కవిగారే . ప్రవృత్తి రీత్యా కవి. అందులోను ఆశుకవి ఆ కవిత కూడా అర్థవంతమైన కవిత.

డా॥ పోతుకూచి సాంబశివరావుగారి ఓ వేదిక మీద ఆయనే నాకీయన్ని 'కవిగారు'గా పరిచయం చేశారు. కవిగారు తన స్వర్ణగోపాల శతకం నాకందించారు. అందులో కవిగారు అనే వుంది. అప్పుడనుకున్నాను కవిగారు అన్నది ప్రసిద్ధమయిన పేరనీ ఆకునూరు గోపాల కిషన్ రావు అప్రసిద్ధ-నామమనీ. ఆ కావ్యమంతా కంద పద్య రచనే అన్నీ ఆశువుగా వ్రాసిన కందాలే. కవిగారి సతీమణి డా॥ స్వర్ణలత, ఆమె ప్రోత్సాహం వల్లనే శతకం వ్రాయడం జరిగింది. ఆమెపై ఆయన కున్న మక్కువ గౌరవం చేత ఆమె పేరూ తన పేరూ కలిపి 'స్వర్ణ

గోపాల' అని మకుటం నిర్ణయించి ఆవేశంతో కవితావేశంతో ఏక బిగిని యిర్వై నాల్గు గంటలలో శతకం రచించారు. ఇదో పెద్ద తపస్సే. ఎంత ప్రజ్ఞో కదా!

కవిగారి గజల్‌సుందరి ఉర్దూ కవుల కవితల అనువాద కావ్యం. అనుసరణ అనడం మంచిది. ఎందుకంటే అందులో కవిగారి ప్రతిభ ఎక్కువగా ప్రతిబింబించింది కాబట్టి.

కవిగారు అక్షరాలా ప్రతిభాశాలి. నాల్గో తరగతి వరకు చదువుకున్న ఉర్దూకు మెరుగులు పెట్టి ఇందరు ఉర్దూ కవులను సుందరంగా అనువాదం చేసే స్థాయికి ఎదగడం మాటలా మరి.

ఇది కవిగారిని అసలు సిసలు మధుర కవిగా నిలబెట్టే కావ్యం. దీని ఉర్దూ కవితా సర్వస్వం అనవచ్చును.

గజలు సుందరిలో ప్రతి వాక్యంలోనూ కవిగారి భాషా భావాలే ఎక్కువగా ప్రతిబింబించాయి.

సృష్టికి ముందటి ఆ పెను చీకటి
కన్న ముందూ తానున్న ఈశ్వరుడు మహా మేటి (గాలిబ్ 112)

ఈ భావం గాలిబ్‌దే. అయితే కవిగారు ఈ భావానికి మెరుగులు దిద్ది వుండవచ్చు. భాగవతం చదివిన పాండిత్యం కవిలో కన్పడుతుంది. ఆ పెను చీకటి కవ్వల మెలిగేవాడే ఈశ్వరుడు అని పోతన్నన్నాడు భాగవతంలో. దీన్నే గాలిబు దర్శించాడు.

గాలిబ్‌ది నిర్వీశ్వర వాదమో నిరాశావాదమో కాని, కవిగారిది మాత్రం నిరీశ్వర వాదంగా కన్పిస్తున్నది. క్రిందిదాన్నిబట్టి.

అన్నిటా నీవున్నావని అంటారు
ఎచ్చోట యెవ్వరూ నిన్ను చూచి ఎరుగరు (గాలిబ్ 83)

గజల్‌సుందరిలోని అనువాదాన్ని గూర్చి దాని సుందరతను గూర్చి ఇంకా వ్రాయాలని ఉంది. అప్పుడు గ్రంథాన్నంతా తిరిగి ఉల్లేఖించినట్లు అవుతుంది. మీరే చదవండి. ఆనందించండి అంతే!



పాలివారి లోనపంచాయితీ లేదు - ఎందుకంటెవేరు ఉంది కనుక
తండ్రికొడుకులందు తగవులు మెండయా- విజ్ఞతానివేశవేంకటేశ!
– కీ.శే. దేవులపల్లి వేంకటేశ్వర రావు (దేవేరా) గారు కవిగారి పెద మేనమామ

# గ్రంథ ఆవిష్కరణ వార్తలు - సమీక్షలు

## అంతటా అలవోకగా ! కవిగారి స్వగతాలు !

ఆశు ధోరణికి సముచిత శబ్దాలను తొడిగి సంవిధానం సంచయనల సంయుక్తంగా విని పించిన కవిగారి స్వగతాలు కవితా సంకలనంలో కవిగారు ఆకునూరు గోపాల కిషన్ రావు అంతటా అలవోకగా కనిపిస్తారని కవితా సంకలనాన్ని ఆవిష్కరించిన ఆచార్య సి. నారాయణ రెడ్డి పేర్కొన్నారు. తన కవితా సంకలనంలో కవి గేయాలను కూడా ఛందో బద్ధంగా రాశారని వచన కవిత్వంలో భావ గాంభీర్యం, తర్కం, తిరుగుబాటు అంశాలు కనబడుతున్నాయని అన్నారు. కవి నిరాడంబర ప్రవృత్తి నిర్మలంగా ద్యోతకమవు తోందని అన్నారు.

తన "మౌనరణం" గజలులో తాను సాధించిన అంత్య ప్రాస యతిని ఆంగ్లానువాదంలో కూడా పాటించిన కవి గోపాల కిషన్ రావు అభినందనీయులని, గురజాడ స్పర్శ ఈ కవి గేయ రచనలో కనిపిస్తుందని అన్నారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతి డ్యాక్టర్ ఎల్లూరి శివారెడ్డి సభాధ్య క్షునిగా ప్రసంగిస్తూ వృత్తిరీత్యా ఎలక్ట్రికల్ ఇంజనీర్ అయిన గోపాల కిషన్ రావు గారు విద్యుత్ నుంచి విద్వత్ లోకి ప్రసరించారని అన్నారు. కవిగారు నివేదికను సమర్పించడమే కాకుండా తనే ప్రార్థనా గీతాన్ని ఆలపించారు. (- వార్త దిన పత్రిక 30.11.1996)

## కవిగారి స్వగతాలు

కవిగారి స్వగతాలు కవితా సంకలనంలో గ్రహణం, సంచయనం లక్షణాలు స్పష్టంగా కన్పిస్తున్నాయని సిటి సెంట్రల్ లైబ్రరీ, చిక్కడపల్లిలో గ్రంథావిష్కరణ చేసిన సినారె అన్నారు. అలవోకగా చెప్పే గుణం సముజ్వలంగా సంచయన లక్షణాలు సముత్తమంగా కవితా రచన పుస్తకంలో చోటు చేసుకున్నాయన్నారు. సభాధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి ప్రసంగిస్తూ ఎన్నో అనుభవాలు ఊహలు రచయిత ఇందులో కూర్చారన్నారు. డా॥ పోతుకూచి సాంబశివరావు మాట్లాడుతూ తెలుగు సాహిత్య రంగంలో కవిగారు అని సార్థక నామం గల కవులు గోపాల కిషన్ రావు తప్ప ఎవరూ లేరన్నారు. ఈ గ్రంథం కవితా గ్రంథమే కాక ఒక కవితాత్మక ఆత్మ కథ అన్నారు. సభలో డా॥ ఆకునూరు స్వర్ణలత, కవిగారు పాల్గొన్నారు. (-ఆంధ్రజ్యోతి డైలీ 30.08.98)

## భావుకుడు 'ఆకునూరు'

ఆకునూరు గోపాలకిషన్ రావు కవితా సంకలనం 'కవిగారి స్వగతాలు' డా॥ సి. నారాయణ రెడ్డి ఆవిష్కరించి కవితా వేగాన్ని నిబ్బరంగా జాలువారించి ఉపయుక్తమైన ప్రామాణిక రచనలు చేసి వాటికి సార్థకత, తమకు ధన్యతను సంతరింప చేసుకోవాలని పేర్కొన్నారు. కవిగారు భావుకత, కవన శక్తి వున్న మంచి కవి అని ప్రశంసించారు. గ్రంథస్థ కవితా ఖండికలు కవిగారి సమున్నత గ్రహణ సంచయన సంవిధాన శక్తిని చాటుతున్నాయన్నారు. అనువాదంలో

కూడా ఆయన మూలాన్ని అభిజ్ఞులు మెచ్చేట్లుగా అతిశయించారన్నారు. అలవోకతను, విశృంఖలతను కనబరచారన్నారు.
సభాధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, పాండితీ ప్రకర్ష, భాషా పటిమ కన్న ఈ సంకలనంలో లాగా కవికి హృదయ స్పందన ప్రధానమన్నారు. అందుకే కవితలు మధురంగా ఉన్నాయన్నారు.

–ఈనాడు డైలీ నవంబర్ 30, 1996

## జమిలి పుస్తకావిష్కరణ

ఆదివారం 6 ఏప్రిల్ హన్మకొండ అశోకా కాన్ఫరెన్స్ హాలులో జమిలి పుస్తకాలు 'కవిగారి సందర్భ స్వరాలు' మరియు 'సుదర్శన్ రచనలు' ఆవిష్కరణోత్సవంలో సభాధ్యక్షత వహించిన ప్రముఖ పాత్రికేయుడు పోతుకూచి సాంబశివరావు 'కవిగారు' కలం పేరుతో ప్రసిద్ధుడైన విద్యుత్ శాఖ ఇంజనీరు గోపాల కిషన్‌రావు కేవలం ఒకటిన్నర సంవత్సరాల కాలంలో 22 గ్రంథాలు వ్రాయడం విద్యుత్వేగాన్ని తలపిస్తున్నదన్నారు. ఆయన 'సందర్భ స్వరాలు' చక్కటి భావాలను పంచుతుందన్నారు.
కవిగారి సందర్భ స్వరాలు, దేవులపల్లి సుదర్శన్ రచనలు రెండు పుస్తకాల నావిష్కరించిన ప్రజాకవి కాళోజీ నారాయణ రావు ప్రసంగిస్తూ కవిత్వం కావాలని రాస్తే వచ్చేది కాదని, మనిషికి మనిషి మీద నమ్మకం తగ్గి దేవతల మీద పెరగడం వల్ల ప్రయోజనం లేదని కవిగారు చెప్పిన వాక్యాలు చాలా బాగున్నా యన్నారు.
కోవెల సంపత్కుమారా చార్య మాట్లాడుతూ, మనస్సును పట్టుకునే తపన సందర్భ స్వరాలు గ్రంథంలో ఉందన్నారు. అజంతా లాంటి కవులు తక్కువ కవిత్వం రాసి ఎక్కువ గుర్తింపు పొందినారని, కవిగారి కవిత్వం ఆ స్థాయిలో ఉందన్నారు. వివిధ సందర్భాలలో ఆయన మనసు ప్రతిస్పందన గ్రంథంలో కన్పిస్తుందన్నారు. అన్ని పండుగల గురించి ఇందులో వుందని, నాగుల చవితి గురించి చెప్పింది అజ్ఞానం నేపథ్యంగా చెప్పారన్నారు.
ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య ప్రొఫెసర్ లక్షణమూర్తి, దేవులపల్లి సుదర్శన రావు, మాదాసు పిచ్చయ్య తదితరులు పాల్గొన్నారు.

## కనుమరుగవుతున్న శతక సాహిత్యం

కవిగారి స్వర్ణగోపాల శతకంను రచయిత పోతుకూచి సాంబశివరావు గౌరవ అతిథిగా ఆవిష్కరించారు. ఈ శతకంలో నిండా సూక్తులు, నీతులు అందరికీ అర్థమయ్యేట్లుగా కవిగారు పద్యాలను వ్రాశారన్నారు. పద్యం రాయడం సులభం కాకపోయినా ధారావాహికంగా రాసిన కవిగారు అభినందనీయులని శ్లాఘించారు.
సభాధ్యక్షులు బిరుదురాజు రామరాజు మాట్లాడుతూ కిషన్ రావు రాసిన శతకంలో మానవతా విలువలు ప్రతి పద్యంలో కనిపిస్తాయని పేర్కొన్నారు. మనం చేప్పే నియమ నిష్టలు అనుష్ఠించినవాడే కవిగారు వ్రాసుకున్నట్లు మనకు విలువ ఉంటుందని అన్నారు.
రచయిత్రి శరత్‌జ్యోత్స్నారాణి శతకం గురించి సుదీర్ఘ ప్రసంగం చేస్తూ మాతృభక్తి, దేశభక్తి, క్రమశిక్షణ, మంచితనం, నిజాయితీ, చిత్తశుద్ధి, అవినీతి, స్త్రీ వాద కవితాంశాలు పట్టుదల ఇలా అనేకానేక అంశాలను తీసుకొని కవిగారు ఈ శతకం అద్భుతంగా వ్రాశారని అభినందించారు.

విద్యావేత్త, శ్రీమతి ఆకునూరు స్వర్ణలత (కవిగారి శ్రీమతి)కి శతక కర్త తన శతకాన్ని అంకితమిచ్చారు. ఆమె శతకం గూర్చి వివరంగా మాట్లాడారు. చివరిగా కవిగారు తన ప్రతిస్పందన వెలిబుచ్చారు. **(ఆంధ్రప్రభ డైలీ, 16.6.97)**

### సామాజిక రుగ్మతలపై కవితాస్త్రం

కవిగారు'కలం పేరుతో ఆకునూరు గోపాల కిషన్‌రావు రచిస్తోన్న కవిత్వం సందేశాత్మకంగా ప్రబోధాత్మకంగా వుందని పలువురు వక్తలు "కవిగారి స్వర్ణగోపాల శతకం" ఆవిష్కరణ సందర్భంగా ప్రశంసించారు. విశ్వసాహితి అధ్యక్షులు పోతుకూచి సాంబశివరావు శతకాన్ని ఆవిష్కరించి శుభాకాంక్షలు తెలిపారు. సభాధ్యక్షులు బిరుదురాజు రామరాజు మాట్లాడుతూ కవిగారు తన గ్రంథంలో మానవత్వ విలువలకు ప్రాధాన్యమిచ్చారన్నారు. పోతుకూచి మాట్లాడుతూ ఇందులోని కందాలు సూక్తులతో కూడి వున్నాయని ప్రస్తుతించారు. రచయిత్రి శరత్ జ్యోత్స్నారాణి మాట్లాడుతూ స్త్రీవాద కవిత్వాన్ని కూడా కవిగారు పొందుపరిచారన్నారు. సామాజిక రుగ్మతలపై తన కవితాస్త్రాన్ని ఎక్కుపెట్టారన్నారు. కవిగారు తన ఆవిష్కృత గ్రంథాన్ని ఆయన అర్ధాంగి డా॥ ఆకునూరు స్వర్ణలతకు అంకిత మిచ్చారు. **–ఈనాడు డైలీ 16.6.97**

### కవిగారి ప్రియాంశాలు పుస్తకావిష్కరణ

ముఖ్య అతిథిగా విచ్చేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ నాయని కృష్ణ కుమారి కవిగారి ప్రియాంశాలు పుస్తకాన్ని ఆవిష్కరించి కవిత్వం రాయడానికి కవులు చాలా మధనపడాలన్నారు. కవికి తన శక్తి మీద నమ్మక ముండాలన్నారు. ఏ కవి అయితే సృజనాత్మకత గల కవిత్వం చేస్తాడో ఆ కవి అతని కవిత్వం శాశ్వతంగా నిలిచి ఉంటాయని అన్నారు. సభాధ్యక్షులు జాయింట్ కమీషనర్ ఆఫ్ లేబర్ ఎన్. ప్రసాద్ రావు మాట్లాడుతూ ఈ పుస్తకంలోని కవితలన్నీ హృదయాన్ని స్పందించేవిలా బాగున్నాయని రచయితనభినందించారు పోతుకూచి సాంబశివరావు మాట్లాడుతూ కవిగారు ఏది రాసినా స్పష్టంగా నిర్భయంగా ఉంటుందని అన్నారు. ప్రియాంశాల నామకరణమే ఓ క్రొత్త దనం అని పేర్కొన్నారు. రచయిత కిషన్‌రావు తన ప్రియాంశాలు పుస్తకాన్ని రచయిత సాంబశివ రావుకు అంకిత మిచ్చారు. గౌరవ అతిథి సాహితీ వేత్త ఆచార్య తిరుమల మాట్లాడుతూ ఆధునిక తెలుగు కవితా రంగంలోకి అడుగిడిన అనతికాలంలోనే తన ప్రతిభా పాండిత్యాలతో కవిగారు ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారన్నారు. సంస్కృతాంధ్రాంగ్ల ఉర్దూ భాషా కోవిదులు కావడం వల్ల ఆయన రచనలెప్పుడూ ఆలోచనామృత ధారల్లాగ ఉంటాయని పేర్కొన్నారు. లోక పరిశీలన ఇలా ప్రతి కవికీ ఉండాలన్నారు. డా॥ ఆకునూరు స్వర్ణలత, రచయిత ఆకునూరు గోపాల కిషన్ రావులు మాట్లాడారు.

**(– ఆంధ్రప్రభ డైలీ 8.10.1997)**

### కవిత్వం తేలికైన సాహితీ ప్రక్రియ కాదు

మంగళవారం నగర కేంద్ర గ్రంథాలయంలో జరిగిన "కవిగారి ప్రియాంశాలు" కావ్యావిష్కరణ చేసి రచయితకు శుభాకాంక్షలు తెలుపుతూ కవి తన భావాలకు అందంగా

అక్షర రూపమివ్వటానికి ఎంతో మధన పడవలసి వస్తుందనీ కవిత్వం అలవోకగా చెప్పే సాహితీ ప్రక్రియ కాదని తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షురాలు ఆచార్య నాయని కృష్ణ కుమారి అన్నారు. కృతి స్వీకర్త పోతుకూచి కృతి కర్తకు ప్రతి సన్మానం చేశారు. ఆచార్య తిరుమల ప్రసంగిస్తూ 'ప్రియాంశాలు'లోని కవితల్లో నేటి సమాజం ప్రతిబింబి స్తోందన్నారు. సాంఘిక సమస్యలను దురాచారాలను, బలహీనతలను తూర్పార బెట్టి పరిష్కార మార్గాల్ని సూచించిన పద్ధతి శ్లాఘనీయంగా వుందన్నారు. మనిషిని మానవో త్తమునిగా మలచాలన్న తపనే ఈ సంపుటికి మూల సూత్రమన్నారు. ఆత్మాశ్రయ, పరాశ్రయ కవితా ధోరణుల మేలు కలయిక ఇందులో కనిపిస్తుందన్నారు. లోక పరిశీలన, ఔచిత్యం, ధారాళమైన శైలి, శబ్ద సౌందర్యం వున్నాయన్నారు.

డా॥ ఆకునూరు స్వర్ణలత మాట్లాడుతూ కృతికర్తతనదైన బాణీలో ఓ ప్రత్యేకమైన స్థానాన్ని సాహితీ లోకంలో పదిల పరచుకుంటున్నారన్నారు. గ్రంథస్థ అంశాలు పాఠకులను ఆలో చింపచేసి ఆచరణకు ఉపక్రమించచేయగలవన్న విశ్వాసాన్ని ఆమె ప్రకటించారు. అధ్యక్షులు ప్రసాదరావు మాట్లాడుతూ పుస్తకంలోని కవితా ఖండికలు ప్రబోధాత్మకంగా సుబోధకంగా ఉన్నాయన్నారు. ఏది రాసినా సుస్పష్టంగా, నిర్భయంగా చెప్పే ధైర్యం కవిగారికి మెండుగా ఉందన్నారు. ఆయన జిజ్ఞాసువు, భావుకుడు, సాధకుడన్నారు. కృతికర్త మాట్లాడుతూ వేదాలను ఉపనిషత్తులను తనదైన చౌపదల రూపంలో స్వేచ్ఛానువాదం చేస్తున్నానని రాజధానిలో ఓ సరస్వతీ ఆలయం నెలకొల్పాలని అభిలషిస్తున్నానన్నారు.

**కవిగారి గజలు సుందరి అనువాదకవిత్వీకరణ : కవిగారు (ఆకునూరు గోపాల కిషన్‌రావు)** స్వగతాలు, సందర్భ స్వరాలు, స్వర్ణగోపాల శతకం, ప్రియాంశాలు గ్రంథాల ద్వారా కవిగా పేరొందిన కవిగారు అసలు పేరు ఆకునూరు గోపాల కిషన్‌రావు. వృత్తి చేత ఇంజనీరు. చిన్నప్పటినుండి ఉర్దూ భాషపై మక్కువ. మీర్జా గాలిబ్ గజళ్ళంటే ప్రీతి. ఆయన గజళ్ళలోని లోతుపాతులు, మాధుర్యంతో పాటు గాలిబ్ జీవిత దృక్పథాన్ని ఆయన బలాలనీ, బలహీనతల్ని పుక్కిట పట్టినవాడు. కనుక గాలిబ్ గజళ్ళతో పాటు మరో 125 మంది ఉర్దూ కవుల గజళ్ళను కూడా అనువదించి గజలు సుందరి'పేరిట గ్రంథాన్ని ప్రచురించారు. మతాన్ని జీర్ణం చేసుకున్న నన్నయాది కవుల్లాగ కవిగారు అనువాదంలో మూలానికి దగ్గరగా వుంటూనే కొన్ని సందర్భాల్లో స్వతంత్రించి మూలంలోని గుప్త భావాలను విస్తరంగా స్పష్టంగా చెప్పారు. తెలుగుకు క్రొత్త పంథాలను సమకూర్చారు. ఏకాంత రసానందాన్ని హాయిగా అనుభవించాలనుకొన్నవారు తప్పక చదవాల్సిన గ్రంథం ఇది

కప్పగంతుల మల్లిఖార్జునరావు, (ఆంధ్రభూమి వీక్లీ, 20.5.99)

**చక్కటి వ్యక్తీకరణ**

ఆకునూరు గోపాల కిషన్‌రావు కవిగారు గజలు సామ్రాట్టయిన గాలిబ్‌వి 246 అషార్లు, వారితో బాటు 125 మంది ప్రాచీన, ఆధునిక ఉర్దూ కవుల గజళ్ళు అనువదించి ఆంధ్ర సాహిత్య ప్రేక్షకులకు అందించారు. దాశరధి అనువాదాల్లో అర్థం గాంభీర్యం ఉంది. ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదులెమ్ము - నరుడు నరుడౌట కడు దుష్కరము సుమ్ము !

దీన్నే కవిగారు
సులభ సాధ్యము కాదు చూడ ఏ పని కూడ
మానత్వమె లేదు మనిషియందున చూడ! అని చేశారు అనువాదకుని ప్రతిభను పట్టిచ్చే గొప్ప వ్యక్తీకరణలు కవిగారిలో ఉన్నాయి.
ప్రతి పరుగిడు పాంథునితో
పరుగు తీస్తి కొంత సేపు
ఇంకయునూ తెలియలేదు
ఎవరన్నది మార్గదర్శి! లాంటి వెన్నో మనల్ని ఆకట్టుకుంటాయి.
కవిగారు ఎంతో ప్రేమతో పరవశంతో నూట పాతిక మంది ఉర్దూ కవుల్ని తెలుగు వాళ్ళకు పరిచయం చేశారు. మీర్ తఖీమీర్ అన్న సుప్రసిద్ధ కవి గజల్ అనువాదం చూడండి.
ఊపుతూనే ఉండే దీపం
రాతిరంతా తలను పాపం
చెవిని పురుగది ఏమి చెప్పెనొ
ఏమి ఆశలు రగుల్కొలిపెనొ !
ఊహా బలం, పరిశీలన, నిర్మలత్వాన్ని, నిసర్గగుణాన్ని ప్రేమించగలగడం వంటి లక్షణాలు ఉంటే విలక్షణ వ్యక్తీకరణలు ఉంటాయి. ఆకులగుండా పడే వెలుగు నీడల్ని, నువ్వుల్తో కలిసిన బియ్యంలా పోల్చిన అల్లసాని ఛాయలు ఇందులో ఉన్నాయి.
జగత్ మోహన్ లాల్ రావణ్ అన్న కవి గీతం అనువాదం
కీర్తి దాహం తీరేది కాదు - పేరు ప్రతిష్ఠల కోరికపోదు
సమాధి రాతిపై నీ పేరది - చచ్చి నీ ఆశ తెలుపకపోదు !
అన్నది చదివితే ఒక కవితలో కీట్సు అన్న, కీర్తి, సౌందర్యం అన్నీ అద్భుతమైనవే! అపురూపమైనవే! కాని మరణం వీటన్నింటికన్నా మహోన్నతమైంది. బతుకు ఇచ్చే ఉన్నతోన్నత బహుమానం మరణం అన్న మాటలు గుర్తుకువస్తాయి. సుకుమార సాహిత్య ప్రక్రియలు పువ్వుల కన్నా మృదువైనవి వాటిని ప్రేమతో సమీపిస్తేనే అవి దగ్గరవుతాయి. గజళ్ళను ప్రేమించిన కవిగారి పట్ల గజలు సుందరి ఒక దరహాసం విసిరినట్లు ఈ పుస్తకం చదివితే తెలుస్తుంది. - సౌభాగ్య (ఆంధ్రప్రభ డైలీ 9.8.98 )

## తెలుగులో గజల్స్

గాలిబ్‌వి కాక మీర్ తఖీమీర్, అమ్జద్, ఫైజ్, ఇక్బాల్, సాహిర్ లుధియాన్వీ, ఖుస్రో వంటి కవుల అనువాదాలు, సమకాలీన కవుల అనువాదాలు, పేర్లు తెలియని కవుల అనువాదాలు అనువదించినారు కవిగారు. ఎక్కువగా ప్రేమ తత్త్వమే ఈ కవితల్లో కనిపించినా లోక రీతి కూడా ఉంది. ఉర్దూ గజళ్ళను తెలుగు వారికి పరిచయం చేసినందుకు ఆకునూరు గోపాలకిషన్‌రావు గారిని అభినందించాలి. ఉర్దూ గజళ్ళను పరిశీలించ దలచిన వారికి ఈ పుస్తకం కరదీపిక. - ద్వా.నా. శాస్త్రి (ఆంధ్రజ్యోతి డైలీ, 30.8.98)

## కవిగారి గజల్ సుందరి

కవిగారి గజల్ సుందరిలో గాలిబ్‌తో పాటు 125 మంది ఉర్దూ కవుల రచనలన్ని (గజళ్ళు రూబాయిలు) వెలుగులోకి తెచ్చారు. వీరు లోకంలోని పరిస్థితుల్ని బాగా గుర్తించి కవితలు రాశారనడానికీ రెండు ద్విపదలు చాలు.

మధువును మనం త్రాగితే మరేం పర్వాలేదు
మధువే మనల త్రాగితే మనకిక మోక్షం లేదు!
వెంట వుండి కన్నీటిని కంట కానలేనివాడు
తన చుట్టూ చీకటిని తానేలా చూడగలడు!

ఇంతమంది ఉర్దూ కవుల కవితల్ని తెలుగువారికి అందించి ఆయా కవుల మనోగతాల్ని మేధాబలాన్నీ తెలుసుకునే అదృష్టం కలిగించి గజల్ సుందరిని అందంగా తీర్చిదిద్ది మనకు దర్శనం చేయించిన కవిగారు ప్రశంసా పాత్రులు

**– వేమూరి వేంకటేశ్వర శర్మ (ఆంధ్రభూమి వీక్లీ, 1.2.98)**

## గజలు సుందరి పుస్తక సమీక్ష

ఉర్దూ కవితలను ప్రత్యేకంగా గజళ్ళను అందులోను మహాకవి మిర్జా గాలిబు గజళ్ళను తెలుగులోనికి అనువదించదలిస్తే ఈ రెండు భాషలలో ప్రావీణ్యం కలిగి ఉండటం చాలా అవసరం.

ఉర్దూ నుండి తెలుగులోనికి అనువదించబడిన కావ్యాలను సమీక్షించడానికి కూడా ఈ అర్హతలు మిక్కిలి అవసరం.

ఎక్కడో విన్న నాలుగు ఉర్దూ పదాలను తెలుసుకొని ఎవరితోనో ఉర్దూలో చదివించుకుని అనువాద గ్రంథాన్ని సమీక్షించ పూనుకోవటం దుస్సాహసం. దయచేసి ఇటువంటి ప్రయత్నాలకు పూనుకోవద్దు. ఇది అటు ఉర్దూ ఇలుల అనువాదానికి అన్యాయం చేయటమే అవుతుంది.

గాలిబు గజళ్ళను తెలుగులోనికి మొట్ట మొదట ప్రఖ్యాత కవి దాశరధి కృష్ణమాచార్య అనువదించాడు.

గజలు సుందరి' అనువాద గ్రంథంలో ఆకునూరు గోపాల కిషన్‌రావు 125 మంది ప్రఖ్యాత ఉర్దూ కవుల ప్రముఖ గజళ్ళను ఇతర ప్రక్రియలను అనువదించినాడు.

గోపాలకిషన్‌రావు తెలంగాణా వాడు. ఇతని వంశం సాహితీ సంపదతో ఆవిర్భవించి అలరారినది. ఉన్నత పాఠశాల కళాశాల విద్యాభ్యాసం నిజాం పరిపాలనలోనే జరిగినందున ఉర్దూ భాషతో పరిచయం తప్పదు. వీరిదంతా కవుల కుటుంబం. ఇంజనీరుగా పదవీ విరమణ తర్వాత ప్రత్యేక కృషి సల్పుతూ సాహితీ సేవలో మునిగి ఉన్నవాడు. కవుల గజళ్ళలోని భావాన్ని గోపాల కిషన్ రావు (కవిగారు) చక్కగా అనువదించ డానికి ప్రయత్నించినాడు. ఇది ప్రశంసించదగిన ప్రయత్నం అని చెప్పక తప్పదు. గోపాల కిషన్ రావు గారు ఈ ప్రయత్నంలో ఇంకా కృషి సల్పి తెలుగు పాఠక లోకానికి మరింత ఉర్దూ సాహిత్యంతో పరిచయం కలిగించగలరని ఆశించుదాం. **– హసీన**

**(ప్రజాతంత్ర వీక్లీ, తేది 15-21-2000)**

# కవిగారి రచనలు

**ఎ. ప్రచురితములు :**

1. కవిగారి స్వగతాలు ( బంధుమిత్రులపై కవితలు 11/93 లో విడుదల.
2. కవిగారి సందర్భ స్వరాలు ( అన్ని పండుగలపై కవితలు 4/97).
3. కవిగారి స్వర్ణగోపాల శతకం ( నూరు మానసీయ విలువలపై కంద సమాలు 6/9).
4. కవిగారి ప్రియాంశాలు ( సామాజిక సమస్యలు- పరిష్కారాలు ఇతర కవితలు 10/97).
5. కవిగారి గజలు సుందరి (గాలిబు మఱియు 125 ఇతర ఉరుదూ కవితల కనువాదాలు 12/97 విడుదల).
6. కవిగారి ఆత్మద్యుతులు సహస్రాధిక ఆత్మిక, ఆధ్యాత్మిక సిరులు.

**బి. ప్రచురణ కానున్నవి :**

7. కవిగారి ఉర్దూ కవితలు
8. కవిగారి ఉర్దూ / తెలుగు అనువాద కవితలు - I
9. " " - II
10. " " - III
11. కవిగారి మనసు- మగువ - మదిర ( ఇతరుల రచనలు అనువాద కవితలు స్వంత రచనలు).- I
12. కవిగారి మనోగతాలు (పాత ఉరూదు హిందీ (100) పాటల తెలుగు అనువాదాలు).
13. కవిగారి మహితోక్తి - మనోజ్ఞములు ( అనేకానేక రచయితల, ఆంగ్ల ఉరుదూ ప్రవచనాలకు తెలుగు అనువాదాలు).
14. కవిగారి - జీవితంతో పోరాటం ( తెలుగు ఆత్మకథ - వచనం).
15. కవిగారి - లైఫ్ - ఎ- స్ట్రగుల్ ( ఆంగ్లంలో వచన ఆత్మకథ).
16. కవిగారి హాస్య తుషారం ( హాస్యోక్తులు, ఛలోక్తులు స్వంత మరియు సేకరణల సంకలనము).
17. కవిగారి భగవద్గీతాంజలి ( శ్రీ మద్భగవద్గీత తెలుగు/ ఆంగ్ల కవిత్వీ కరణము).
18. కవిగారి కదంబ తుషారము ( అన్ని ఇతర రచనలు).

19. కవిగారి Yours Lovingly I (తెలుగు కవితల ఆంగ్ల అనువాదం).
20. కవిగారి Yours Lovingly II (తెలుగు కవితల ఆంగ్ల అనువాదం).
21. కవిగారి Brainy Brights I (ఇతరుల కదంబ కవితల అనువాదం తెలుగు నుండి ఇంగ్లీషు).
22. కవిగారి Brainy Bright II (ఇతరుల కదంబ కవితల అనువాదం తెలుగు నుండి ఇంగ్లీషు).
23. కవిగారి మనోజ్ఞ మనోజములు I (వివిధ అంశాలు సందర్భాలపై స్వీయ కవితలు).
24. కవిగారి మనోజ్ఞ మనోజములు II (వివిధ అంశాలు సందర్భాలపై స్వీయ కవితలు).
25. కవిగారి సూక్తి భాస్కరము (శతకము).
26. కవిగారి ఉపనిషదంజలి •ఈశ •కేన •కఠ •ప్రశ్న •ముండక •మాండూక్య •తైత్తిరీయ •ఐతరేయ •శ్వేతాశ్వతర •అమృత బిందు •స్కంద మరియు •కైవల్యోపనిషత్తులు పన్నెండింటి తెలుగు, ఇంగ్లీషు, హిందీలలో కవిత్వానువాదాలు.
62. కవిగారి వేదాంజలి (వేదాలలోని హితాంశాలు - కవితాను వాదాలు తెలుగు/ ఆంగ్లం).
64. శ్రీమద్భాగవతాంజలి (కవితాను వాదం).
65. శ్రీమద్రామాయణాంజలి (కవితాను వాదం).
66. శ్రీమద్భారతాంజలి (కవితాను వాదం).
67. యోగ వాశిష్ఠాంజలి (కవితాను వాదం).
68. బ్రహ్మ సూత్రాంజలి (కవితాను వాదం).
69. కవిగారి 'సినారె' రచనానువాదాంజలి.

## కవిగారి కరకంకణాలు

- సాహిత్య రత్న -'మనోరంజని' జనవరి 1998.
- గజలు సుందరి ముసన్నిఫ్ - 'మేరా షహర్ మేరే లోగ్' మార్చి 1999.
- విశ్వ సాహితీ మిత్ర -'విశ్వ సాహితి' ఆగస్టు 1999.
- మ్యాన్ ఆఫ్ ఎఛీవ్‌మెంట్ - 'ఇంటర్నేషనల్ పబ్లిషింగ్ హౌస్' జనవరి - 2000.



కవిగారు – మనుమలూ, మనుమరాలితో
గౌతం – శైలల కొడుకు అమోఘ్, ఆకునూరు,
స్వప్న – క్రిష్ణల పిల్లలు వేమూరి శౌర్య, స్ఫూర్తిలతో